శ్రీ రస్తు

# ప్రభావతీ ప్రద్యుమ్న

# గ్రంథ విమర్శనము

చ. "కవిత యనంగఁ బద్యములు గద్యములున్ రచియించుటానె భా
షవిలసనంబు, లోకహితవర్తనముం బచరింపఁజేసి, క
ర్గ్వకును నద్దమె ట్లటుల గ్రంథచమత్కృతి నేర్పు పెంపునన్
బ్రవిమలవస్తుతత్త్వమును భాసిలఁజేయుటగాక యారయన్."

(చాటుధార.)

సూరనార్యుని కాలమునాఁటికి మన తెలుఁగుభాషయందు దృశ్యకావ్యములు లేవు. అన్నియును శ్రవ్యకావ్యములే. ఈతఁడు రాఘవపాండవీయము వ్రాసి తనపాండిత్యప్రకర్షం గనుపఱిచి నాఁడు కళాపూర్ణోదయము వ్రాసి కల్పనాచాతుర్యమును కథారచనాచమత్కారమును వెలయఁజేసినాఁడు. రెండింటియందు ననుఁగూడ దృశ్యప్రబంధమునం దుండఁదగిన లక్షణములు విశేషముగ లేవు; అట్టి కొఱంతఁ బాపం దలంచి యీశ్రవ్యప్రబంధముననె దృశ్యప్రబంధలక్షణము లన్నియుం బుట్టించి నాటకపాత్రము లన్నియు నెదుటకు వచ్చి నటించినట్టు లీగ్రంథమును రచియించినాఁడు. ఈప్రభావతీప్రద్యుమ్నమున విశేషభాగము సంభాషణ వైచిత్ర్యమే. ఆపట్టుల మనము శ్రద్ధతోఁ బరిశీలించి చదివితిమేని, దృశ్యప్రబంధలక్షణము లెంతవఱకిం దిమిడి యున్నవో తేటతెల్లము గాఁగలదు. ఇం దీతఁడు నెలకొల్పిన రంగస్థలముల జాగరూకతతో విడఁదీసి మధ్యమధ్య సందర్భ

ములను విష్కంభరూపమున సమర్చుకొని కొలఁదిమార్పులు గావించుకొనినచో, నిది యొక చక్కని నాటక మగును.

ఈ గ్రంథము నందలి ఇతివృత్తము కేవలము కల్పితము వలెనే గన్పట్టును. కాని గ్రంథావసానమునం దీతఁడు చెప్పించిన—

తే. "అఘహరణ హరివంశకథాశ్రయంబు
నాత్మపుత్రగుణ స్తవనాంకితంబు
నైన యీకావ్యమునకు మహాప్రసిద్ధి
యిచ్చుఁగావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు."

అను పద్యమునుబట్టి ఇయ్యది హరివంశమునందలి కథనుఁబట్టి వ్రాసినట్టు లూహింపఁదగియున్నది, కాని హరివంశమునం దీకథ గనుపట్టుట లేదు. ఈ కథయందలి ముఖ్యసంగుపట్టు లన్నియును బరికించిచూచినచో అనిరుద్ధచరిత్రయందలి కథపట్టులే పెక్కులు గానంబడియెడును. ఆయనిరుద్ధచరిత్ర హరివంశము లోనిది. ఆకథయందలి శోణపురమే యిందలివజ్రపురము. అచ్చటి పార్వతీవరమాహాత్మ్యమే యిచ్చటి పార్వతీవరమాహాత్మ్యము. అందున్న స్వప్నమే యిందలి స్వప్నము. అచ్చటి బాణాసుర వధయె యిచ్చటి వజ్రనాభవధ. ముఖ్యాంశము లిందుండి గ్రహించి షేక్స్పియరు మూలగ్రంథములలోని కథను దన యిచ్చవచ్చినట్లు మార్పుఁజేసి తననాటకమును రచించి, మూల గ్రంథమునందు లేనిప్రాశస్త్యమును తనగ్రంథమునం దసదృశముగ నెలకొల్పి సర్వోత్కృష్టముగ గ్రంథమును రచియించినట్టు లితఁ డీగ్రంథమును రచియించినాఁడు. ఈ గ్రంథమునం దీతఁడు

మార్చుకొనిన మార్పులను బరికించి చూచినచో ఆహా! ఈతని ప్రతిభావిశేషము, సందర్భశుద్ధి, పాత్రౌచిత్యముఁ గుణపోష ణము నెంత శుద్ధముగను, అప్రతిమానముగను గానంబడును?

ఈ గ్రంథమునందలి కథాపర్యవసానము వజ్రనాభుఁడు అసమానబలపరాక్రమసంపన్నుఁడు పోటుమగలకడ నెక్కడనో గాని సాత్త్వికభావ ముండు టరుదు. పూర్వపురాక్షసు లంద ఱును బలపరాక్రమసంపన్నులై తామసగుణప్రధానులై వఱ లినవారె. అట్టివా రందఱివలెనే యీతండును దయావిహీనుం డగు క్రూరకర్ముఁడు చండశాసనుండు ఎండయును గాలియును గూడ నీతనిపట్టణమున నితనియాజ్ఞ లేక ప్రవేశింపరాదు. బల మున్నది. పరాక్రమ మున్నది. చండశాసనత యున్నది. దయ లేదు. ఇంక నీతనివిజయయాత్ర లెంతదారుణముగ నుండునో చెప్పవలసిన దేమి? రావణుఁడు మున్నగు నిట్టికూ్రరాత్ము లందఱి కిని భగవంతుఁ డొక్కటిమాత్రము లేకుండఁ బ్రసాదించినాఁడు. ఏ నుందురా 'లౌక్యపరిజ్ఞానము, దూరదృష్టి, దూరశ్రవణము, ఇవిగూడ వీరికడనుండెనా, లోకమంతయును నశించియే యుం డును. ఈ వజ్రనాభుఁడు ఎదుటివాని మాయమర్మముల నెఱుఁ గనివాఁడయినట్టు ఇంద్రునిపై నితఁడు దాడివెడలినపట్టున నింద్రుని వంచనావచనములకు లోనయి గొంతవఱకు నాతనియింట విం దయియుండి పిమ్మటఁ గొంతకాలమున కెవ్వరివలననో యది మోసకృత్యముగా గ్రహించి ఇంద్రునిఁ దూలనాడి, రాజ్యము నాక్రమించుకొనఁ దలంచినాఁడు. దాని కింద్రుఁడు మఱియొక యుక్తినిఁ బన్నఁగా మఱల నావలలోఁ బడిపోయినాఁడు. రాజ్య సంస్థాపన బలపరాక్రమయుతులు గలవారి కంటెఱకును, సుకరమే

గాని రాజ్యతంత్రజ్ఞత నెఱుంగనివాని కారాజ్యమును నిలువఁ బెట్టుకొనుట సాధ్యము గాదు. అందుచేతనేగదా, అంతటిమేటి మగలైన రాజపుత్రవీరు లందఱును రాజ్యపరిచ్యుతిం గాంచినది. మహమ్మదీయరాజ్యము లన్నియు నస్తమించుటకుఁ గారణ మేమి? ఎవ్వరో యక్బరువంటి మహానీతిసంపన్ను లొక రిద్దఱు వినాతక్కిన మహమ్మదీయులందఱురును కేవలలోకజ్ఞానశూన్యులే. ఇట్టివాదిని జయింప బుద్ధిబలమే పనిసేయవలయుం గాని, బాహుబలము కార్యకారి గాదు.

బృహస్పతియోచనాసామర్థ్యము ప్రస్తుత కార్యసాధనో పాయమైనది. కాని సంపూర్ణవిజయమునకుఁ జాలినది గాదు. సర్వతంత్రస్వతంత్రుండైన శ్రీకృష్ణుండుగూడ వజ్రపురప్రవేశ మునకు మాత్రము మార్గమును గనిపెట్టఁగలిగినాఁడు. విజయ కార్యమున కెన్నియేని సాధనములు గావలయును. అన్నియు నొక్కరికి స్ఫురించునా? ఒక్కొక్కబుద్ధి కొక్కొకటి బోడ కట్టును. అందువలననే యిట్టికార్యముల కనేకులు గలసి యోచనఁ జేయవలసివచ్చుచుండును.

ఇంద్రుం డింకొక్కయుపాయమును గనిపెట్టెను. ఇంద్రునివేగరులు తక్కినయుపాయములను గనిపెట్టినారు. అన్నియును గలిసినంగాని విజయకార్యసన్నాహము సంపూర్ణమైనది కాదు. ఈ విజయమునకుఁ బ్రధానోపకరణములు ప్రభావతీ ప్రద్యుమ్నులు. వారి కొండొరులపైఁగలిగిన యనురాగమునకు దైవనియుక్తియె కారణము. అయ్యది శుచిముఖి పరిముఖమున నభివృద్ధిం గాంచినది. రావణుని వినాశమునకు విభీషణుఁడును, శత్రువీరునియం దాతని కుదయమైన భక్తియును గార

ణము లైనటుల యిందలి వజ్రనాభవినాశమునకు రాక్షసకుల మున కంతకును వైరియైన శ్రీకృష్ణుని కుమారునియందుఁ బ్రభా వతికి అనురాగ ముదయించుటయే కారణ మైనది. వీరిద్దఱును జెఱియొకపక్షమున నున్న వారు. వారియనురాగ మభివృద్ధిసేయుట కెంత నేర్పరి యనుసంధానకర్తయైయుండవలెనో యోచింపుఁడు. ఒకవైపున నూయి, ఒకవైపున గోయి; ఒకమూల రాజకార్య నిర్వాహణము, ఒకమూల నాత్మసంరక్షణోపాయము, రహస్యపరి రక్షణము, ఇన్నియు జరుగుచుఁ గార్యానుసంధానము కావ లయు. భారతయుద్ధమున రాయబారము నడపుటకు శ్రీకృష్ణుఁ డెంతసమర్థుఁడో, యీ గూఢ తంత్రనిర్వాహణమునకు మన శుచి ముఖి యంతనిర్వాహకురాలు. అట్టి పాత్రనిర్మాణము గావించు టలో స్వభావమున కించుకయైన వెలిగాకుండ తన యాశయ మును తుదముట్టించిన మన గ్రంథకర్తమేధావిశేష మెంతయును ప్రశంసనీయము. ఈ హంససందేశము ఈతనికి నలదమయంతు లిద్దఱకు ననుసంధానమును గలిగించిన హంసనుబట్టి స్ఫురించి యుండును; కాని ఆ సందేశమునకును దీనికిని ఎంత వ్యత్యాస మున్నది! ఎంతటి రాజ్యతంత్రజ్ఞులకును నిట్టి సందేశము నడ పుట దుర్ఘటము. ఒకచోట రాజకీయ వ్యవహారములు చక్కఁ బడవలయు. ఇంకొకచోట శృంగారవిషయము లనుసంధానము నొందవలయు. ఒకచోట భీష్మించి మాట్లాడవలయు. మఱి యొక్కచోఁ దనయొత్తు తగ్గి ముచ్చటింపవలయు.

ఈ కార్యమునకీయొక్క రాయబారము చాలినది కాదు. ప్రస్తుతకాలమునఁ బిట్టలను వేగునడపుటకుఁ దయారుచేయు చున్నట్టును ఆపిట్టలు ఎక్కడకు బోయి ఎట్టు లాకార్యము

నడుపుకొనవలయునో యట్లు రహస్యభంగముగాకుండ నిర్వ హించుచున్నట్టును సమరవ్యూహతంత్రములపట్టున మనము గ్రంథములం జదువు చున్నాము ఇందలి చిలుకరాయబారము గనుంగొనిన నీతంత్రములు ద్యోతకములు గాకమానవు. ఈ గ్రంథకర్త తానొక స్థలమునఁ జెప్పినమాదిరిని మఱియొకచోటఁ జెప్పుటకుఁగాని, ఒకరు చెప్పినమాదిరి ననుకరించి చెప్పుటకుఁ గాని ఇష్టపడువాఁడుగాఁడు ఈతని యపారప్రతిభ యవ్యాహ తముగా నవసరము వెంబడిని నూతనసృష్టి యొనర్చుచుండును.

అంతఃపురసమాచారము లాస్థానమున కెక్కరాదు. ఒకరికడ దూతికలుగనుండువా రింకొకరికడ దూతికలుగ నుండరు. ప్రద్యుమ్నుఁ డొక్కఁడును గార్యనిర్వహణమునకుఁ జాలఁడు. అతనికి వెనుకసాహాయ్య ముండవలయును. ఈ సహా యమునకై తక్కుంగల గుణవతీచంద్రమతులఁ గల్పించి వారికి గదసాంబులయం దనురాగ ముదయింపఁజేసినాఁడు. వారికడ వార్తాహారిణిగఁ జిలుక నొకదానిని సృష్టించినాఁడు. ఈ చిలుక బుద్ధికిని హంసబుద్ధికిని వ్యత్యాస మెంతయుండునో యారెండు పాత్రములను బరిశీలించి చూచువారల కది విదితము గాక పోదు. చివరకు గార్యము సమగ్రముగ నిర్వహించుటకు శుచి ముఖి సాహాయ్యమే యవసరమయినది.

ఈ వ్యాపారమున కంతకును శుచిముఖియే సూత్రధారి. శుచిముఖికిఁ దెలియనివ్యాపార మేదియు నీవ్యూహమునందు లేదు. శుచిముఖి కథారంగమునఁ బ్రవేశింపఁగనే ఇంద్రోపేంద్రు లిరువురును వెనుక కొత్తిగిలిరి. ఈశుచిముఖి సర్వరహస్యములను బుక్కిటంబట్టి యెప్పటి కేది యెంత యవసరమో యంతియేగాని

యెక్కుడుగ బయలుగాంచనీయక తనకార్యమును జక్కఁగ నిర్వహించుకొనినది. ఈరహస్యమునం దేది యించుక యసమయమున బయలుపడినను బ్రధానకార్యమంతకును విఘ్న మొదవుటయేగాక ప్రద్యుమ్నుఁడును దదనుచరులును గూడ శత్రుని చేతిలోఁ బడిపోయియుందురు. ఈపట్టున గ్రంథకర్త యాపాత్రములఁ గత్తివాయిమీఁద నడిపించెను. ఆనడిపించుటలో అతి నిగూఢము లగువిషయములను బహిరంగముచేయుచు బహిర్గతములైనట్లు పాఠకులకును ఆయాసందర్భము నెఱింగినవారికిని దక్కఁ దక్కినవారి కెవ్వరికినిఁగూడ గోచరము గాకుండ సఫలీకృతప్రయత్నుఁడయ్యెను. సందర్భము లెఱింగిన ప్రభావతిగూడఁ బ్రద్యుమ్నుఁడు వజ్రనాభుని సంబోధించు సందిగ్ధవాక్యముల యితరార్థమును గైకొని డోలాందోళితహృదయయై ప్రాణములఱచేతిలోఁ బెట్టుకొని శుచిముఖి యభయవాక్యమునఁ గాని తెప్పఱిల్ల లేకపోయెను. ఎంతటిసాహసకార్యము !

ఈతని గ్రంథముల ముందువచ్చెడియూహ లెవ్వియో యాతఁడుచెప్పినఁ దెలియవలయునేగాని యిది యిట్టిదని యూహింప మఱి యెవ్వరికిని శక్యముగాదు. ఎంతప్రగల్భులైన కవులైనను దక్కినవారియూహ లింత నిగూఢములు కావు. వారు ముందువేయఁబోవు ఎత్తులు కొంచెము దరిదాపుగఁ జదువకుండ నూహించి చెప్పవచ్చును. ఈతని వట్లు కావు.

వంచకవేషములు వసుచరిత్ర, మనుచరిత్ర, ప్రభావతీప్రద్యుమ్నము ఈమూఁడిటను గూడ నున్నవి. మొదటిదాని యందలిమోసము ఎంతకప్పిపెట్టినను దాఁగినదియెకాదు. రెండవ

గ్రంథమునం దొక్కసందర్భమున గ్రంథకర్త యెదుటివారి కన్నులు చేతితో మూయవలసి వచ్చినది.

ఈకావ్యమునం దన్ననో! అందఱును గన్నులు తెఱచి కొనియే యున్నవారు. బహిరంగముగ మాటాడుచున్నవారు. హృదయభావములు వెల్లడి యగుచున్నవి. అన్యులెవ్వరికిని దెలియుటలేదు. గోచరమయిన నగుటలేదు. పట్టుపడుటకు మార్గమును లేదు. ప్రతిసృష్టి యన నిట్లుండవలదా? షేక్స్పియరు (Twelfth Night) ద్వాదశయామినియందిట్లే ఆఁడుదానికి మగవేషమువేసి భ్రాంతిఁ గొల్పినాఁడు. అదియు నిట్లే యెంతకొట్టుకొనిన నెవ్వరికిని బట్టుపడినదికాదు, కాని దానికిని దీనికినిఁ గూడ గొంత వ్యత్యాస మున్నది. ఇది కేవలనటవేషము. అందలి దట్టిదికాదు. మోహసందేశమునకై విశ్వాసపాత్రుఁ డొక్కఁడు వార్తాహారిగఁ బనుపఁబడినవాఁడు. అచ్చట ననుమానించుటకైన నవకాశములేదు. ఈగ్రంథమునం దట్టి యవకాశము లేకపోలేదు. ఆయవకాశము చిక్కకుండుటకు వ్యూహతంత్రములందు బుద్ధి పోకుండుటయే కారణము. దీనికిఁ గలుగునడ్డంకులన్నియును మొదటనే తొలగించి తా నేర్పఱచినమలుఁగు విడిపోకుండఁజేసినాఁడు. భ్రాంతియుతులం జేయుటయం దిట్టి నేర్పుండవలదా?

కార్యము సమకూర్చినాఁడు. ఎట్లు? దొంగనుకన్నమునఁ బంపి గుమ్మమున రప్పించినాఁడు. ప్రద్యుమ్నుని పోయిన మార్గముననే రప్పింపక వేఱొండుత్రోవ నేల రప్పించె? కార్యసాధనమామార్గమునఁగాని కాదు గనుక నట్లుచేసె నందురా? కార్యసాధనమున కది యుపాయమె కావచ్చుంగాని, ప్రద్యుమ్నుఁ

డట్లు చేయకున్న నతని యుదారభావములకును, అతని సాహస గాంభీర్యములకును, ఎంతటివెలోటువచ్చునో యదిపరికించి చూచి నారా? రాకపోకలకుఁ ద్రవ్యించుకొనిన సొరంగము లక్కి యుండిన నుండనిండు. యుద్ధము తటస్థమైనప్పుడు పరాఙ్ముఖుఁడై పెడదారిం బోవుట వీరునకు లక్షణమా? ఈతఁ డెట్టి వీరుఁడు? పిఱికికండలేని బిరుదుమగఁడు. అట్టివాఁ డెంతటిప్రతి వీరుఁ డడ్డము వచ్చినను జావనైనఁ జచ్చుఁగాని వెన్నిచ్చి పఱచునా?

కవి యీతనివిక్రమము నిట్లు వర్ణించినాఁడు.—

చ. భిదురధరుండు చక్రియును బెట్టుగ దీర్ఘ విచార మింతచే
యఁదురఁట దైత్యుఁ డెంత బలియుండొ కదా యను కోఁచవార కి
ట్లుదుటున వానిఁ ద్రుంతు నను నొక్కని బంపిన నంటిచాల జే
యిది సెఱవైనబంటుతన మిట్టిది నీక దగుం గుమారకా.

ఉ. కయ్యపువేడ్క రేచుకొని క్రమ్మెడు త మ్మెదిరించి యేమియుం
డయ్యక కొంతసేపు పెనుఢాకను జేతులకాఁటినిల్చు వాఁ
డెయ్యెడఁ బోటుబంటునకు నెంతయుఁ గౌతుకకారిగాఁడె నీ
నయ్యసురేంద్రు తోడి యని దాన యొనర్చుట యుక్త మెన్నఁగన్.

ఆ. తమకుఁదామె ప్రల్లదంబునఁ బనిలేని, కయ్యమునకుఁ జనరు గాని తగిన
దురములైన దిపురుదురు తమయంతన, పిఱికికండలేని బిరుదుమగలు.

అట్టిప్రద్యుమ్నుఁడు కన్నమున పోయినాఁ డని చెప్పుట కన్న విరసమగువాక్య మొక్కటియుండునా? ప్రభావతి పతి భక్తికిని, పితృభక్తికిని నిదానమయిన సచ్చరిత్ర. అట్టి యాపె ఉభయులకును గయ్యము లేకుండఁ బోయెడు తెన్నునకయి

యెంతయో యత్నించి కానక, మూల నున్నఖడ్గమును దానె కొనితెచ్చి యిచ్చినది. ఈ క్రిందిపద్యముం జూడుఁడు.

చ. అని తనుఁగూర్చి దానవకులాగ్రణిపైఁ దెగలేని చింత సే
యుచు నధిపుఁ గోటలగ్గలవు నుగ్రత దగ్గఱు భూరిసైన్యుఁ దం
డ్రినిఁ బరికించి యింతి విభునిం దమ గాచికొనంగ వేఱొక్రో
వ వెదకి కాన కంతఁ బితృవత్సలభావముఁ బొఱనూకుచున్.

ఈపై మార్గముగాక ఆవీరున కనురూపంబయిన మార్గము మఱియొక్కటి యెవ్వరైనఁ జూపుదురా ?

ప్రద్యుమ్నుని యంతఃపురప్రవేశము కేవలమును స్వభావ విరుద్ధముగ నున్నదేమి ? ఇంక గత్యంతరము లేక సూరనార్యుఁ డట్లు వ్రాసె నందురా? గత్యంతరము లేకపోలే దని చెప్పుటకు గదసాంబుల ప్రవేశము నిదర్శనము లేదా ? అచ్చటఁ గలిగిన మార్గ మిచ్చట యేల లేకపోయినది? "గదసాంబుల ప్రవేశము ప్రద్యుమ్న ప్రవేశానంతరము. ప్రద్యుమ్ను నంతటిసమర్థుఁడు అంతఃపురమునం దున్నాఁడు గనుక నట్టిమార్గము పొసంగెను. లేకున్న రహస్యభంగ మయిపోవు" నని చెప్పుదురు కాఁబోలు? రహస్య భంగమగుటకు బూర్వమునకును బరమునకును భేదము లేదు, అట్టి రహస్యములు నిగూఢములుగా నుంచుటకు అంతఃపురపరిచారికలసహకారము లేకుండ నిట్టికార్యము లెప్పుడును బొసంగనే పొసంగవు.

చ. అరయఁగఁ దల్లి కక్క చెలియండ్రతుఁ దక్కను గల్గినట్టిచు
ట్టరికము వారికి స్మెరయ డాచురహస్యము లీనిజాంతర
స్మరవికృతిప్రవర్తనల మాటలు వీని వినంగ నాప్తలై
పరగెదు నెచ్చెలుల్ చెలికిఁ బ్రాణము లిచ్చిన నప్పు దీరునే.

అను పద్యమునుబట్టి, రాగవల్లరి మున్నుగాఁగలయంతః పురపరిచారికల కందఱకును ఈసమాచారము మొదటినుండియును దెలిసినవిషయమె యనునది పాఠకులకందఱకును గ్రాహ్యమే, అందువలన రహస్యపరిరక్షణ కేలోటును గలుగ లేదు. ఇంక స్వభావవిరుద్ధప్రవేశ మేల యందురా! ఆకాలపుఁ గవులకును పాఠకులకును స్వభావవిరుద్ధకార్యములయినను అద్భుతరసాపూర్ణము లయినఁగాని సంతోషదాయకంబులు గాకుండెడివి. షేక్స్పియరువంటిమహాకవిగూడ నీస్వభావవిరుద్ధ కార్యములఁ దననాటకపాత్రమున కలవరించి యున్నాఁడు. ప్రద్యుమ్నుఁడు మాయావి. 'నహి మాయాయా మసంభావ్య మస్తి' యను సూక్తి నొసంగి అతనికి మాయానటనలయందుఁ గలసామర్థ్యమును గనఁబఱిచినాఁడు. అట్టి యద్భుతము లా కాలపువారలకు వింతగాఁ గనఁబడునవిగావు. అంతియె గాని యిట్టి యద్భుతకల్పనల నలవరించిన సూరనార్యునకీమాత్రపు మార్గాంతరము దొరకినది గా దనుట కేవల మసంగతము.

ప్రభావతీప్రద్యుమ్నుల విరహావస్థల వర్ణించుపట్టున మఱియొకవైచిత్ర్యము గనందగు. ప్రభావతీవిరహావేదనకుఁ గారణము కనుకలి. ప్రద్యుమ్నునకు వినుకలి. ప్రభావతికిఁ జిత్రపటమును జూచుటతోడనే కుతూహలము ప్రారంభమయి అయ్యది క్రమక్రమముగ విరహావేదనగ మాఱి ప్రాణాపాయమునుగూడ దెచ్చునంతటిది యైనది ప్రద్యుమ్నునకుఁగూడ నంతిమావస్థ యిట్టిదియెగాని ప్రథమావస్థయం దిరువుర స్థితికి నెంతయో వ్యత్యాస మున్నది. ఈవ్యత్యాసమునకుఁ గారణ మేమియో యూహింపవలసియున్నది. ప్రభావతికి ప్రథమావస్థ

యందే ధైర్యసంచలనము. ప్రద్యుమ్నునకు శుచిముఖివర్ణం పూర్ణమయి యాసందేశహారి పోయినవెనుకఁగాని అట్టిది సం ప్రాప్తమైనది గాదు. దీనికిఁ గారణములు రెండు. శ్రవణసాహా య్యమునకన్న, ఈక్షణసాహాయ్యమున, వస్తుగుణాగుణములు శీఘ్రతరద్యోతకములు. అందువలనఁ బ్రభావతికి శీఘ్రముగ మనస్సు చలించుటకును, ప్రద్యుమ్నున కట్టిది కలుగకుండుట కును గారణ మైనది. అదిగాక ప్రద్యుమ్నుఁడు ధృతిమంతుఁడు. ధృతిమంతునకును వీరునకును ధైర్య మొకపట్టునఁ జెదరరాదు. వీరుల మనస్థైర్యము లోకపట్టునఁ జెడక నిలుచునట్టివి గనుకనె వా రేకార్యమునందును నిశ్చలులై నిల్చుటయును, అయ్యది పూర్ణముగావించుకొనినంగాని అందుండి మనస్సును గదలి రానీయకుండుటయును, గాంచు చున్నారము. ఏవీరునైనను జూడుఁడు. ఇట్టిధృతిరాహిత్య మెచ్చటనైన నున్నదేమో? ఇది రెండవకారణము. ఒకసారి యాతడు వినిన సంగతులన్నియును మనస్సున కెక్కినవి. మననము ప్రారంభమైనది. ప్రస్ఫుటమైన యనురాగ మంకురించినది. అప్పటినుండి ప్రభావతికివలెనె అత నికి నివమెత్తినది. ఉభయులకును దృఢ మోహాము మనస్సున నిలిచి యింక మృత్యువే శరణ్యముగా నుభయులు నెన్నుకొనిన పిమ్మటవారియుభయులకును మైత్రిసంఘటిల్లినది. స్త్రీలధైర్యము పురుషులధైర్యముకన్ననధికమయినది. సఖీజనస్వభావం బెంతటి మన్మథబాధాసమాధీనం బైనను గర్తృపతావలంబి గాదు. అట్టి పక్షం బెల్లవేళల పురుషస్వభావంబు ననుసరించియుండు. అట్టిచో నియ్యెడ విరుద్ధధర్మాచరణము గానంబడినది. దాని కేమికారణము? 'భావన చేసిచూడ క్షణభంగురమింతులతాల్మికల్మి వా,

తావిలపల్లవాంచలహిమాంబుకణంబును నంతకంటె మేలు' అని కవియే దానిని వ్యక్తీకరించి యున్నాడు. ఒకసారి స్త్రీల మనంబు నందలి ధృతి తగ్గినా, అందువలన నెంతటి విపరీతములైన నుత్పన్నము లగు. వారియెడ సాహసము హెచ్చు.

ఇంకొక్కటిం గూడం బరిశీలించి చూడవలయు. ప్రద్యుమ్నునిం గూర్చి ప్రభావతికిం జెప్పెడుపట్టున, నామె నూరించి యూరించి చెప్పుటకును, ప్రశ్న వేయుటయే తడవుగం బ్రద్యుమ్ను నికడ కథ యంతయును నేకరువుపెట్టుటకును, కారణమును తెలిసికొనవలయును. స్త్రీలకు స్వభావముచేతం జాపల్యము హెచ్చు; చాపల్యమువలనం గలిగినయేభావముగాని స్థిరముగ నిల్చి యుండదు. అందువలన మనస్సును గట్టిగం బట్టిచూచిననే గాని, అది యెంతవఱకు స్థైర్యముగ నుండునో యెఱుక పడదు. ఎవనికింగాని, విశేషప్రయత్నముమీద లభ్యమైన పదార్థమునం దున్నంత ప్రీతి, అప్రయత్నలబ్ధపదార్థముమీద నుండదు. ఏ పదార్థముగాని మనకుదూరమునందున్నది యని యనుకొనినంత వఱకు దానియందు మన కభిరుచి హెచ్చుగా నుండును. మనసము హెచ్చయి దానియందె, తదేకధ్యానము కలిగినచో అయ్యది హృదయస్థమయి యూడంబెఱుకవలయునన్నను నూడి రానంతటిమనోనిశ్చలత యేర్పడును. అట్టిపరీక్ష చపలచిత్తలగు స్త్రీలయం దెక్కుడుగ నావశ్యకము.

ఇది మోహపరీక్షకే యుద్దేశింపంబడినట్టు కవియే యీ క్రిందిపద్యముల వ్రాసినాడు:—

చ. అది తలపోసి కుందందగు నా యదునందనునందు నున్న నా
    మది తెలుంగుక జగజ్జనని మాటలు జెప్పంగ వించు శంకచే

నెడు పురుషాంతరానుకృతి చేకుఱునో యని నీకు నింక నా
హృదయగతాములోఁ తుఁ గానఁబడవే నెఱిఁగింతుఁ బ్రతిజ్ఞయొండిఁకన్.

చ. మదికతమిఁజూడఁ గొన్ని వెడమాటలు పల్కితి ....

ప్రద్యుమ్నుఁడు రాజకుమారుఁడు పురుషుఁడు వ్యవహార జ్ఞుఁడు. అట్టియాతఁడు చప్పున తనమనస్సు బైటఁబెట్టువాఁడు కాఁడు. కార్యమనుసంధానముగావలయు. తాను వార్తాహరణ కృత్యము పూని యున్నది. ఆకృత్యము నెఱవేఱుట 'చెప్పటి కెయ్యది ప్రస్తుతమోఅప్పటికామాట' లాడవలఁగును. శుచిముఖి కడనున్న కార్యసంధానవిధానతత్పరతయు, నెదుటి హృదయ మర్మము లెఱుంగునేర్పును,మఱియొకరికడ లేవు. అందువలన శుచి ముఖి తనకార్యము నిర్వహించుకొనుటకై తానే అప్రస్తుత ప్రసంగము గాకుండ, జక్కఁగ సమయము గనిపెట్టి ఆమెరూప లావణ్యాదులనభివర్ణించి యాతని మనస్సున కెక్కించినది. అతని మనంబు బయటఁబెట్టుకొనకుండుటకుఁ గారణములు రెండు. మొదటిది శుచిముఖి వేరఁబనిచినయుత్తరంబున నిట్లు వచియింపఁ బడి యున్నది.

సీ. ప్రప్రభాభావతిఁ బలుదెఱంగులనీవు, వచియింప నపుడు నిర్వచనవృత్తి
నేనున్కి కల్లగుట్టింతియె కాని.........

రెండవది యాతని స్వగతవాక్యంబున నిట్లు జెప్పుకొని వలపోసి నాఁడు.

చ. ఇది పదిలంబుగా నడుగ కే నపు డక్కట! కోర్కిఁదాఁచి న
ట్టి దొరతనంపునీటు ప్రకటించితిఁ బాపపులజ్జ నన్ను నో
రదిమె ననాదరంబు తెఱపై యది హంసికిఁ దోఁచెనేమొ ని
ల్వద మఱియించుకైన గఱువ ల్చవిగానికథ ల్వచింతురే.

ప్రద్యుమ్ననకు ఆతనిమాయానటనలమూలమునఁ గాని వజ్రనగరప్రవేశము గలుగదు. ఆతఁడు వృత్తిచేత వేషధారి గాఁడు. పుట్టుకచే రాజకుమారుఁడు. అట్టి యాతఁడు లోటుపాటు లేవియు లేకుండఁ బైకుఁకుఁ దన యాంతరోద్దేశము లేవియును నెఱుకపడనీయకుండ, కేవల మదియే వృత్తిగాఁగల నటుఁడు ప్రవర్తించినటుల ప్రవర్తించి విజయము నందినాఁడు. ఇయ్యది కేవలమును గథాకార్యనిర్వహణమునకే కల్పింపఁబడియెనో సూరనార్యుని ప్రద్యుమ్నుఁడే ఇట్టివాఁడో మన మారసి చూడవలయు. ప్రద్యుమ్నపాత్రప్రవేశము మన కెట్లు జరిగినది ? అశ్వమునెక్కి కందుకక్రీడ సేయుతఱి ఆతఁడు మనకు రంగమునఁ బ్రప్రథమమున నగపడినాఁడు. ఆ క్రీడావిశేషసమయమునఁ గవి యాతని వర్ణించినవర్ణననుబట్టి యాతని కెట్టి శరీరలాఘవ మున్నదో ఆయావిద్యలయం దతని కెంతనేర్పుగలదో యెఱుకపడుట లేదా ? ఆతని యుత్తరప్రవర్తన కీపూర్వరంగప్రవర్తన మెంతయును సమంజసముగ లేదా ? అదియునుం గాక శ్రీకృష్ణుఁడు ప్రద్యుమ్నుని వర్ణించుపట్టున

చ. "బలవిభవాభిశోభితుఁ డభంగురశౌర్యధురంధరుండు కా
వలసిన మాయలు న్దివిజవైరులకంటెఁ గరంబు నేర్చు ........"

అని చెప్పియున్నాఁడు. ముందు తనపాత్రమున కెట్టిప్రవర్తన మలవరింప నెంచెనో యందునకుఁ దగిన యుపపత్తి ముందుగనే గల్పించి మొదటినుండి చివరవఱకు నాతనిప్రవర్తన మంతయును సరసముగ నిలిపికొని వచ్చినాఁడు.

మొదట శుచిముఖి యాతని సందర్శించినతఱి నెంతయో గుట్టుగ నుండి తనమనం బేమియు నెఱుకపడనీయక అందును

గూర్చియొక్క మాటయయిన నాడుటగాని యేదయిన నడుమ నొకప్రచ్ఛసేయుటగాని లేకుండనుండి యెంతయో బెట్టుగనున్న యాతఁడు, రెండవసారి శుచిముఖి యాతని సందర్శించినపట్టున మొదటిధృతియంతయును సడలవిడిచినాఁడు. ముఖవైఖరినిఁ బట్టియు మాటలధోరణినిఁబట్టియు మనుజులహృదయమును గనిపెట్టగలిగిన శుచిముఖి యాతనియాంతర్యమును గ్రహించి యింక ముందటివ్యాపారమున మునుపటివలె నాతనికి ఆను పానులఁ జెప్పక యావిషయమున ముభావముగ నుండెను. అంతఁ బ్రద్యుమ్నుడు వజ్రపుర ప్రవేశమునకు మార్గ మరయఁ దొట్రుపడుచు అది నీవే చెప్పి పుణ్యముఁ గట్టుకొను మని శుచి ముఖిని బ్రతిమాలుకొనియెను. ఈ రెండుపట్టులను వినియోగ పడిన కవియొక్క మేధావిశేషమును గాంచితిమేని, ఆతఁడు పాత్రముల స్వభావగుణపోషణమునం దెంత సమర్థుఁడో యెఱుక పడక మానదు. ఆంతరంగికమర్మముల వర్ణించుపట్టున తనకున్న నేర్పనుపమానము. ఈతఁ డెంతసేపు వర్ణించినను హృదయ భావములును అందు నిమిషనిమిషమునకును గలుగుచుండు మార్పులును తత్సంకీర్ణభావములును దారతమ్యభేదములతో నీషత్తైనను వెలిపోకుండ నిలుపుకొనివచ్చుచు నం దత్యంత కుతూహలుండై మెలంగు.

ప్రద్యుమ్నుఁడు శుచిముఖికి వ్రాసిన యుత్తరములోని యీ క్రిందిభాగమునుబట్టి అతఁడు ప్రభావతీరూపము నెట్లు మనంబున నిలుపఁగలిగెనో అయ్యది యేగతి నాతనిమనంబున కెక్కెనో తెలియఁగలదు.

"ఆయింతియంగము లెవ్వి యెట్లు చెప్పి, తవియెల్ల నట్లు నాయాత్మఁ బద్ధయుఁబడి యచ్చున నద్దిన ట్లమర నంటి, మలిచినగతిని మిక్కిలి దృఢత్వముఁ జెంది స్వగుణసంపద్గౌరవమున నేమొ, యూఁది బడలించుచున్నవి యోమరాళి"

అను నీపై వాక్యమును నీక్రింది పద్యములను

శా. ప్రద్యుమ్నుఁడు ప్రభావతీరుచిరరూపబ్రహ్మముఁ హంసయో
షిద్వ్యాఖ్యాత్వధురీణవాగుపనిషత్సిద్ధాంతమార్గానుసా
రోద్యత్ప్రజ్ఞను బల్మిఁ మననసంయుక్తంబు గావించుచుఁ
హృద్యంబై యది యంతకంత కలరఁ నిల్పెం గడుం జిత్తమున్.

ఉ. ఉద్యద పేక్షపక్షివనితోక్తులవెంబడిఁ జంచరీకచం
ద్రాద్యుపమానశోభకు సహస్రగుణంబుగ హెచ్చఁ గేశవ
క్త్రాద్యఖిలాంగలక్ష్మి మది కందినయంతయునుఁ నయించి యా
హృద్యతరాంగిమూర్తిసాబ గెల్ల నొకింతగఁ జూచు నాత్మలోన్.

చ. మదిగొనినంత మేరయుచు మాన కతం డుపమానకోటియొ
ప్పిద మఖిలంబు నిట్లు గడుఁ బెక్కుమడుంగులుగాఁ దలంచి త
త్తనవయవత్వసుస్థితికి దార్పఁగ నమ్మదిరాక్షిరూప మె
య్యది యదియే కనంబడియె నచ్ఛపుబుద్ధికి లేవగమ్యముల్.

తత్పూర్వగాథయును సమన్వయించి చూచితిమేని మన మెన్నడును కని యెఱుంగని వస్తువు నెట్లు శ్రవణమూలమున మనస్సునకుఁ దెచ్చుకొని తద్రూపమును జూడ సమర్థుల మగుదుమో అయ్యది దృష్టాంతపూర్వకముగ నీకథపట్టున మనకుఁ జూపినాఁడు. ఇందు శ్రవణ మనన నిదిధ్యాస ధ్యాన ధారణ సమాధుల నన్నిటిని వివరించియున్నాఁడు.

ఈ కవి ప్రపంచమునందలి మనగిప్రకృతులను అందలి వ్యత్యాసములను ఎంతచక్కగాఁ గనిపెట్టెనో యిం దీతఁడు వర్ణించిన ప్రభావతీరాగవల్లరుల హృదయవర్ణనమును బట్టియును, హంస శుకముల ప్రవర్తనను బట్టియును గనంవగు.

రాగవల్లరి మంచిప్రౌఢ. ప్రభావతిమనంబు తనరహస్యంబులను దాఁచఁగలిగినది గాదు. శుచిముఖితోడ ప్రథమప్రసంగమున వా రిరువురును ముచ్చటించిన ముచ్చటలనుబట్టి వా రిరువురి ప్రౌఢతాప్రౌఢత లెట్టివో తెలిసికొనవచ్చును. వారి కదియె ప్రథమపరిచయము. శుచిముఖికిఁ జెప్పినదెల్ల వారిద్దఱకును గలిగిన వివాదాంశమును గూర్చి యొక్కింత యీగడ. ఆ యీగడ చెప్పినంతమాత్రమున నుబ్బిపోయి—

శా. ఏమేమీ యిఁక నొక్కమాటు చెపుమా యీ వున్నరూపి ట్లయో
యేమైనం గలదో విభేద మిట ర మ్మాక్షింపు మింకన్ వచ
స్సామర్థ్యం బరయన్ మహాత్మ వని యస్మ ద్బుద్ధికిం దోఁచె దా
హా మాభావముఁ గానలేవె మదిలో హంసీ భయం బేటికిన్.'

అని దాని యానుపాను లరయకుండఁ దనహృదయమును జాఱవిడచెను. శుచిముఖినటనలఁజూచి యామెను మహాత్మగాఁ దలఁచెను. రాగవల్లరి రాజపుత్రిక బేలవడుచున్నది యని కనిపెట్టి యది మఱుఁగువడఁజేయఁ బ్రసంగమునకు దింపి, అయ్యది పన్నిదంబునకై యడిగిన ప్రశ్నమని మాటువఱుపఁ బ్రయత్నించెను.

వనవిహారముసేయుచు సహజమున మృదుమధురంబులుగఁ బలుకుకోయిలపలుకులు తన ప్రాణసఖికి విరహవేదనఁ గలిగించుచున్న దని యెంచి, కేవలనిర్దాక్షిణ్యచిత్తంబున నురులొడ్డి

పక్షులబాధింపఁ జూచిన రాగవల్లరిహృదయమునకును, చిలుక యీ యురులలోఁ జిక్కుటయె తడవుగ సంభ్రమంబున దిగ్గున లేచి దయాకులం బగు మనోవృత్తిని ఆపిట్టకేమియు నపాయము రాకుండ నదల్చిన ప్రభావతీహృదయమునకు, దయాళుత్వ మున నెంత యంతర మున్నదో వ్యక్తమగుచునె యున్నది; కాని యయ్యది వారివారి యంతరభేదముల కనురూపం బగుచునే యున్నది. ప్రభావతి నాయిక. కరుణార్ద్రహృదయ. చెలుల కృత్యము తమప్రభుకుమారికల మనస్సునకు వచ్చునటుల భక్తి పూర్వకంబుగఁ బరిచర్య చేయుటయె. అదియె వారివిధ్యుక్త ధర్మము. ఏలినవారు నియోగించినపనులు వారి కుపకారకము లుగఁ జేయుటయెగాని అందలి మంచిచెడ్డలను విచారించుటకు భృత్యుల కవకాశము లేదు.

చిలుక మొదటినుండియును జంద్రవతీగుణవతులయొద్ద నుండు వినోదపు నెచ్చెలి. వారి మన్మథవేదనఁ జూచి సహింప లేక ద్వారకాపట్టణమునకు వారిప్రియుల నరసి రాయబారము నడపుటకై బయలుదేఱినది. దారినేపోయి దారినేవచ్చు స్వభా వము గలది. కంటిలోనుండి ముక్కులోనికిని, ముక్కులో నుండి కంటిలోనికిని వచ్చెడు త్రాణ దానియొద్ద లేదు. కారుణ్య పరవశత్వమున వజ్రనాభునివార్తాహరణకార్యంబుఁ గైకొని యెన్నియో పాట్లకు లోనయి తుదకుఁ బ్రాణాపాయంబు రా నేలినవారి రహస్యము లన్నియును వెలిపఱుపవలసిన దయ్యెను. దైవనియుక్తిచే శుచిముఖి వారి కనుకూలించు దూతికయైనది కాని లేకున్న వారిపని యథోగతి పాలు కావలసినది గద!

చేతకానివారలు తమయాయమునకు మించిన పనులను జేకొనిన నిల్లైయుండును. శుచిముఖికిని దీనికిని గల వ్యత్యాస మిందునఁ జూడందగు. ఈచిలుక తనసామర్థ్యం బింతమాత్రంబ యని తాను పూర్ణముగ నెఱుంగు. ఆనుపాను లరయవలయు నను కుతూహలము గాని శక్తిగాని దానియొద్ద లేదు. దీని దయార్ద్రహృదయము ప్రద్యుమ్నుని ప్రార్థనావచనంబునకు లోనయి వార్తాహరణకార్యంబున కాతనిపని యెఱుంగకుండనె గడంగుటలో విదితమగు.

గీ. "నవనిధానములను డవిలి యిచ్చిననైన
మెడలమీఁదఁ గత్తి యిడిననైన
జాల రనఘచరితు లేలినవారిర
హస్యభంగమునకు ననుమతింప."

అను వాక్యమునందు దానిస్వామిభక్తి వెల్లడి యగుచున్నది.

ఇంక నీకథాపాత్రముల కన్నిటికిని నాయకమణి యైన శుచిముఖిపాత్ర మెంతచక్కఁగ వర్ణింపఁబడియెనో దానినొక్కింత చవిఁ జూతము. సందర్భానుసారముగ నీపాత్రమును గూర్చి యచ్చటచ్చట నొకింత ముచ్చటింపఁబడియెను. ఈ పాత్రము యొక్క గుణాగుణములను విమర్శించితిమేని కవియొక్క అవార శాస్త్రసాంగత్యము, పాండితీవిలసనము, రాజకీయకార్య ధౌరంధర్యము, సమయోచితసంభాషణావిశేషము, కార్యసంధాన విధానతత్పరత, స్వామిభక్తి, వినయవిధేయత మున్నగుసల్లక్షణములెల్ల వెల్లడి యగును. ఇంద్రోపేంద్రులకడ శత్రువిజయమునకు పూర్వహాతంత్రనిర్మాణము, ప్రభావతీరాగవల్లరులకడ

విస్రంభసంభాషణము, వజ్రనాభునిచెంగట శాస్త్రప్రశంస, ప్రద్యుమ్నునికడ ఆత్మకార్యసంధానసదుపాయము, చిలుకను బట్టి తెచ్చుసమయమున దేశమున నెక్కడ నేమూల నేది జరుగు చున్నదియో వానియానుపానులు నెఱుఁగవలె నను నిచ్ఛ, ఎల్ల పట్టుల ఎక్కడ నెంత యెంత యుచితమో యంతమాత్రమే దానిని బయలుపుచ్చు చుండుట, సర్వము నాకళించి యుండుట, విదితం బగుచుండు. ఈపాత్రమునందు సంస్తుతిపాత్రమైనవిష యములు కవి యీక్రిందిపద్యమున నొప్పించియున్నవాఁడు.

చ. శుచిముఖి యంద్రు దానిని వచోనిపుణత్వమునందు సత్కథా
రచనలయందు నీతివిధురత్వమునందు బహుశ్రవావలో
కచణతయందు నెందు సరిగానము దానికి వేయు నేల దా
నిచతురతావిశేషములు నీవె కన న్వలయు న్మహాత్మకా.

ఇందలి ప్రతివిషయమునకును గ్రంథము నుండి పెక్కు దృష్టాంతములం జూపవచ్చు. ఇంత "కతరాజు" మఱియొక్కఁ డును గనుపడఁబోఁడు. మంత్రికుండవలసిన లక్షణము లన్నియు నీశుచిముఖికడ నున్నవి. ఈపేరు నుడివిననోట మహామంత్రుల మనువారి నామము నైన నుచ్చరింప నను వు గాదు. బృహస్పతి వంటివానికి స్ఫురింపని విజయోపాయములు దీనికి స్ఫురించినవి. ఇంద్రోపేంద్రులు విజయసాధనమున కీమార్గ ముపచరించునని మాటమాత్రము చెప్పిరిగాని అవి జరుగు నుపాయము లన్ని యును మనశుచిముఖి తనమేధావిశేషమున నూహించికార్యము నిర్వహించినది. దీనికిఁ గల సమయస్ఫురణకు మితిలేదు. కొన్ని చోట్ల వచనవక్రత. కొన్నియెడల మర్మరహితమగుసంభాషణము.

కొన్ని పట్టుల గంభీర భావములు. కొన్ని చోట్ల సూచ్యార్థసూచనలు. కొన్నిస్థలముల విరళీకృత వర్ణనావిశేషములు. కొన్ని సందర్భముల మూకీభావము. ఇన్ని చతురతావిశేషములు గల్గి యెక్కడ నెట్లు నటింపవలెనో అట్లు నటించి సకలకార్యములను సాధించి దిట్టతనంబున మెలంగినది. సరసత్వమున ప్రౌఢ. "సకలకళలసడిపన్నులచదువుల ప్రోపిబెతేఁగినది." ఎంతటివారినైన నిమిషములో వశముచేసికొన నేర్పుఁ గలది. మాటలలో శుచిముఖిని గెలువ నెట్టివారికిని నశక్యము. "చెప్పి వేఁడికొనక నేపనికిని నియ్యకొనునది కాదు." ఎవరెంత తనతోడ మనసిచ్చి మాటాడుదురో తాను వారితో నంతమాత్రమే ప్రతిభాషణమాడు ప్రౌఢ. దీని కెఱుంగరానిసఖిధర్మంబులేదు. అఖిల విద్యలు దీనికిఁ గరతలామలకములు. దీని మనస్సున కేకార్యమును అసాధ్య మని తట్టనైనఁ దట్టదు. చిలుకను బట్టితేఁగలవా యని ప్రభావతి యడిగిన "అయ్యది చిక్కుపడ కెంతదవ్వు పాతెడు కూడఁజనిపట్టితెత్తు" నని ప్రతివచనం బిచ్చి నోటనున్న మాట నోట నుండఁగనే దానివెన్నంటి చనియెను. సమర్థులగు వారి కసాధ్యమగు కార్యము లుండవు. వీరాధివీరులన నట్టివారలె కదా ? ఐరోపాఖండము నంతను గడగడ లాడించి రావణాసురునివలె దేశమెల్ల నొక కడకుఁదెచ్చిన "నెపోలియన్ బోనపార్టు" నిఘంటువునుండి అసాధ్య మనుశబ్దమును దీసివేయ మనలేదా ? మన వేదాంతశాస్త్రజ్ఞులును దీనినే యుద్ఘాటించెదరు. "భావనయె ప్రధానంబెట్టిపట్లనరయ" నని దానినే యీ కవియు ననువదించి యున్నాఁడు.

శుచిముఖి యెదుటివారి రహస్యము లన్నియుఁ జేతఁబట్టి తనకార్యము సాధించుకొని తనమర్మముమాత్ర మెదుటివారికిఁ దెలియకుండఁ గాపాడి కడుసౌమ్యభావమునఁ బ్రవర్తించినదిట్టు. రాజ్యతంత్రజ్ఞులు తమకెవ్వరితోడ నేమిపని యెంతవఱకున్నదో దానిని మించి మఱియొక్కమాటైన మాటాడఁ జాలరు. శుచిముఖి తనదౌత్యవిషయిక మగు రహస్యకృత్యమును బ్రభావతి కెన్నఁడును తెలిపి యెఱుంగదు. ఎవ్వరితోడ నెప్పు డేవిధమున సంభాషింపవలెనో అయ్యది యూహాంస యెఱింగినట్లు మఱి యెవ్వరు నెఱుంగరు. ప్రద్యుమ్నునికడ వినయవిధేయతాపూర్వకముగ, ప్రభావతీ రాగవల్లరులతో వక్రభాషణముల, చిలుకను బట్టి రహస్యములఁ జెప్పించునపుడు బెదరింపుమాటల, వజ్రనాభునితో సరసగోష్ఠిసలుపునెడ "నిట్టటు గ్రుక్కక పనిలేనిపునఃపదము లిడక" శాస్త్రప్రసంగంబున మృదుమధురఫణితిని, ఇంద్రుని యొద్ద సంభాషించునపుడు భృత్యధర్మంబున కనురూపంబుగ మఱియు బహుప్రకారంబుల సమయోచితంబుగఁ బ్రవర్తించె. ఈపాత్రము నెంతతఱచిచూచిన నంత యెక్కువ విశేషములు బయటఁ బడుచుండును. పైకిఁ గానఁబడువిశేషము లొకటి రెండుమాత్ర మిందు విశదము వ్రాసితిని.

ఈ గ్రంథప్రాశస్త్యము తఱచినకొలఁది బుద్ధిచాకచక్యమునుబట్టి 'నీటికొలఁది తామరసుమ్మీ' అను నాతని వాక్యాను సారముగఁ బోధపడుచుండును. ఇందలిరసభావములు పూర్ణముగఁ గ్రోల నిచ్చఁగలవారికీ విమర్శన మొక్కింతసహాకారి కాఁగలదనునమ్మికతో నాతీఱమికొలఁది నొక్కింత వ్రాసివిడిచితి.

రసజ్ఞు లభిప్రాయభేదములఁ బాటింపక యిందు గలగుణమునే గ్రహింతురుగాక.

చ. కవిత యనంగ నెవ్వనికి గాదిలిపట్టియొ యేనిపోవణఁక్
ప్రవిమలరూపసంపదలు భాసిలఁగల్గెనో మేన సామెకుఁక్
సువచనగుంభనల్ నడలసొంపులు భావరసప్రవృత్తు లే
నివలనఁ గల్గె వానిని గణించెదఁ బింగళిసూరనార్యునిన్.

2-8-1911
కృష్ణామండలము, తణుకు. } తల్లాప్రగడ సూర్యనారాయణరావు.

శ్రీ ర స్తు

# ప్రభావతీప్రద్యుమ్నము

## పీ ఠి క



మదుమామహేశు లతి
చిత్రవిలాసులు దారు ముక్తి వియో
గామితచింత నొండొరుల
కై సగమౌటలు నిచ్చఁ దెల్పఁ గాం
తామహిమంబుచేఁ జెలువ
గంబుగ నొక్కయెడ ల్ధరించు న
త్ప్రేమపుదంపతు ల్కృతిప
తిం దనరింతురు గాతఁ గీర్తులన్. 1

ఉ. *అంగజహేతుకంబు లరయ న్మిథునంబుల ప్రేమ లిట్టిచో
నంగజుతల్లిదండ్రు లగునట్టి యనన్యసమానహార్దసం

---

* అంగజహేతుకంబులు మన్మథుఁడు హేతువుగాఁగలవి, అనఁగా దంపతుల ప్రేమమునకుఁ గారకుఁ డగుమన్మథునకుఁ దలిదండ్రులయి యనన్యసామాన్యమైన ప్రేమముతోఁ జెలువారు ననాదిదంపతు లనుట. లోకమున దంపతులప్రేమమునకు హేతుభూతుఁ డగుమన్మథునిఁ గన్నవా రగుటచే వారిప్రేమ స్వతోరూఢమైన దనియు నా దాంపత్య మాది యెఱుఁగరాని దనియు భావము.

సంగులనాదిదంపతులు సత్కృప నిత్తురు గాక సౌఖ్యముల్
పింగళిసూరధీరవరుబిడ్డకు మాయమరేశమంత్రికిన్. 2

చ. అమలనవీనహైమనిజయానగరుద్ద్యుతిఁ ద్రోచుసద్వపు, ర్విమల
రుచిక్షస్వభక్తులకు వెండియుఁ బైఁడియుఁ గీర్తియున్నతే, జము
నెపుడప్పుడే యొసఁగుసద్గనిధానముఁ దాల్చియున్నయ, ట్లమ
రెడువాగ్విధాత లమరార్యున కిత్తురు నిత్యసౌఖ్యముల్. 3

వ. అని సకలభువనప్రవర్తనహేతువు లైనపురాతన మిథునం
బులం గొనియాడి.

తే. ఆదికవులఁ బ్రాచేతసవ్యాసమునులఁ
దలఁపులోన భజించి యత్యంతసరస
మగు ప్రభావతీప్రద్యుమ్న మను ప్రబంధ
మాచరింపుచు నొక్కనాఁ డాత్మలోన. 5

మ. జనము ల్మెచ్చఁగ మున్రచించితి నుదంచద్వైఖరిం గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబు న్మఱి
న్దెలుఁగుంగల్పము లెన్ని యేనియును మత్పిత్రాదివంశాభివ
ర్ణన లేమిం బరితుష్టి నా కవి యొనర్పం జాల వత్యంతమున్.

క. తండ్రియ సుతులకుం దైవం
బండ్రు గదా వేదవాదు లది వినియును నే
వీండ్రును వాండ్రును బలె మా
తండ్రిఁ బరమపూజ్యుఁ గాఁగఁ దలఁపమి తగునే.

మ. గయలోఁ గాశిఁ బ్రయాగ శ్రీగిరిని గంగాద్వార నీలాచలో
జ్జయినీ ద్వారకలం దయోధ్యమధురల్ సంస్తుత్యపుణ్యస్థలా
గ్రియత న్వొండియుమించు నైమిశకురుక్షేత్రాదులం దర్పణ
క్రియ చేనాపినతమ్ముఁ డెఱ్ఱనయొనర్చెం దండ్రి కాహ్లాదమున్.

క. ఏనుం బితృపూజన నా
చే నైన న్బుద్ధియైనఁ జేయఁగ వలయుం
గానఁ గృతి యిచ్చి మేదిని
పై నిలుపుదు నతనికీర్తిఁ బరమేశుకృపన్. 9

వ. అని నిశ్చయించి ప్రభావతీప్రద్యుమ్నంబు మద్గురుం డైన యమరామాత్యుని పేర నంకితంబుగ రచియింపం గడింగి తత్కావ్యలక్ష్మీముఖంబునకుం దిలకాయమానంబుగ నా వంశావతారం బభివర్ణించెద. 10

ఆ. గంగఁ దనదుపేర గౌతమీనామవి
ఖ్యాతిఁ బరఁగఁ దెచ్చె భూతలమున
కేమహానుభావుఁ డామునిసింహుఁడు
గౌతముఁడు తపోధికతఁ దలిర్చు. 11

ఉ. వాదున గెల్వ లేక పురవైరి లలాటముకన్నుఁ జూపఁ దా
బాదమునందుగన్ను ప్రతిపక్షతఁజూపెనుశాస్త్రముం బ్రమా
ణాదిపదార్థతత్వకథనాత్మకముం రచియించె నాత్మసం
వేదముకై మును ల్కులపవిత్రుని గౌతముఁ బోల నేర్తురే.

క. ఆగౌతమగోత్రంబున
నాగమనిధి పుట్టె గోకనామాత్యుఁడు స
ద్భోగక్షేత్రస్వామ్యస
మాగతిఁ బింగలిపురాంకుఁడై యతఁ డొప్పెన్. 13

ఉ. పేర్వెలయంగ నాఘనుఁడు పింగలిశోకబుధోత్తముండు గం
ధర్వి నొకర్తుఁ జేకి యనుపానిని దాసిఁగ నేలె యోగితా
గుర్వనుభావుఁడై నెరపె గోపకుమారునిఖడ్గవర్ణనం
బర్వపునిండువెన్నెలలపై నెఱిఁ జూపెడుకీర్తిసంపదన్. 14

ఉ. సంతతి లేక ముస్నతనిజాయ సభక్తిని సూర్యసేవ య
శ్రాంతముఁ జేయఁగా నతఁడు సద్ద్విజుఁడై కల వచ్చి దోండచె
ట్టింతికి నిచ్చి బాల ఫలియించును నీకిది ప్రోది చేసికొ
మ్మెంతయునంచుఁబల్కె నఁటయింతియునాకలగాంచిధన్యయై.

తే. సకలదిశలకు శాఖోపశాఖ లిడుచుఁ
బాదలి ఫలియించుదొండయుఁ బోలి ప్రబలి
యాత్మసంతతి పుత్త్రపౌత్త్రాదిబహుళ
సంపదల నొప్ప వెలసె భర్తయును దాను. 16

మ. తరముల్నాల్గయి దెందు నెందునగుఁదత్తద్గ్రామనామంబులన్
బరఁగున్ వంశము లెల్లఁబూర్వపునిజప్రఖ్యాతిమాయంగనే
మరుదో పింగళినామమందుఁ జిరకాలావాసులై యున్న సు
స్థిరతన్గోకనమంత్రి వంశజులకున్ జెన్నొందుమిన్నందుచున్. 17

ఉ. రంగుగ గౌతమీపరిసరంబులఁ గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళిరామయాదులు లలిం బలనాటను బాకనాటనుం
బింగళిగాదయాదు లిటఁ బెంపు వహించినయస్మదాదు లా
పింగళిగోకమంత్రియిలు పేరనె చాలఁ బ్రసిద్ధు లెల్లచోన్.

వ. అది య ట్లుండె నమ్మహావంశంబునందు నస్మజ్జనకజనిజీవంతి
కాత్యంత కమనీయంబైన శాఖావిశేషం బెట్టి దనిన. 19

క. గంగయ నా వెలయుచు శుచి
తం గడు శోభిల్లె నొకఁడు తద్వంశములో
గంగ యనా వెలయుచు శుచి
తం గడు శోభిలెఁ దదూర్జితయశశ్శ్రీయున్. 20

క. మాంగల్యశోభి యగునా
గంగయకును ముగురు వంశకరులైరి సుతుల్
రంగత్కీర్తులు మహి నె

న్నంగ న్సూరనయుఁ గుప్పనయు రామనయున్. 21

క. కనియెఁ గుప్పన సూరన
యనుపుత్త్రుని నతనిపుత్త్రు లగు బాపయ భ
ద్రన కుప్పారుచ్యల కాత్మజు
లనేకు లెల్లయ్య పాపయాదులు ప్రాజ్ఞుల్. 22

క. జనియించెను రామనకుం
దనయుఁడు గంగన్న గంగనకు గాదన గా
దనకుం బెద్దయ మొదలుగ
ననేకు లీగతిఁ దదన్వయము శోభిల్లున్. 23

తే. ఇట్లు పుత్త్రపౌత్త్రాదుల నెసఁగునట్టి
సోదరులు దన్ను మిక్కిలి నాదరింప
నలఘుసాద్గుణ్యసౌభాగ్యకలితుఁ డగుచు
గంగనామాత్యుసూరయ కరము వెలసె. 24

ఉ. పింగలిగంగమంత్రివరుబిడ్డకు సూరనకుం బదాబ్జరే
ఖం గలకాంతికే వలచి కైవస మయ్యెను రాజ్యలక్ష్మి దా
బంగరుకామకుంచెలును బల్లకియున్మొదలైనయాత్మస
ర్వాంగసమృద్ధితోడ సిరి కంబుజరేఖలప్రేమ వింతయే. 25

తే. సూరనిభుఁ డైనపింగలిసూరవిభుని
దొరయఁ బోఁ డొరుఁ డల వేల్పుదొరయ కాని
యతనిదానము సిరికి నియతనిదాన
మర్థు లప్పుడు దానసమర్థులైరి. 26

క. సూరయమంత్రికిఁ గలిగెను
సూరయమంత్రియ యనంగ సుతరత్నము కం
ఠీరవమున కెందును గం
ఠీరవము జనించునట్టినియమము దోఁపన్. 27

ఉ. సూరయ సూరమంత్రి కతిశుద్ధిఁ దలిర్చినయక్కమాంబయం
దౌరసు లుద్భవించిరి మహాత్ములు నల్వురు సజ్జనస్తుతో
దారగుణాభిరాములయియన్నయభవ్యుఁడు సూరసూరియు
న్ధీరుఁడువల్ల శౌరియును నీతయశస్కుఁడు లింగనార్యుఁడున్.

వ. వారిలోన. 29

క. వల్లయమంత్రి కిఁ బుత్త్రుఁడు
పుల్లయమంత్రి యనఁ బుట్టె భువి లింగన కు
త్ఫుల్లయశుఁడు సూరయయును
సల్లాలితనీతి యక్కసచివుఁడు దనయుల్. 30

క. వారలకు నగ్రజుం డగు
సూరయసూరప్రభుండు సుకవిత్వసదా
చార శివభక్తివినయో
దారత్వాదులఁ బ్రసిద్ధతముఁడై మించెన్. 31

క. వేడుక నాయన పెండిలి
యాడె వెలగలేటియమరనామాత్యసుతన్
ప్రీడాపతులందును గోని
యాడం దగినయమలాంబ నఖిలగుణాఢ్యన్. 32

క. అమలమహాగుణనిధి యా
యమలమ హరిప్రకారయశమునఁ దనరెన్
గమలాలయాసరస్వ
త్యుమ లాలలితాంగిఁ బోల్ప నొనరెడుగరితల్. 33

ఉ. ఆయమలమ్మయందును గృహస్థశిరోమణి సూరశౌరి య
త్యాయతశీలురం గనియె నాత్మజుల న్మగురన్ సుధీజన
ధ్యేయగుణప్రశంసు నమరేశ్వరమంత్రిని ధర్మనిర్మలో
పాయుని మల్లనార్యు నతిభవ్యతమించిన యక్కధీరునిన్. 34

వ. అందు. 35

క. ఇమ్ముగ నుదయించిరి జన
సమ్మతుఁ డగుమల్లనకును జగ్గన యనఁగాఁ
దమ్మయు సూరయ చిన్నయ
తిమ్మయ లనఁ బరఁగుసుతులు ధృతిబలసహితుల్. 36

క. ఆమల్లనకును జన్నమ
చే మంత్రుల కెల్ల గుణవిశేషంబులచే
భూమిఁ జ్యేష్ఠుఁ డనంగ మ
హామహిమౌదార్యుఁ డమరనార్యుఁడు వెలసెన్. 37

సీ. *చిఱువన దేచిరా జెఱుకమించినబుధో
త్తముఁ దేవధూమణితాతతండ్రి
యనవరత మునికి నాయూరి పేరఁ దా
వెలయు కేసయ్య యేవెలఁదితాత
యన్నయ బాపయ్య లగ్రజానుజులుగా
బరఁగుభావయ్య యేగరితతండ్రి
జయనయోన్నతులు కొండయరాఘవార్యు లే
సతి కన్నదమ్ములై సుతులు గనిరి

ఆ. పృథివి నేపురంధ్రి పెదతండ్రి కొడుకు స
త్కీర్తిశోభితుండు కేసవిభుఁడు
తనకు నేగుణాఢ్యపినతండ్రిసుతుఁడు గం
గయ్య బహుసహోదరాంచితుండు. 38

తే. రమ్యగుణనిధి యన్నమ్మ రాచపూడి
గణపతిసుపుత్త్రి యేసాధ్వికన్నతల్లి

---

* వ్రాతప్రతులందుఁ బై యట్లు కలదు. ముద్రితప్రతిలో "చిఱుమనఁ దెచ్చి రాచటిక మిచ్చిన" అని కలదు.

యుక్తియంబమ్మఁ బింగళియమరమంత్రి
పెంపు నింపును మెఱయంగఁ బెండ్లియాడె. 39

తే. అనఘసౌభాగ్యవస్తువార్ధాంగలక్ష్మి
పింగళియమరామాత్యునర్ధాంగలక్ష్మి
యంబమాంబిక భోగభాగ్యముల మరుని
యంబకును నంబికకు సాటి యనఁగ వెలసె. 40

క. ఆజంపతులకుఁ బుత్త్రుల
మై జనియించితిమి సూరనాఖ్యుఁడ నేనుం
భ్రాజితమతి యమలార్యుఁడు
రాజితబోధార్థనాభిరతుఁ డెఱ్ఱనయున్. 41

క. స్తోత్రముల కయ్యె సమ్య
క్పాత్రము శ్రీరాచపూడిగంగనయును దౌ
హిత్రులు గలుగఁగ వంశప
విత్రం బామిథున ముభయవిధసంతతులన్. 42

క. అక్షయగుణవిభవైౖ తా
దృక్షకులోత్తంసునకు సదృక్షువిదూర
ప్రేక్షాసిలలితధర్మసు
రక్షాంసునకు సురరుచిధురాహంసునకున్. 43

క. గౌతమగోత్రునకును బ్ర
ఖ్యాతాపస్తంబసూత్రయాజుషశాఖా
ధీతిపవిత్రునకును లో
కాతిగవశితాజితాంతరామిత్రునకున్. 44

క. పృథులాకాశీసేతు
ప్రథ నిడుమామూరికృష్ణరాయసముద్ర

ప్రథితాగ్రహారభోగా
తిథేయనిజసంతతిప్రతీకాత్మునకున్. 45

క. గంగాశుచివృత్తికి నభి
షంగానాఘాశ్రితనీతిసంపత్తికి స
న్మంగళగుణపాత్రునకును
బింగళిసూరప్రధాను ప్రియపుత్త్రునకున్. 46

క. శ్రీమద్రాజేంద్రగురు
స్వామిస్థిరవంశకలశజలనిధిసోమ
త్సోమారాధ్యకృపాల
బ్ధామలశివభక్తిశోభితాచారునకున్. 47

క. అమలాంబానందనునకుఁ
గమలాంబాగురుసమానఘనధైర్యునకున్
గమనీయమనీషివ్యప
గమనీయున కంబమాంబికారమణునకున్. 48

క. మజ్జనకున కర్పితధీ
మజ్జనకునకు నభినుతిసమార్జితమాయో
న్మజ్జనకున కమలచిదవ
మజ్జనకున కమృతరసనిమజ్జనకునకున్. 49

క. అమరామాత్యున కురుమ
త్యమరామాత్యున కజోపమునకృతార్థో
ద్యమరామాత్యుపమేయా
యమరామాత్యగుణోదయయశశ్శ్రీకిన్. 50

వ. అక్షయకీర్తివైభవాభివృద్ధి యగునట్లుగా నేను సమర్పింపం బూనిన ప్రభావతీ ప్రద్యుమ్నంబునకుఁగథాక్రమం బెట్టిదనిన.

శ్రీరస్తు

# ప్రభావతీప్రద్యుమ్నము

## ప్రథమాశ్వాసము



రమణీరమణీయమ
హోరస్థ్సలుఁ డచ్యుతుఁడు సముజ్జ్వలమహిమన్
ద్వారక నుండఁగ నొకనాఁ
డారూఢాదరత నింద్రుఁ డవ్విభుకడకున్. 52

వ. లోకహితకార్యపర్యాలోచనంబునకై చనుదెంచువాఁడు నాకంబు వెడలి యాకసంబున నడతెంచుచున్న సమయంబున. 53

సీ. ధాత్రీమహాదేవి తాల్చినమున్నీటి
మొలనూలిరత్నంపుమొగ పనంగ
జలధి పేరిటిపాఁపతలచుట్టు గలధరి
త్రీమూర్తిశిఖచిత్రతిలక మనఁగ
నపరదిక్సతి కట్టినట్టిసాగర మను
పుట్టంబుతుదివ్రాఁత మొగడ యనఁగ
వరుణగోపురబద్ధవార్ధితోరణమధ్య
గుంభితనవపుష్పగుచ్ఛ మనఁగ

తే. వివిధమణిమయగృహదీప్తివిసరవిసర
ణోపశోభితమగుద్వారకాపురంబు

దవులఁ గాన్పించెఁ దనుఁజూడ దైవవిభుఁడు
వేయికన్నులుఁ జాలక వెఱఁగుపడఁగ. 54

వ. ఇట్లు గనుపట్టునాపట్టణంపు సొంపునకు శిరఃకంపంబు సేయు నిలింపవల్లభునింపు పెంపు పరికించి కించిదుల్లసితవిలోచనంబుల నాసహస్రవిలోచను విలోకించి తదీయరథసూతుండగుమాతలి యిట్లనియె. 55

క. ఏమిా యిది దేవరకను
దామరలకు నింతవెఱఁగు దలకొలిపెడు నే
మే మనఁగ నహాహా నాక
స్వామికి నబ్రమగుప్రోలు వసుమతిఁ గలిగెన్. 56

క. జడనిధి యను తెరమఱుఁ గటు
వెడలి నిలిచినట్టియాటవెలఁదియపోలెం
గడు నింపులు గులుకుచుఁ దన
రెడు నీపురలక్ష్మి యవధరించితె యధిపా. 57

క. పడమట నంభోరాశియుఁ
గడమదిశల వనచయంబుఁ గప్పారఁగఁ దా
నడుమఁ బురలక్ష్మి గనుప
ట్టెడు హరియురమున సుఖించుతీవి దలిర్పన్. 58

ఉ. దోహదధూపధూమములతోఁ గనుపట్టెడుతత్పురీవన
వ్యూహమునోసమస్తవిబుధోత్తమ చూచితె యంబుపానకౌ
తూహలలంబమాననవతోయదరాజివిరాజితాబ్ధిసం
దేహనితాంతకందళనదీపితనైపుణి నేపుఁ జూపెడున్. 59

ఉ. భోగపుఁజుట్లు కోటలుగ భూరికిరీటసముజ్జ్వలత్ఫణా, పూ
గము సౌధబృందముగ భోగికులేంద్రుఁడు పేంద్రుఁబాయలే

కీగతిఁ దాను వచ్చి భజియించెనొకో యవతార మంచుఁ జే
తోగతి నాకు నెంతయును దోఁచుచునున్నది నిర్జరేశ్వరా.

మ. అపమూడోపలపీఠిచిత్రితములై హర్మ్యాగ్రవిన్యస్తకే
తువులందేర్పడకొప్పెనప్పురముపై త్రోవక్ మొగుళ్లేఁగియిం
ద్ర విలోకించితె యెంతనేల చని యేర్పాటయ్యె హాసస్మరా
దవికాలాగరుధూపధూమతతులో యభ్రంబులో యిప్పుడున్.

చ. హరిహయ చూడుమా తెలియు టబ్రముడగ్గఱి చూచి కాని
యాం, గిరసుని కైన నల్లయది కెంపుల మేడలతోడి విస్ఫుర
న్మరకతకుట్టిమస్థలియొ మవ్వపులేఁజిగురాకు కెంపు ము, మ్మర
మునఁ దేజరిల్లు నెఱమామిడిమ్రాఁకులతోడితోఁటయో. 62

సీ. కలధౌతకేళినగంబు గాఁబోలును
దనరుచున్నది శంభుతనువులీల
ఘనపుష్పచాంపేయవనరాజి గాఁబోలు
నేలుచున్నది పులితోలుసిరుల
హరినీలసోపానసరణి గాఁబోలును
బగటుచున్నది నల్లపాఁపపేరుఁ
బవడంపుటలువసౌభాగ్యంబు గాఁబోలుఁ
జాటుచున్నది జటాజూటరుచిని

తే. సరసి గాఁబోలుఁ గ్రాలెడు సురనదిగతి
నోడ గాఁబోలుఁ బోలెడి నుడుపతికళ
ననిమిషాధిప చూచితే యల్లపసిఁడి
కోటనడిమిశృంగారపుఁదోఁటలోన. 63

సీ. ఆలోలశైవాలజాలలాలిత్యంబు
జంగమోద్యానవేషము వహింప

రంగదుత్తుంగతరంగసంఘాతంబు
నడగోటల తెఱంగు నడుపుచుండ
డిండీరమండలాఖండసౌభాగ్యంబు
చరసౌధచయవిలాసము భజింప
శ్రీకరశీకరాస్తోకప్రవర్షంబు
కానుకముత్యాలకరణిఁ బరఁగ
తే. నగడితలు తత్తదాశోపయాతవాత
వశతచేత నేతత్పురవర్యపర్య
పాసనాశాసనానీతపరపురీప
రంపరాలీల నెఱపెడు నింపుమీఱి. 64

క. పడమటియది సాగర మని
యెడు తజ్జ్ఞులమాటఁ దక్క నేతత్పురి న
ల్గడలందుఁ బరిఖ లెవ్వియొ
జడనిధి యెయ్యదియొ తెలియ శక్యమె ప్రజకున్. 65

చ. తను ధరణీతటిద్విహ్యాతిధన్యవనావళి యింత మీఱుటల్
కనియును మేఘ మిచ్చటి కలజ్జతఁ జేరెడుఁగాక చేర కేఁ
గినను గొఱంత యేమి పురికిం బువుఁదేనియసోనకాలువల్
బనములపై రుపంటలకుఁ జాలవె యెన్నటికైన నెన్నఁగన్. 66

వ. అని యవ్విధంబున రథికసారథులు తత్తద్వస్తుసందర్శనసమయ
సముచితవచోరచనల వినోదించుచుం గొంతదవ్వున నయ్యు
ర్వికి డిగ్గి యన్నగరంబు చేరం జనునంత నతనిరాక విని
వనజోదరుండు ప్రియసహోదరుం డగుసాత్యకిం బిలిపించి
యద్ద్విజవల్లభు నెదుర్కొని తోడితెచ్చుటకు నియోగించిన
నతండు సముచితపరివారసమన్వితుండై యెదుర్కొని

తోడ్కొని చన వేడ్క లిగుఱొత్తుచిత్తంబున నద్దేవోత్త
ముండునూత్న గారుత్మతస్తంభసంభృతభేదావలంబిరంభాతరు
విభూషిత గోపురపార్శ్వభాగం బగుతత్పురంబు ప్రవేశించి
యుభయపార్శ్వసౌధవీథికాధిరూఢప్రౌఢవిలాసినీకటాక్షనివ
హాబహుగుణీకృతమార్గతోరణుం డగుచు వారిజనాభుమం
దిర ద్వారంబు చేర నరిగె నతండును నుగ్రసేనవసుదేవ
సంకర్షణగదాక్రూరప్రముఖులతోఁ గక్ష్యాంతరంబులు గడచి
యెదురు వచ్చి తత్ప్రవేశవిధానంబు యథోచితంబుగా నడపి
పరస్పరాశ్లేషసంభావనంబు లస్తంభసంభ్రమసంభృతంబు లై
జరుగునంతఁ గుశలప్రశ్నంబుఁ గావించిన నద్దివిజనాయకుండు
జనార్దనున కిట్లనియె. 67

తే. ఇపుడు నీదర్శనం బనియెడుకుశలము
కలిమి ప్రత్యక్షమే చెప్ప వలదు కృష్ణ
యటమటముగాక యట మునుపటికుశలము
నఖిలవిదుఁడ వీ వెఱుఁగనియదియుఁ గలదె. 68

క. ఐనను నాచేతను వినఁ
గా నభిమత మయ్యెనేని కమలోదర నీ
కే నెఱిఁగించెద విను మవ
ధానముతో మన్మనోవ్యథాభర మెల్లన్. 69

చ. తపమున వజ్రనాభుఁ డనుదైత్యుఁడు బ్రహ్మఁ బ్రసన్నుఁ జేసి వ
జ్రపురి యనంగ నొక్కనగరంబును మేరువుపొంత మారుతా
తపములకు న్నిజానుమతిఁ దక్కఁ బ్రవేశ మొనర్పరానియ
ట్టిపసఁదనర్చుదానిన్ ఘటించి యతం డొసఁగన్ బ్రదీప్తుఁడై. 70

వ. యథేష్టవైభవోపభోగంబులం బ్రవర్తించుచు. 71

ఉ. ఆతఁడు మొన్న నున్నతమదాంధత దాడిగ నేఁగుదెంచియా
పోతర మేమి చెప్ప ననుఁ బూరికిఁ గైకొన కప్సరోవధూ
వ్రాతనిశాతపాణిరుహవారిసలాలసనవ్యపల్లవం
బై తనరారునందనమహావనిలోఁ విడియించె సేనలన్. 72

సీ. దనుజాధిరోహతాడనభంజనాదుల
కోర్చునే కల్పవృక్షోత్తమములు
శోష్యపర్యుషితమనుష్యమాంసంబులు
పూనునట్టివియె సంతానకములు
దానవద్విపఘటాలానతాదురవస్థ
సైరించునే హరిచందనములు
మనుజఖాదిస్వేదమలినవస్త్రాదులు
దాల్పఁ బాలివియె మందారతరులు

తే. నందనమ్మునకును వజ్రనాభదైత్యుఁ
డపుడు చేసినకష్టపాటబ్జనాభ
యిప్పుడుఁ దలఁపునఁ బొడిన హృదయమునకు
నధికతర మైనపరితాప మావహిల్లు. 73

తే. వాని కెదిరించి పోర దేవతలలోన
నెవ్వరును జాల రిది బ్రహ్మ యిచ్చినట్టి
వరములోపలియదియ పంకరుహనాభ
మది కలఁకఁ జేసి మునుచెప్ప మఱచినాఁడ. 74

వ. కావున వానిచేఁత లన్నియు నప్రతిహతంబు లయి సాగు చుండె నంత నేనును బృహస్పతియును విచారించుకొని యద్దురాత్మునకు. 75

తే. అక్క సెలియంద్రసంతాన మైనయట్టి
మనకు మనలోన నింతదుర్మత్సరంబు
వలదు మాపల్కు నీవు నీపలుకు మేముఁ
జేసి బ్రదుకుట మేలంచుఁ జెప్పఁ బనిచి. 76

వ. కొంత శాంతసంరంభంబుగా మఱియు నప్పటిటీఱమికొలంది
యెంచుకొని చుట్టఱికంబు నెఱపుచుం బట్టణంబులోనికి
రప్పించి వానికి వానిసేనలకు నమానంబుగా విడుదులుపాలు
పెట్టించితి మట్టిసమయంబున. 77

సీ. తన కులుపా చాల దని మిట్టిపడఁగ న
నామధేయప్పుదైత్యునకు నడంగి
తనవిడివికి రంభ ననుపవై తని తిట్టు
కిగ్గాడి యసురకుఁ గేలు మొగిచి
తనకుఁ జెద్దఱికంబు మును నేయ వని దూఱు
నధమరాక్షసునకు నర్చ లొసఁగి
తన కమృతముఁ బోసి యనుప సంచు నదల్పు
బినుగురక్కసునకుఁ బ్రియము చెప్పి

తే. పంకరుహనాభ యేఁబడ్డపాటు లరయ
నెందు నెవ్వరుఁ బడరు నీ కేమి చెప్ప
నెంతపాపంబు చేసినజంతువొక్కొ
యింద్రుఁ డగు నని యపు డాత్మ నెన్నుకొంటి. 78

ఉ. వారిజనేత్ర యే నిపుడు వచ్చుచు నుండి యలౌకికాద్భుత
శ్రీరుచిరత్వదీయనగరీగరిమాతిశయావలోకలీ
లారసదూరధూతసకలవ్యథచిత్తుఁడ నై యథాపురా
కారత నీకుఁ దోఁచెదనొ కాని తనుద్యుతిఁ బాసితింజుమీ.

వ. అది యట్లుండె నవ్విధంబున వివిధోపచారంబుల సంఘటింపఁ
బెంపునం బ్రవర్తిల్లుచుండు యాచండదానవుం డొకానొక
నాఁడు సకలసైనికసన్నాహసంపదం బొదలుచుం గదలి
యేతెంచి మదీయమందిరద్వారంబునఁ దనబలంబుల నించి
నిలిచి మాటలాడఁ బని గలిగి వచ్చితి నని లోనికిం జెప్పి
యనుపుటయు నేనును దత్ప్రవేశంబు నడుపం దగువారి
నియమించితి నప్పుడు. 80

చ. మెఱయలవంటిరక్కసులు మిక్కిలి లెక్కకు మీఱి క్రొవ్వునే
త్తెఱయుఁ దలిర్పఁగా వడివడిం దనవెంటనె ద్వారపాలురక్
నెఱి చెడమట్టికొంచుఁ జొర నిర్భరగర్వమునుబ్బుబింకముక్
మెఱయఁగ వచ్చి యాయసురమించె మదగ్రమహాసనస్థితిన్.

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభాముని ముఖ్యుల రెట్టఁబట్టియా
తలఁ బడవైచుచుం దమకుఁ దామె యవారణఁ దత్తదాస
నంబులు గోని కూరుచుండిరి తపోధనులుక్ సురలు
న్వెడంగుపా, టొలయఁగ గ్రుక్కుమిక్కుమన కుండి రొదుం
గుచు నక్కడక్కడన్. 82

ఉ. యాదవసింహ నాతలఁపు నప్పుడు వారలపా టొకింత యూ
గా దనుదాఁక లేదు గలఁకం బడఁ జొచ్చె ఖలుండు వీఁడు
పెం, పేదఁగఁ జుట్టుముట్టి మము నిద్దఱఁ బట్టిన నేది దిక్కు
ప్రా, మాదిక మైన మోస మిది మన్మతి కంచు జనించుశోం
కతోన్. 83

వ. ఏ నప్పు డుప్పతిల్లెడు మదికలంక యొఱుకపడకుండ గాంభీ
ర్యంబుఁ దెచ్చుకొని తనకు వస్త్రాభరణాదిసంభావన లొనర్చు
టకు వారి వీరిం బిలిచి నియోగించుచు సంభ్రమించుటఁ

గనుంగొని యన్నిఁయు వచ్చెం జాలు నిలు మని వారింపుచు
నిలింపద్వేషి యి ట్లనియె. 84

ఆ. వలసినట్లు దివ్యవస్తువు లెల్ల నా
యిచ్చ ననుభవించి వెచ్చపెట్టి
ప్రభుత నెఱప కకట పరుఁ డిచ్చునందాఁక
నెదురు చూచుదైన్య మేల నాకు. 85

క. నీమంచితనపునటనల
నే మొగమోడుచు నెఱుంగ కి ట్లుండితిఁ గా
నేమిటికి నాకు నీదువ్య
థామాధురి యొండు వినుము తగవరి వైనన్. 86

మత్తకోకిల. ఎంతకాలము నీవు నాకము నేలి తిచ్చుట నుండి నా
కంతకాలముఁ నేలఁ బాడి బిడౌజ కశ్యపమానిరా
ట్సంతతిత్వము మీకు దానవజాతికి న్సరి గాదె నీ
వింతయుం గని రాజ్యహీనత నేఁగు మెచ్చుటి కేనియున్. 87

ఆ. ఇట్లు సేయవేని యింద్ర మీ రెల్ల నా
చేతిలోనివార చెప్పనేల
యిపుడ పట్టి నిగ్రహించెద నావుడు
నేను నగుచు యాతుధానుతోడ. 88

ఆ. నిగ్రహముల కేమి నీవును మేము న
న్యోన్యమైత్రిఁ బొదలునట్టి తెఱఁగు
నడపవలయుఁగాక యెడసి పోనాడుకోఁ
దడవె వేగిరింపఁ నగునె యనఘ. 89

వ. దానవేంద్రా! నీపలికినట్ల మన మిరువెగలవారముం గశ్యపు
సంతానంబగుటంజేసి మనయెల్లవివాదంబులు నతండ తీర్ప

నర్హుండు గావున నమ్మహామునీంద్రుకడకు నరిగి యతని యెఱుకమీఁద నీకు నాకాధిపత్యంబు నొసంగవలసిన నొసంగెదఁ దొలుత మదీయవచనంబులు విని యిట్టినైరణ వహించి తది తుదముట్ట నడపక విడిచిపెట్టుట నీయట్టిగట్టిదొరకు నుచితంబె తియ్యనినోరం జేదు మేయుట న్యాయంబు గావని మఱియు ననేకప్రకారంబుల నొడంబఱిచి యతని యతి వ్యగ్రతకుం బ్రతివిధానంబు గానక యేనపుడ యప్పటికి దొరకినబృహస్పతి ప్రముఖులు సహాయులుగా నమ్మహా దైత్యువెంటం గశ్యపుపాలి కేఁగితి నప్పు డప్పరమతపోధనుండు యజ్ఞదీక్షితుండై యున్నవాఁడు. గావున మావివాదంబులు నిజయజనావసానంబునందు విని తీర్చుటకు నియమంబు చేసి యాసురవిరోధిని యథార్థసాంత్వనాలాపంబుల శాంతుం జేసి యిప్పుడు నీవు నీవజ్రపురంబునకుఁ జనుమని యాజ్ఞాపించిన. 90

ఉ. ఇం బడరంగ నియ్యకొనియోర్చె రజనీచరుఁడేమిభాగ్య మో
యంబుజనాభ యప్పటికి నమ్మునిసత్కృప నేము నేమి చె
ప్పం బులినోరికండ విడి పడ్డగతిం దలపట్టి చూచుకొం
చుం బెనుచేటు దప్పె ననుచుం దివి కేఁగితి మొయ్య నో
య్యనన్. 91

చ. అడరి మనోద్ధతత్వమున నద్దనుజుం డెపు డేమఱించి పైఁ
బడునొ యెఱుంగ రాదు సురపట్టణరాజ్యసుఖాశ యేర్పడ.
న్విడిచితి నింక నీవు తల నిండఁగ నర్ఘము వోసితేని నే
నడు గటు పెట్టఁగా వెఱతు నచ్యుత నిన్నునె కొల్చియుండెదన్. 92

వ. అనఁటయుఁ గర్ణంబులు మూసికొని వాసుదేవుండు. 93

ఉ. పాడిఁ దొఱంగఁ జన్నె యొకపట్టునఁ గొల్చెద నంచు నెంత
మ్మాటాడితి సర్వదైవతకులాధిప యొండలు బండ్ల వచ్చు బం
డ్లోడల వచ్చు నొండొరుల కొక్కొకచో నను వైనతావు
లం, గూడుట యిష్టబంధులకుఁ గ్రొత్తయె యిత్తటి నింత
యేఁటికిన్. 94

ఉ. ఎన్నఁగఁ దొల్లి యీకొలఁది యేబలురక్కసులెంద ఱెందఱ
త్యున్నతిఁ గ్రొవ్వి తుళ్లిరు బిడౌజ తుదిం జెడిపోరె వాండ్రు
వీఁడు న్నిజనాశకాలము కడు న్నికటం బగుడు న్నలంగఁజే
సె న్నిను నింత సత్పురుషచిత్తము నొచ్చిన రిత్త వోవునే.

మ. వసుదేవుం డిపు డధ్వరం బొకటి నిర్వర్తింప నుద్యుక్త మా
నసుఁ డైనాఁ డదియుఙ్ద్వ్యగ్ధమకదా నాకేశ యాకార్యమె
ప్పుసమాప్తం బగునంతనుండియువర ప్రోల్లాసినాదుష్టరాట్సుసు
సాధించుటకుం బ్రయత్నముఁ దగం గావింత మేకాగ్రతన్.

క. నీవు నుపాయాన్వేషముఁ
గావింపుచు నుండు మల్పకార్యం బదిగా
చేవెరవునఁ దత్పురి చొరఁ
గావలయునొ యెవ్వ రోర్వఁ గలరో వానిన్. 97

వ. అని యింద్రు వీడ్కొలిపి వేడ్క భాసిల్ల వాసుదేవుండు
వసుదేవయజ్ఞనిర్వాహణధూర్వహుం డయ్యె నంత. 98

సీ. నిఖిలదేశాయాతనృపతిభూషాకర్ష
రేణుసంపోషితక్షోణికంబు
మహితావభృథలాభమహిమధన్యత్వభా
గ్జలదర్శితాపూర్వసౌష్ఠవంబు

వరమంత్రతంత్రహావ్యద్రవ్యషాడ్గుణ్య
సంభృతానలనవోజ్జ్వల్యకంబు
సన్నుతసాన్నాయ్యసౌరభ్యసంపదా
ధ్యంభవిష్ణుప్రపూతానిలంబు
తే. హోమధూమాసురంజితద్యోతలంబు
నగుచు వసుదేవునధ్వర మతిశయిల్లె
భవ్యలీలామహాభూతపంచకమున
కొక్కొకవిశేష మొసఁగుచు నొప్పుమీఱి. 99

శా. అక్షయ్యం బగు పెంపుఁదాల్చును దపోయజ్ఞక్రియాదుల్
తదీ, యక్షేమంకరనామసంస్మరణపుణ్యావాప్తి నాపుండరీ,
కాక్షుం డచ్యుతుఁ డాదిపూరుషుఁడు ప్రత్యక్షాకృతిం దానె
సం, రక్షింపం బెనుపొందుయజ్ఞమునకుం బ్రాశస్త్య మింకే
మనన్. 100

వ. అది యట్లుండె నతండు యాగసమాప్తిసమయంబున సమస్త
దేశాయాతు లైనబంధుమిత్రాదులం దత్తదర్హసంభావనల
చేతం బ్రీతులం జేయుచున్నయత్తఱి భద్రుం డనునటుం
డచ్చటికి వచ్చి యత్యద్భుతం బగునర్తనప్రవర్తనంబునం
బరితోషంబు నొందించి సభాసదు లయిన మునులచేత
వివిధంబు లైనవరంబులు నితరులచేతం బారితోషికంబు
లైన యంబరాభరణముఖ్యంబులుఁ గైకొనుచు వారిని
వేఱువేఱ యనేకప్రకారంబులం బొగడుచుం బ్రవర్తిల్లు
చున్నంత. 101

చ. కలికిపిసాళినవ్వులెనఁగ న్నటుధూర్తులు గొంద ఱొండొరుం
దలకొని నెచ్చరించి తమదండపుఁగోలల నున్నమాఱుగో

చలువెసఁబుచ్చివైచికడుసొంపులుగాఁబొగడించుకోఁజుమీా
తలఁపఁగ నిప్పు డింతతెగుదారుల మైతిమి భద్ర నావుడున్.

క. ఎలన వ్వాలయఁగ నాతఁడు
కలయఁగ నవి చుట్టి పట్టి గంభీరపుఁజే
రెలుఁ గొప్ప నోహోహో యని
పలుమఱు నెగురంగ వైచి పట్టుచు వేడ్కన్. 103

సీ. వేదసౌరభములు వెదచల్లఁ గలశుచి
బ్రాహ్మణజాతికోరకములార
పరిశుద్ధి పెంపొందు బ్రహ్మవర్చసపావ
కస్ఫూర్జితస్ఫులింగంబులార
యరయ నట్టికసీలలంత లయ్యును బింక
మున బ్రహ్మశిఖి ముట్టుప్రోడలార
దంటమాటలకు ధైర్యమునకు నానతి
పడిపట్టినట్టిసత్ప్రాజ్ఞులార

ఆ. చిన్నవడుగులార వెన్నునివామన
త్వంబు నభినయించుతంద్రులార
మీా ప్రసాద మిది సమృద్ధికారణము మా
కఖిలకార్యముల మహాత్ములార. 104

వ. అని పొగడిన నవ్వి యవ్వటువులు దుండగంబున. 105

ఆ. ఓరియాటకాఁడ యీరీతియఱపులా
పొగడు టనఁగ మెచ్చు పుట్ట దిందు
మగుడఁ బుచ్చుకొనఁగఁ దగదు నీవంటిన
గోఁచు లిపుడు పుచ్చుకొనక చనము. 106

వ. అనుచుఁ దలంగి పోక యిట్టు నట్టుం జొట్టు మెట్టాడుచిట్టివడు
గుల నానట్టు నగవునుం గోపంబుఁ గదుర నదలించుచుం
దనమేళగాండ్ర నాలోకించి యిబ్బాలకులు మనవాలకపు
సొమ్ములందు నేమేనియు నపహరించుటకు నడ్డాడుచున్న
వారు మీర లీప్రుచ్చుల నెచ్చరికం గనిపట్టుకొని యుండుఁ
డనుటయు నదరిపడుచు నప్పడుచులు గడుసుఁదనంబునఁ
నతని నధిక్షేపించి. 107

సీ. ఏము ప్రుచ్చులమె యూహింప ప్రుచ్చుఁదనాల
పుట్టినయిండ్లు మీబోంట్లె కాక
యాటవాండ్రని నమ్మి యనుమతింపఁగ నెట్టి
పుర మైన నశ్రమంబునను జొచ్చి
పగలెల్ల నాటల భ్రమయించుచును సందు
గొందులెల్ల నెఱింగికొనుచు రేలు
కన్నగాండ్రగుచు నగళ్ళ ప్రవేశించి
యందు నెంతటివార లడ్డ మైనఁ

ఆ. జక్కడఁచుచుఁ బేను గ్రుక్కినపాటిగా
నిష్ట మైనయర్థ మెల్లఁ బడసి
బ్రతుకు చునికి మీస్వభావ మింతయును ద
ప్పదు యథార్థ మనుచుఁ బలుకుటయును. 108

మ. వనజాక్షుం డిపు డింద్రకార్యముదెస న్వర్తిల్లుచిత్తంబుతో
ననికి న్వజ్రపురంబుఁజొచ్చుట కుపాయాన్వేషియైయున్కిఁజే
సి నిజాపేక్షకు నుత్తరంబుగ గ్రహించె న్వీప్రవాక్యం జనా
ర్దనయన్నాటయథార్థమై పరఁగఁదద్వాక్యక్రమంబంతయున్.

వ. ఇవ్విధంబున విశ్వంభరుండు వటువచనంబు లుపశ్రుతిగం జేకొని తదనుసారంబున వజ్రపురప్రవేశంబును వజ్రనాభ వినాశంబును నతిసుకరంబులుగా మనంబున నిశ్చయించుకొని తత్ప్రయోజనంబునకు నరుగ నర్హుం డెవ్వండొకో యను విచారంబునం బ్రవర్తిల్లె నటమున్న యమరనాయకుండు దనుజాపాయంబునకు నుపాయంబు భావించి దేశశైవలినీ విహారమహారసతరంగితాంతరంబు లగుచక్రాంగంబుల రావించి సగౌరవంబుగా నిట్లనియె. 110

తే. హంసవరులార మా కొక్కయవసరంబు
గలిగి పిలిపించితిమి మీరు గలుగుటకును
ఫలము మీచేత నైనయీపని కొదవుట
గావున వినుండు వివరింతుఁ గార్యసరణి. 111

క. మము వజ్రనాభుఁ డనియెడు
నమరరిపుఁడు మఱచినట్టియాపాట్లు సమ
స్తము మీ రెఱుఁగుదురే కద
క్రమమున నవి చెప్పనేల ఖగవరులారా. 112

ఆ. మాకు నిపుడు వాని మర్దించుయత్నంబు
గలిగి యున్నయది ప్రకాశ మైన
నెగ్గు పుట్టుఁ గాన నీరహస్యంబు మీ
మనసునందె పెట్టుకొనఁగ వలయు. 113

క. మాకంటె వాఁడు మునుపుగ
నేకార్యము సేయఁగలఁడొ యెఱుఁగము మీరల్
జోకగఁ దత్పురి మెలఁగుచు
నా కేదొకపనికి వేగు నడపఁగ వలయున్. 114

చ. ప్రతిదివసంబు వానినగరంబునఁ బుట్టువిశేషము ల్భవ
న్మతపసన్ని యుం దెలిసి మాకెఱిఁగించుట మీప్రయోజనం
బితరులచేతఁ గాదిది తదిష్టము లేక చొరంగ రాదు మా
రుతమునకైనఁ దత్పురమొగుల్పొరఁజాలమి చెప్పనేటికిన్.

క. మీరాకపోక లింపు సు
రారాతికిఁ గేళిదీర్ఘికాదులకు నలం
కారములు మీవిహారము
లారయ నేరికి నతిప్రియంబులు కావే. 116

వ. అనుటయు నాపురలోమజావల్లభునకు శుచిముఖీవల్లభుండను
మరాళతల్లజుం డుల్లసితవదనుం డగుచు నెదుర నిలిచి
దేవా యీవేళ కావజ్రనాభుండు ప్రాభవాభిమానంబునఁ
గన్నుఁగానమిఁ దన్నుఁ దా నెఱుంగకున్నవాఁడు నాకుఁ
జూడ నిప్పటికి కాదెప్పటికి నప్పరమతామసుం డింక నీవం
కకుం గదలిరా నెఱుంగఁడని తోఁచుచున్న యది యైనను
మానసంబున దేవర దేవకార్యం బేమియు నేమఱకుండు
నది యిదియంతయు నింతకుమున్న వజ్రపురినుండి యేము
గొందఱము వచ్చితిమి గానఁ గానంబడిన యర్థంబు విన్న
వించితి నెంచి చూడం గించిదూనంబుగా వానిరాజ్య
సంపదయుఁ దుదకువచ్చినది యిది మదీయజాయవలన వినం
బడియెఁ దద్విశేషంబును దానిచేత విన్నపంబుచేయించెదనని
తనచెలువం బిలిపించి బలరిపుం గనిపించి నీవు నాకు వినిపించిన
వజ్రనాభురాజ్యావసానసామీప్యంబు స్వామికి నేమియుం
గొఱంతపెట్టక విన్నవింపు మనుటయు నాశుచిముఖి శత
మఖున కభిముఖియై యి ట్లనియె. 117

చ. తడవులఁ బట్టి యేము సతతంబును బోదుము వానివీటికిన్
గడు మితి చాలమిం గడుపుఁగక్కుఱితిన్సురలోకనాథమా
యెడఁగలయట్టితప్పిది సహింపుము పక్షులమాట నొక్కవెం
బడి నిది చెల్లెఁగాక రిపుప్రాంతము చేరెడువార లాప్తులే.

వ. ఏమునుం బోక మానెద మని తలంతు మేని. 119

సీ. గగనస్రవంతిలోఁ గలసువర్ణాబ్జంబు
లందు మేలేర్చి తా నపహరించి
మానసంబు శతాత్మమానసంబును బోలె
నిస్సారసత్త్వంబు నెరయఁ జేసి
బిందుసరంబులోఁ గుందనపుందమ్మి
పేరు లే కుండంగఁ బెల్లగించి
సౌగంధికాఖ్యకాసారంబు జలమాత్ర
శేష మై దీనతఁ జెందఁ జేసి

తే. మఱియుఁ గలదివ్యసరసులు నెఱయఁ జెఱిచి
తనదు కేళిదీర్ఘికలందుఁ గనకనలిన
జాతు లెల్ల నాటించినాఁ డాతఁ డింద్ర
యటు చనక మేఁత నడుచు నే హంసములకు. 120

వ. అది యట్లుండె నట్లు వజ్రపురంబునం గల కొలంకులం దటాకంబులం గేళీకూళుల బొడ్డనబావుల నడ్డపెట్టు లేక విహరించుటకు వజ్రనాభుముఁదల యడిగి తజ్జలాశయంబు లన్నింటికి నస్మదీయ సంక్రీడనంబుకలిమి యలంకారం బగుట యెంచి యతం డంగీకరింప యథేష్టవిహారణంబుల నహరహంబునుం బ్రవర్తిల్లుచున్న యేము నిన్నఁ గన్య కాంతగృహంబున నొక్క సరోవరంబునం బరఁగుతఱి

సామ్రాజ్యలక్ష్మీసాక్షాత్కారానుకారిణియైన యొక్కకన్య
కామణి తనచెలికత్తియతోడం దత్తటంబునం గ్రొత్తవిరిగుత్తి
మొత్తంబుల నత్యంతంబు చెలువొందుగురివిందపొదరింట
నొంటినుండి యవ్వాలుఁగంటితోడ ! 121

చ. కమలదళాక్షిరో వినవుగా కల యొక్కటి గంటి వేకువన్
సమధికమైనయద్భుత మొనర్చుచు నున్నది యెన్నుకొన్నలో
కమునను గన్నవిన్నయది గా దది కొంతనిజంబు కొంత స్వ
ప్నము నని పల్కి సిగ్గుకతనన్ మఱి చెప్పక దాచె
దాఁచినన్. 122

క. ఇట్టిదుకొంటివి గద నీ
కెట్టిరహస్యంబు దాఁప నే నని మనలో
నిట్టివి గలవా యని చెలి
యట్టే తప్పు దన విరచితాంగీకృతియై. 123

వ. ఆకలకంఠి తనకల సకలంబు నకలంకసౌహార్దంబున నిట్లని
వినిపించె. 124

చ. హిమగిరిరాజకన్య పరమేశ్వరి నాకల సుప్రసన్నయై
విమలదరస్మితామృతము వెల్లువ చెక్కులఁ బిక్కటిల్ల నన్
మమతను జేరఁగాఁ బిలిచి మక్కువచే నను నొక్కకేల మే
నిమురుచు నీకు నొక్కమగనిన్ ఘటియించితి నంచుఁ బల్కు
చున్. 125

సీ. సంకల్పమాత్రతత్క్షణసన్నిధాపితం
బగుచిత్రఫలకంబునందు నొక్క
పురుషు నత్యాశ్చర్యతరరూపలావణ్య
గాంభీర్యశౌర్యాదిశుంభదఖిల

గుణములఁ గొమరొందుకొమరుఁ బ్రాయపువాని
వ్రాసి యితండ నీవల్లభుండు
ప్రద్యుమ్నుఁ డనియెడు ప్రభుకుమారుఁడు మీకు
నిద్దఱకును జనియించి నట్టి

తే. పుత్త్రుఁ డీపురి యేలు నోపొలఁతి యనుచుఁ
బలికె నఁట నేను నచటి పెద్దలు గఱపఁగ
మ్రొక్కి యనిపితి నఁట యిందు నిక్క మగుచుఁ
బడఁతి యున్నది తచ్చిత్రఫలక మిపుడు. 126

మ. అనుచు న్మెచ్చెలితోడ నచ్చెలువ యట్లాత్మ సంస్మృతస్వప్న
ముఁ, వినిపింప న్నికటంబున న్మెలఁగుచుఁ వింటి న్సురా
ధీశ దానవ యే నెన్నిక నిశ్చయించితి మదిం దథ్యంబుగా
వజ్రనాభునకుం గాలము చేరువౌట యిది నీబుద్ధి న్వివేకిం
పుమా. 127

సీ. ఆయింతిఁ బ్రద్యుమ్నజాయగాఁ బలికిన
గౌరిమాటకు బొంకు గలుగ దనుము
దనుజవిరోధిపుత్త్రునకు నాదుష్టదై
త్యుఁడు తనంతఁ దనూజ నొసఁగఁ డనుము
ప్రద్యుమ్నుఁ డట్లు ప్రభావతీపతి యైన
దానవునకుఁ బోరు తప్పదనుము
వజ్రపురము ప్రభావతికోడు కేలుట
యసురకు జయ మైనఁ బొసఁగ దనుము

తే. చిత్రఫలకంబు ప్రత్యక్షసిద్ధ మగుటఁ
జేసి యాకల యధికవిశ్వాసయోగ్య

మదియు వేకువఁ గావున నచిరభావి
ఫలము దేవేంద్ర నీ వెంచి తెలిసికొనుము. 128

వ. ఆకన్నియపేరు ప్రభావతి యగుటయు నది వజ్రనాభుని కూఁతు రగుటయుఁ దదీయస్వప్నకథనానంతర ప్రవృత్తంబు లయిన యమ్మత్తకాశినుల యుత్తర ప్రత్యుత్తరంబులవెంబడి నెఱుంగంబడియె నివియుం గొన్ని వివరించెద భవదీయ కార్యోపకారి యైనయంశంబు గలిగిన గ్రహించునది యని యాయంచగరిత యకించిదంచిత సహజమాధురీధురీణవాణీ రామణీయకంబు కావ్యకామనీయకంబున నినుమడించి బిడౌ జు నబిడౌజుం జేయుచుండ నిట్లనియె. 129

క. విను మట్లు తనదుకల చె
ప్పినయాయనుఁ జూచి సాని ప్రియసఖి యనయం
బును వెఱ గందుచు మెచ్చుచు
వనితా నీ వెంతభాగ్యవతివే యనుచున్. 130

వ. శిరఃకంపం బొనర్చి. 131

తే. మునుపు గౌరీవరంబుచేతనె జనించి
తబల నీవె ని న్గన్న మాయమ్మ నేమ
మట్టి దిట్టిది నాఁ జన్నె యగజ నీవు
నింత మెప్పించుకొంటి నీ కెవ్వ రీడు. 132

చ. వలిమలయాఁడుబిడ్డ కల వచ్చి యనుగ్రహమెంతయేనియుం
గలుగక యిట్లు చిత్రఫలకంబున నీకు లిఖించి యిచ్చునే
చెలువుని నింతదృష్టముగఁ జెప్పెదనొండొకపోతుటీఁగకుఁ
బొలయఁగ రానిచోట నిది పుట్టుటనెగ్గగు నీదుతండ్రిచేన్.

ఆ. చిచ్చు లేక చిముడుమచ్చరీఁ డీసుద్ది
వజ్రనాభుఁ డోర్చువాఁడె యకట
యగజపేరుపెట్టి యతివ యెవ్వతో యింత
చేసె ననుచు మమ్ముఁ జెందుఁ దొలుత. 134

క. ఆచిత్రఫలక మెవ్వరు
చూచిన వెలివిసరి యపుడు సుబ్బెడు నది నీ
వే చూచు టేను జూచుట
యోచంచలనయన యింతయు నెఱుంగుదు వే. 135

చ. ఇతరులు రాకమున్న యది యెక్కడఁ బెట్టినదానవో సుశీ
ఘ్రితఁ గొని తెమ్ముతల్లి ఖితుఁ గన్నులఁజూచినదాఁకనామనం
బతిముదితంబుః గా దగజ యాఁకసి యెవ్వని వ్రాసెనో సురా
పతపస నీకు జోడయినభవ్యుఁడు దుర్లభుఁ డెల్లసృష్టిలోన్,

వ. అనవుడు నక్కాంత యిక్కడ నొక్కచిగురుంబొదరుటీఱమి
నిడినదాన నని యాక్షణంబ తెచ్చి నెచ్చెలియుం దాను
నప్పలకకప్పుఁబొవడ యెడలించి. 137

చ. కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్కము చూచినట్లు తోఁ
బలుకఁ గడంగినట్లు కడుభావగభీరత లబ్బినట్లు పెం, పొల
యఁ దనర్చి జీవకళ యుట్టిపడఁగ శివ వ్రాసినట్టియా, చెలువు
న కాభిముఖ్యము భజింపఁ దలంకెనుఁదాను బోటియున్.

ఉ. చిత్తరు వన్న నిశ్చయముచే నెదురుండి మొగంబు చూడ
మో, మెత్తును సత్యపుంభ్రమసమృద్ధిని గ్రమ్మఱుఁ దత్త
ణంబ లోనొత్తుచుఁద త్తఱంబుఁ ద్రపయుఁ దమగుడంగ నిరీక్షి

ణేచ్ఛఁబో, మొత్తును భర్తచూపు దనుమోచుట దోఁచిన
నోసరిల్లుచున్. 139

తే. వెఱయుఁ ద్రపయు లోనుగఁ గలవిఘ్నసమితిఁ
గడుఁ గలఁగి పోక యుండఁ దా నడుమ నడఁచి
నేచి చిత్రతానిశ్చయ మెచ్చరింప
నింతి క్రమమునఁ బ్రియుని రూపెల్లఁ జూచు. 140

వ. అత్తలోదరి చెలికత్తెయు నత్యంతవిస్మయాయత్తచిత్త యై
యొక్కింతతడవు చూచి యిట్లనియె. 141

ఉ. ఇంతచెడంగు లోకమున కెవ్వరి కున్నది యంబ తా నిజా
త్యంతికనైపుణీమహిమ మంచన వ్రాసెనొ యేమొ కాక
యా, చింతయుఁ గూడ దీతని సృజించిరొ జోడుగఁ గోరి
సుమ్ము దా, నెంతయు నేర్పుమీఱ నజుఁ డిట్లు సృజించె
నినుం బ్రభావతీ. 142

వ. అనుటయు నక్కాంతాతిలకంబు. 143

ఉ. ఇచ్చక మాడుమాట లివి యెల్ల నటుండఁగ నిచ్చి నీకు నీ
నెచ్చెలితోడఁ సుమ్ము సఖి నిక్కము చెప్పుము వ్రాతనేర్పుగా
కిచ్చెలువంబు గల్గుచుఁ డెక్కడ నే నొకఁ డుండె నేని నేఁ
దచ్చరణద్వయంబునకు దాస్య మొనర్పఁగ నైనవ్వ నే. 144

వ. అని మఱియుఁ బెక్కుచందంబులం గందర్పరాగంబు తేట
పఱుచుమాటలం దనబోటితోడం దడవు సంభాషించుచుండె
ననియుఁ బవిలంబుగాఁ దెలిసిన నమ్ముద్దియ ప్రద్యుమ్న
శీఘ్రానయనంబునకు నుద్యోగంబు, తద్దయుం జేయుట
సంభావితంబు గావున దేవకార్యంబునకు నుపకారంబు వోలెఁ

దోఁచుచున్న యది యని చెప్పటయు నవహితమానసుండై
యాకర్ణించి. 145

శా. ధారుణ్యాభరణాయమానబుధతాధారుండు భూమోల్లస
త్కారుణ్యామృతశైత్యనిత్యదృగలంకారుండు నేత్రాంత
గా,హారుణ్యాంకురకల్పితారిమదసంహారుండు కీర్త్యంగనా
తారుణ్యాంగళనౌషధాభిజనవిస్తారుండు శూరుం డనిన్. 146

క. సాంతరవైదికసమా
చారుఁడు బహునృపకృతోపచారుఁడు నిరహం
కారుఁడు సాంగానంగా
కారుఁడు సన్నుతపవచఃప్రకారుఁడు సభలన్. 147

కవిరాజవిరాజితము

జలధిగభీరుఁడు శాంతవికారుఁడు శాస్త్రవిహారుఁడు సోమ
నసా, చలవరధీరుఁడు శశ్వదుదారుఁడు సంహృతవైరుఁడు
శంభుపదా, చలితవిచారుఁడు సాదిమసారుఁడు సత్పరివా
రుఁడు సద్వినుతో, జ్వలగుణవారుఁడు సంవిదగారుఁడు సం
శయదూరుఁడు సద్విధులన్. 148

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ
పింగళియమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామ
ధేయ ప్రణీతంబైన ప్రభావతీప్రద్యుమ్నం బను మహా
ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు

# ప్రభావతీప్రద్యుమ్నము

## ద్వితీయాశ్వాసము



చణగౌతమగోత్ర
ప్రాచీనామాత్యకీర్తిభామావిష్వ
ద్రీచీనగమనశక్తై
కాచార్యుఁడు సూరమంత్రి యమరార్యుఁడిలన్. 1

వ. ఆసహస్రాక్షుం డపేక్షితప్రయోజనానుకూల్యంబుకంటె నా పెంటిరాయంచయంచిత వచనరచనావిచక్షణత్వంబు చిత్తంబునకుం గ్రొత్తయింపుసొంపు సంపాదింపుచుం బెంపు మీఱు నింపులగు మెచ్చు నచ్చెరువు నిచ్చలంబులై తనర నిట్లనియె. 2

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబు పొంతఁబోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాడుకో నదుకుచు
నుపపత్తి యెందు సత్యార్జితముగ

తే. నొకటఁ బూర్వోత్తరవిరోధ మొందకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహాకావ్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె. 3

క. నీ వెవ్వరికొలఁదియుఁగా
వోవరటామణి విహంగయోషవె భాషా
ప్రావీణ్యము చూడఁగ వా
గ్దేవతవో కాక యాకెదిద్దినకవివో. 4

క. అనుటయు రెండవపక్షం
బనిమిషవర తప్ప దెట్టియర్థమును దగు
ల్కొనఁ దివియక వెలివో ని
చ్చునె బుధుఁ డూహించి చేయుసుకవిత్వంబుల్. 5

ఆ. విను సురేంద్ర పద్మజునిచేరు దివుచు సా
రంధరాఖ్యఁ దగుమరాళవిభుని
బిడ్డ నేను వాణి పెనుపంగఁ బెరిఁగి త
ద్విమలశిక్షఁ గంటి విద్య లెల్ల. 6

వ. అని రాజహంస తనపూర్వం బెఱింగించిన దేవేంద్రుఁడు
దానం జేసి కాదే నీవింత సామర్థ్యంబునం బొలుపు మీఱు
చున్నదానవు మీఁదికార్యంబునకుం బర్యాకులితభావం
బునం జేసి త్రోవఁ గానక దీనత నున్న మాకు మాపాలి
భాగ్యదేవత యీవిధంబున నిన్ను నన్నిటికి నాధారంబుగా
ననుగ్రహించెం గావున దేవకార్యంబు కడముట్ట నిర్వ
హించుటకు నీవతక్క నొరులు నేర రిది యంతయు నెఱింగి
యెంతయుం బ్రార్థించెద నంచబలఁగంబుతో నెప్పటియట్ల

వజ్రపురంబున కరిగి కేలిదీర్ఘికల విహరించుచుఁ బ్రభావతి తోడి చెలిమి కలిమికి నుపాయంబొనర్చి యమ్ముద్దియకుం బ్రద్యుమ్నునం దనురాగంబు బలియునట్లుగా వలయుతెఱం గున నతనిగుణంబు లభివర్ణించి యాయిద్దఱకును శీఘ్రసంగ మం బెవ్విధంబున నగు నది నీవ యొఱింగి సంఘటింపుము.

క. ఏ ననిపితి నని ద్వారవ
తీనగరికిఁ బోయి వాసుదేవునితో నీ
పూనిక సకలము చెప్పి న
వీనాద్భుతి నతనిబుద్ధి విని చనవలయున్. 8

క. అని హంసంబుల నన్నిటిఁ
గనుఁగొని మీ రెల్ల దీనికార్యవిధికి న
త్యనుకూలత మై నేత
ద్వినియోగము నడపవలయు దేవహితముగన్. 9

ఆ. అని యనుప మరాళి యమరాళికార్యం బొ
నర్పఁ జనియె సురలు నమ్మి పొగడఁ
బరిగణింప విశదపక్షపాతుల ప్రవ
ర్తనము లెట్లు నమ్మఁ దగక యున్నె. 10

వ. అది యట్లుండె నట్లు గదలి చని. 11

తే. అష్టమహిషీసమేతుఁ డై యాలయోప
వనసరస్తీరమంటపవర్తి యైన
కృష్ణు దవుదవ్వులన విలోకించి తెలిసి
యితని నెఱిఁగించుకొన వేళ యిదియ యనుచు. 12

క. తనయంచబలంగముఁ దా
నును శుచిముఖి నభము డిగ్గి నూత్నవిలాసం

బొనరించె సరోలక్ష్మికిఁ
గనకాంచితపక్షచకచకద్ద్యుతిచేతన్. 13

వ. తదనంతరంబ తా నొక్కతియ రక్కసులగొంగచెంగటికి నల్ల
నల్ల నడచి. 14

సీ. తొడలు తలాడగా నిడి రుక్మిణి భజింపఁ
బదము లొత్తుచు సత్యభామ కొలువ
సురటి చేకొని భద్ర శుశ్రూష గావింప
విరిచామరము మిత్రవింద యిడఁగఁ
గాళింది వేడ్కతోఁ గాళంజిఁ దాల్ప జాం
బవతి తములపాకు మడిచి యొసఁగ
గొడుగు పావలు కేలఁ గొని నాగ్నజితి యుండ
జలములగిండి లక్షణ వహింపఁ

తే. గ్రొమ్మెఱుంగులతోడికార్మొగులు వోలె
నొప్పుకృష్ణునిచెరువ నొప్పె హంసి
నిండు నెలరీతిఁ దారకాన్వితనభంబు
పొలుపుఁ దెలిపెడినెత్తమ్మికొలనికెలన. 15

తే. బెదరు లేకిట్లు మిక్కిలి గదియ వచ్చి
యున్న తనదిట్టతనమున కువిద లెల్ల
వెరుగుపడఁ గృష్ణుఁ జూచి నన్నమరవిభుఁడు
పనిచె నీ కొక్కమాట చెప్పంగ ననియె. 16

వ. అని తదనంతరంబ. 17

క. తనతనయుఁడు రాక్షసుపైఁ
జనియెడు నని రుక్మిణికి నసమ్మత మగునో

యనుశంకఁ జేసి హంసాం
గన యేకాంతంపుమాట గల దని పల్కెన్. 18

క. పలికినఁ గమలావిభుఁ డా
పులుఁగుపడఁతిమాటనేర్పు బుద్ధికళాకౌ
శలమును మెచ్చుచు నెంతయు
మొలకనగవు చెక్కుటద్దములఁ దళుకొత్తన్. 19

చ. చెలువుగ భోజకన్యతొడఁ జేర్చినమూర్ధము సత్యభామయూ
రులపయి నున్నపాదములు ప్రోడితలీలఁ దరల్చి లేచి యు
జ్జ్వలనిజపాణిపద్మమున జాంబవతీకరనాగవల్లికా, దళములు
పుచ్చుకొన్నఁ బ్రమదల్చని వందఱుఁ గొంతదవ్వగన్. 20

తే. ఇట్లు గోవిందుఁ డేకాంత మిచ్చి వినఁగ
హంసి తము వజ్రి పిలిపించు టాదిగాఁగ
నచటి కనుచుట తుదగాఁగ నతనితమవ
చగిప్రసంగంబు నిరవశేషముగఁ జెప్పె. 21

వ. ఇట్లు చెప్పిన. 22

చ. వడుగులప ల్కుపశ్రుతిగ వారక ముచ్చు సునిశ్చితత్వముఁ
బడసినకార్యపద్ధతికిఁ బక్షివధూవచనక్రమంబుచేఁ
గడమ సమర్పితం బగుడుఁ గంజదళాక్షుఁడు సంతసిల్లెనే
ర్పడియెనువజ్రనాభవధభారవహుండిపుడంచునాత్మలోన్.23

వ. ఇట్లు సంతసిల్లి శుచిముఖి కిట్లనియె. 24

చ. బలవిభవాభిశోభితుఁ డభంగురశౌర్యధురంధరుండు కా
వలసినమాయలు న్దివిజవైరులకంటెఁ గరంబు నేర్చు నీ
పలుకులచంద మారయఁ బ్రభావతికిం బతిగాఁ గలాఁడు ని
చ్చలముగ రుక్మిణీసుతుఁడు చంపు నవశ్యము వజ్రనాభునిన్.

క. ఆరాక్షసుపట్టణ మె
వ్వారికిఁ దదనుజ్ఞ లేక వైరమునఁ జొరం
గా రాదఁట ప్రద్యుమ్నుఁ డ
వారణఁ దత్పురముఁ జొచ్చువైపు విను మిఁకన్. 26

సీ. భద్రాఖ్యుఁ డగు నటప్రముఖుఁ డొక్కరుఁడు ము
న్నరుదెంచి మజ్జనకాధ్వరమున
ననయంబుఁ గూడినమునిసభం దన నాట్య
గరిమచే మెప్పించి వరము గాఁగఁ
దన కవధ్యతయు సప్తద్వీపగమనంబు
నాకాశగతియు నాట్యములయందు
నెవ్వరిరూపు వహించె వారలయట్లు
తాను భేదము లేక తనరుటయును

తే. బడిసి యేడుదీవుల నాటపస నెరపుచుఁ
దిరుగుచున్నాఁడు వానిపై దితిసుతునకు
వేడ్కఁ బుట్టంగఁ జెప్పి యవ్వీడు చొరఁగ
మొదలఁగాను మార్గంబై వచ్చు మదనుఁ డంత. 27

వ. ఇది నీకుఁ బరమప్రయోజనంబు దీన నుపయోగింపఁ దగిన
యవాంతరకృత్యంబులుఁ దత్తదుపాయంబులు నీవ యెఱుం
గుదు పొమ్ము సురకార్యంబు నిర్వహింపు మని వీడుకొలి
పినం దనమరాళజాలంబుతో జాలపాదవనిత గగనంబున
కెగసి వజ్రపురంబున కభిముఖంబుగాఁ బ్రయాణంబు సలుపు
నప్పుడు ద్వారకానగరబాహ్యప్రదేశంబున వాహ్యాళివిహార
పారస్యంబునం దలిగి యున్నప్రద్యుమ్నుండు. 28

చ. తనహృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంతనంత నే
పనుపడ నిల్చి ముందఱకుఁ బాఱె కెలంకులకుం జొలంగి దా
వెనుకకు నేఁగుదెంచి కడువేడ్క యొనర్పఁగ బంతి చూడ నె
మ్మిని గనకంపుఁగోల నడిమింటనె త్రిమ్మరఁ బారిఁగొట్టుచున్. 29

వ. మఱియును. 30

చ. ఎగురఁగవైచి కొట్టు టది యెంతభరం బని బంతి యగ్రగా
మిగ వడిఁ బాఱవైచి పుడమిం బడనీక యు దాని మీఁదె చి
త్రగతిహయంబుఁ దోలుచును గ్రమ్మఱ మీఁదికిఁ గొట్టి యాడె విం
తగఁ దనచేతిరత్నమయదండము కాంతులు గాడిపాఱఁగన్.

వ. వెండియు నతండు మండలగతుల నతులంబుగాఁ దురంగంబుఁ
దోలి యాడె నప్పుడు. 32

సీ. తొలుదొల్త నయ్యేకతురగంబు మండల
గతిచారి యగుచు నిక్కంబు తోఁచె
నావెనుకను సరూపాశ్వాలి చెదరక
చక్రాకృతిని బర్వసరణి తోఁచె
నంతట ననతిస్ఫుటావయవంబుగా
నెనసి యేకాంగవేష్టనత తోఁచెఁ
దుదఁ దద్విభూషణద్యుతిరాజిమాత్రంబు
కొఱవి త్రిప్పినరీతి మెఱసి తోఁచె

తే. నంతకంతకు గతివేగ మగ్గలింప
రాఁగ వాగె గుచ్చురిక పరాకు జియ్య
యనుజనులు ఱెచ్చవడి తమసని మఱవఁగఁ
బరఁగు నమ్మేటి నెఱరౌతు ప్రౌఢికతన. 33

చ. ఉరుజవశాలి యత్తురగ ముల్కుకచక్రనయావలంబి యై
తిరుగు రయంబుచేత నెడత్రెవ్వక కుమ్మరిసారెచాడ్పునన్
బరఁగెఁ గడున్ ధృతాభినవభాండతకుందగనుల్కిపట్టు దాఁ
దరలకపైని దద్భ్రమణదండగతిన్ హరిపుత్త్రుఁడొప్పఁగన్. 34

వ. అతఁ డంత. 35

క. వల్గితముఖగతిపంచక
వల్గువిహారముల సైంధవము నలయించెన్
వల్గావిభాగకుశలత
వల్గత్కుండలమరీచి వల్లరు లెసఁగన్. 36

శా. నానావీథిగతిప్రభేదవిహృతిన్ సంతృప్తుఁడై కంతుఁ డింపూ
నన్ వాగె గుదించినన్ బురుషకప్రోన్నమ్రపూర్వాంగమై
కానంగాఁ బడియెన్ మరుజ్జవన మాగంధర్వ మర్కాశ్వసం
తానస్పర్ధను మిన్ను ద్రాఁకెడుక్రియన్ దా నెంతయుం
జూడ్కికిన్. 37

సీ. సముపలాలనయుతస్కంధకాంతికాస్ఫాల
దమితతేజోమహాధ్ధత్యకంబు
దంతాళికానియంత్రణసమున్నామితా
కుంచితగ్రీవాసమంచితంబు
దందన్యమానశబ్దాయమానఖలీన
ఖపణరుఘుర్ఘురితసృక్వద్వయంబు
ఘనఘర్మడిండీరఖండపాండురితప
ల్యయనవర్ధోభయప్రాంతకంబు

తే. నగుహయము డిగ్గెఁ బ్రద్యుమ్నుఁ డంకవన్నె
యొకటి సాహిణియవ్వల నూఁదిపట్టఁ

దనయనుఁగుచెలికాఁడు కైదండ నొసఁగఁ
బ్రజ సురాళించి మణులు వస్త్రములు వైవ. 38

ఆ. అపుడు గగనసరణి నరిగెడుశుచిముఖి
యతనిఁ జూచి యల్లయతఁ డితండ
కావలయు నవశ్య మీవరపురుషుతో
మాట లాడి చనుట మనకు మేలు. 39

క. అని యాప్రద్యుమ్నునకుఁ
వినఁబడునట్లుగ మరాళవితతులతోఁ బ
ల్కి నిజోక్తి కతఁడు వెఱఁగం
ద నయంబున నవియుఁ దాను ధరణికి డిగ్గెన్. 40

సీ. మరునశ్వగతి మెచ్చి సురలు వైచిన పైఁడి
వ్రాఁత క్రొమ్మడుఁగుదువ్వాలువ లనఁగఁ
దర్పకు నెఱరౌతుతనము పేర్మికిఁ గ్రమ్ము
కొనుసతేజఃకీర్తిఘనము లనఁగ
హాయఫేనధావళ్యయాచ్ఛాదమై వ్రాలు
తటిదనుగతసితాభ్రంబు లనఁగ
వాజివిభ్రమజితావర్తత దోలఁకుది
వ్యాలయేటిసాబ్జరేణూర్మ్ లనఁగఁ

తే. గనకరేఖలతోఁడి తెక్కలబెడంగు
చూపఱకుఁ గనుపండువై సొంపు మీఱ
జలదపథముననుండి భూస్థలికి డిగ్గు
హంసములు వర్ణ నాసీము నతకరించె. 41

సీ. ఇట్లు గన్పట్టుచు నేతెంచి యంచలు
వసుధ చేరువ నేటవాలుగాఁగ

నతినిశ్చలప్రసారితపతత్త్రంబులై
డిగుచుఁ గామునిముందటికిని గొంత
సరి గడవఁగఁ బాఱి మరలి బోరలు దెట్టి
గిల నొక్కకడ వంచి మలపు దిరిగి
యొఱక లంతట రెండు నెఱయఁ జక్కఁగఁ జాఁచి
యవనిఁ గా ల్మోపి ఱెక్కార్చి ముడిచి

తే. మొగము లోకవింతయొయ్యారముగ మలంచి
యీఁకను విదిర్చికొనుచు నొక్కింతతడవు
హైమరేఖావిచిత్రనిజాంగరుహావి
నిర్మలతఁ జూడ్కులకు నింపు నింపుచుండె. 42

వ. అంతఁ బ్రద్యుమ్నుఁ డుద్యోతమానకౌతుకంబున వాని నుప లక్షించి పక్షివరులారా తొలుత నితనితో మాటలాడవలయు ననుకొంటి రిచ్చట నెవ్వనితో నేమి మాటలాడవలయు నతనిం బిలిచి సంభాషింపుఁ డెట్టిప్రయోజనంబున నెందుఁ బోవుచున్నవారలో మీఁగ లన్యోన్యపరోధంబునం గార్యవిరో ధంబు సైరించి యుండరుగదా యనుశంకచేత సంకోచంబు లేక వేగిరించి యీఁగతిఁ బలుకవలసెఁగాని భవదీయసన్ని ధానసౌభాగ్యంబునం దనిసి కాదు మీరూపచేష్టావచో విశేషంబు లరయ దివ్యజాతిపక్షులరు గాని ప్రకృతిహంసం బులు గా రనుటయును నంత శుచిముఖి యఖిలజన మనో హరం బైన మధురస్వరంబున ని ట్లనియె. 43

ఉ. ఇచ్చట మేము వేఱె మఱి యెవ్వరితోడను మాటలాడఁగా
వచ్చెద మచ్యుతాత్మజ దివస్పతిపంపునఁ గృష్ణపాలికిన్

వచ్చియతండువీడ్కొలుపవారలయిద్దఱయాజ్ఞలున్ గదున్
హెచ్చరికన్ ధరించి యిపుడేఁ గెడులాగిది యొక్కచోటికిన్.

ఉ. ఇప్పుడు నిన్నుఁ జూచి కొలువించుక చేయ కతిక్రమించిపో
నొప్పదటంచు వచ్చితిమి యోగ్యసమర్థ్వాణమానుటెంతయు
న్దప్పగదయ్య యాదవవతంస నినుం గని నీయనుగ్రహం
బొప్పగఁ గాంచి పోవుట ప్రయోజనసిద్ధికిమూలమారయన్.

క. నీపలికినట్ల యేము సు
రాపగఁ గ్రీడించుదివ్యహంసములము నీ
చూపునకుఁ దప్పు గలదే
యేపట్టున నైనఁ బంక జేక్షణతనయా. 46

వ. ఏము కాశ్యపులము మమ్ము నింద్రుండును మాతండ్రియుపేం
ద్రుండును నిజపరివారంబులోనివారిఁగా విచారించి యీ
రీతిఁ బని పంచి నడుపుకొనుచున్నవారు వారిజాక్షునకు దక్షి
ణభుజాదండంబునుం బోలె నఖిలకార్యంబులందు నత్యంత
ధురంధరత్వంబు వహించి యున్నవాఁడవు గావున మా
విధంబు నీకు విన్నవించుకొంటి మెల్లపట్టునం దృష్టిఁ బెట్టు
కొని యుండునది యేము పోయి వచ్చెద మనినఁ బ్రద్యు
మ్నుం డి ట్లనియె. 47

తే. మీరు పోయెడికార్య మెవ్వారలకును
జెప్ప రాదేమొ పోనిమ్ము చెప్పు మొకటి
యల్ల యతఁ డితఁ డనుకొంటి రాది నెచట
నాప్రసంగంబు రాఁ గారణంబు గలిగె. 48

క. అదియును జెప్పఁగ వచ్చిన
యది యైన నొకింతవడి ప్రయాణత్వరయున్

గుఱియింప వచ్చునేనిన్
బదరక నిమిషంబు నిలిచి భాషింపఁదగున్. 49

చ. అనుఁడు రహస్యమైనదియొ యానుభవత్పరిపృష్ట మెంతయున్
జనక నిమేషముం దడయ సంగతి గాదును మాకు నైన నీ
వనఁగ జనార్దనుం డనఁగ నారయ భేదము లేదు కావునన్
వినువినిపింతుమాపనియు నీదు ప్రసంగముమున్ను కల్మియున్.

వ. అని శుచిముఖి యిట్టట్టు పలుకఁ గొంకి నలువంకలుఁ బాఱఁ
జూచుటయు నాచూపు వెంటనె శంబరాంతకు చూపు
దీపిత్తై కాంతకాంతిఁ బగుచుం బరఁగినఁ బరిజన సమా
నంబుగా మాననీయులు నాయన యున్నచోటికిఁ గడు నెడ
గలుగఁ దొలంగి చని రంత నంతఁ గంతు నభివీక్షించి
యంచచెలువ చెలువంపుఁజెలువు గులుకుకలికిపలుకులకల
కలంబు వీనుల కపూర్వాపర్వం బగుచుఁ బర్వుచుండ ని
ట్లనియె. 51

క. వినవయ్య వజ్రనాభుం
డనియెడునొకదైత్యుఁ జంప యత్నము సతతం
బును నడచుచున్న యది బహు
దినములనుండియును హరికి దేవేంద్రునకున్. 52

క. తమకంటె మున్ను వాఁడే
తమమీఁదట నేమి కీడు దలఁచునొ యనుచున్
మము వారు వేగు పంపఁగ
నమరాహితువీటి కిప్పు డరిగెద మనఘా. 53

వ. అనిన విని యతండు. 54

క. కటకట మనవా రిది దు
ర్ఘటముగఁ గొని యెంతచింత గావించెద రె
ప్పటి కింక నేము మే మెం
తటిపగయును దీర్ప లేమె తమయాజ్ఞ పసన్. 55

క. అకట తమమహిమ తా రెఱుఁ
గకయో మఱి యేలొ తెగరు గాక మరుత్కం
టకుఁ బీఁచ మడంపనె న
న్నొకనినె పంపినను దమని యోగముబలిమిన్. 56

వ. అనుడు శుచిముఖి మెచ్చు నచ్చెరువు నిరవుకొన నతనిం
జూచి యి ట్లనియె. 57

చ. భిదురధరుండుఁ జక్రియును బెట్టుగ దీర్ఘవిచార మింత చే
యుదురఁట దైత్యుఁడెంతబలియుం డొకదాయనికోఁచవాఁడికి
ట్లుదుటునవానిఁ ద్రుంతు నను నొక్కనిఁబంపిననంటి చాల దే
యిది నెరవైనబంటుతన మిట్టిది నీక తగుం గుమారకా. 58

ఉ. కయ్యపువేడ్క రేఁచుకొని క్రమ్మెడుతమ్మెదిరించియేమియుం
డయ్యక కొంతసేపు పెనుధాకను జేతుల కాఁటి నిల్పువాఁ
డయ్యెడఁ బోటుబంటునకు నెంతయుఁగౌతుక కారిగాఁడె నీ
వయ్యసురేంద్రుతోడియని కాసయొనర్చుటయుక్త మెన్నఁగన్.

ఆ. తమకుఁ దామె ప్రల్లదంబునఁ బనిలేని
కయ్యమునకుఁ జనరు కాని తగిన
దురములైనఁ దివురుదురు తమయంతన
పిఱికికండ లేనిబిరుదుమగలు. 60

వ. అది యట్లుండె నింక నీప్రసంగంబు మున్ను వచ్చినతెఱం
గును విన్నవించెద వినుము. 61

ఉ. ఇంతకుమున్ను వజ్రపురి కేఁగుచు నుండుదు మేము గావునన్
గాంతతరాంగి నద్దనుజనకన్యక నే నొకనాఁడు గంటి శు
ద్ధాంతరసప్రకాండసముదంచితకేళిఁ జరించుచుండి త
త్ప్రాంతలతాగృహంబున వయస్యయుఁ దాను ను ముచ్చ
టాడఁగన్. 62

క. తిర్యగ్వనితను నన్ను న
మర్యాదానందమగ్నమతిఁ జేసె మహా
శ్చర్యముగఁ దద్వధూసౌం
దర్యం బపు డేమి చెప్ప నలినాక్షసుతా. 63

సీ. నెత్తమ్ము లనుచుఁ గ్రొన్నెల లంచు వటఫల
శ్రీ లంచు తాఁబేటిచిప్ప లనుచు
నమ్ములపొదు లంచు ననఁటికంబము లంచుఁ
బులిన మంచును సుడిచెలువ మనుచు
హరిమధ్యమం బంచు హైమకుంభము లంచు
నవమృణాళము లంచుఁ జివురు లంచు
మదనుశంఖ మటంచు మణిదర్పణము లంచు
బగడ మంచును దిలప్రసవ మనుచు

తే. శఫరు లనుచు సింగిణు లంచుఁ జంద్రఖండ
మనుచు శ్రీకారము లటంచు నళు లటంచు
నిట్టివి గదయ్య చెప్పఁబోయిన నుపమలు
వీనిఁ దడవ సిగ్గౌదవు నవ్వోలఁది నెంచి. 64

తే. చామరంబులు వెనుకకుఁ జనుట నీల
రత్నములు పూరిఁ గఱచుట భ్రమరక మని

తేఁటిబిడ్డ పేరిడుటయాతెలుపకురుల
కధికనీలిమ నోడి సూ హారితనూజ. 65

క. అకలుషనీలిమ నాక
న్యకకచమున కోడి పాఱినవి యై తేఁటుల్
మకరందార్థము తలఁచుగ
*వికచములగుపుష్పములకె వెదకుచు నుండున్. 66

తే. చంద్రభీతఘనధ్వాంతసంచయమున
కభయ మొసఁగి వేణీభరం బనునెపమునఁ
దనవెనుక వేసికొన్నది తరుణిమొగము
చంద్రుఁ గైకొనమి కిదియ సాక్షి గాదె. 67

క. కాంతతరఫాలసంజ్ఞిత
కంతువిజయచేఖపట్టికావిన్యస్తా
ద్యంతశ్రీకారము లన
నెంతయు నాయింతిపీను లిం పెసలారున్. 68

చ. తిలకము సంహితార్థ్యముఖతీక్ష్ణశరాగ్రముగాఁగనాసికాం
చలవిలసత్ప్రికోష్ఠసుమసాయకముష్టిగృహీతమధ్యశా
ర్ఙలత యనఁగ బొమల్ దనరఁగా నిరుగొమ్ముల ప్రేలువెల్లజ

* వికచములు=కచములులేనివి, వికసించినవి. లోకమున నోటమిఁ జెందినవా రభిమానవంతు లగుదు రేనిఁ దమప్రత్యర్థులను మరల సంపూర్ణపరాభవ మందింప గాఢప్రయత్నము కావించుటయు, నంతటిశక్తి సంపాదించుకొనువఱకు వారలఁ గదియఁ బోకుండుటయుఁ గలదు గావున నైల్యము నెడఁ దేంట్లు కచముల కోడిపోయి వానిజయించుతలంపున ముందు వికచము లగు పువ్వులయందలిమకరందమును గూడఁబెట్టుచున్న వని భావము. (తేళ్లు తాఁకినవెంద్రుకలు తెల్లనగు నని లోకప్రతీతి.)

ల్లులగతినవ్వుడాలు పొదులుకొమరారదితోఁ మెఱుంగుఁజెక్కు-
లన్. 69

ఉ. అంబురుహాక్షినాసిక నిజాన్వయశత్రువుఁ జంపకప్రసూ
నంబుఁ గరంబు గెల్చుటమనంబునఁబెట్టి తదీయపార్శ్వయు
గ్మంబున నిత్యసేవకతఁ గ్రాలెడునీక్షణతారకాఖ్యరో
లంబకదంపతుల్ పెనువళావళి నెంతయుసంభ్రమించుచున్. 70

ఉ. బింబఫలోష్ఠికన్ను లనుబేడిసమీలిరుదిక్కులన్ సమా
నంబుగఁ బర్వుచున్న శ్రుతినామసరోయుగశోభ లిట్టు న
ట్టుం బిరువీఁకుసేయఁగఁగదుర్దమి నెందుకుఁగాక రెంటిమ
ధ్యంబునఁ బాతెడిం బరువు లారయఁ జాపల మట్టిదే కదా. 71

తే. కలయ నాపాదమస్తకాంగములయందు
మించి పటలీలఁ దరళతోఁ దంచిత మగు
యువతిలావణ్యమును గన్నుఁగవయు నతను
దంటమీఁ లెక్కియ మనఁ దనరుఁ జూడ. 72

ఉ. ఎప్పుడు భక్తభావమున నిం పలరన్ ద్విజరాజుపాదముల్
దప్పక సేవ చేయుసుకృతంబునఁ గాంచెఁ జకోరయుగ్మమీ
యొప్పున నొప్పుఁగన్ను లవియోలిని గ్రోలిన తేటవెన్నెలల్
చిప్పిలినట్లు మించు సతిలేనగవున్ దెలినిగ్గుఁజూపులున్. 73

ఉ. సౌవరమాధురీస్పృహాపసం బికమో శుకమో తదీయజి
హ్వావిలసత్సరస్వతి నుపాసన చేయుచు నగ్రభూమి నిం
పావహిలంగ నేర్చి యుపహారముగా నిడినట్టిపల్లవం
బో విమలంపుబింబఫలమో యనవా తెలయొప్పు నింతికిన్. 74

క. మగువయధరంబు పగడముఁ
జిగురును బింబమును బంధుజీవకమును గ

ట్టిగ గెల్చి కన్నసత్కీ
ర్తిగతి న్నాసాగ్రమణిమరీచి వెలుంగున్. 75

తే. మృదులపవనాహతి నొకింత గదలి యాడు
పల్లవముమాటునను దోఁచు మొల్లమొగ్గ
చాలుగతిఁ బల్కుబడి మోవిచాటునఁ గనఁ
బడుచు నింతిపల్వరుస కన్భ్రాంతి పఱుచు. 76

క. చెలువపలు కమృతరసములు
గులుకుట వీనులకె కాదు కోమలదంతా
వళిరుచియును శీకరపుం
దెలినిగ్గునఁ గన్నులకును దెల్లమ చూడన్. 77

తే. కనకకర్ణికాధారాళికాంతు లడికి
బాహులతికలు బిరుదుసంపంగిదండ
లిరుగడల వ్రేల వైచినకరణిఁ బరఁగఁ
గంబువిజయము పచరించుఁ గాంతగళము. 78

క. ఖరకరకరభిన్నము లై
కర మెలమి వహించునరుణకమలంబులతోఁ
బురుడింపఁ దగునె గొజ్జఁగి
విరితేకులబంతిగములు వెలఁదికరంబుల్. 79

ఆ. జిలుఁగుఁబయ్యెద యనువలలోన నాచెల్వ
గుబ్బచనుఁగవ యనుకోకయుగళి
యొగయఁ బెనఁగురీతి నెసఁగుఁ గ్రేవలఁ జల
తృషలీల మెఱుఁగుఁదరఁగ లడర. 80

తే. చారుతరనాభి యనెడుగంభీరసరసిఁ
గడఁగి క్రీడించుమరునిశృంగారరసపుఁ

జిమ్మనవుఁ గ్రొవ్విథార నాఁ జెన్ను మీఱుఁ
బడఁతినూఁగారు కన్నులపండు వగుచు. 81

చ. తనుతరరోమవల్లరికిఁ దా నియవంకలఁ గల్గు లేదు నా
ననయము సూక్ష్మసూక్ష్మముగ తజ్జలజాననకౌను మించి లో
చనముల కిం పొనర్చుఁ గడుసన్నపుఁగారు మెఱుంగుఁదీఁగెచ
క్కనినిడుబీటవాఱి కనఁగాఁబడున ట్లతియత్నదృశ్యమై. 82

క. చనుఁగవ వ్రేఁగున గిటగిట
మనునెన్నడు మేమి యగునొ యనియెడిశంకన్
గనకపుఁగ ట్టిడినాఁ డో
వనజాసనుఁ డనఁగ వనితవళు లిం పెసఁగున్. 83

తే. నెన్నడిమి పేరిమింట నన్నెలఁతబొడ్డు
పొన్నవిరి నిక్కముగఁ జూచి చిన్నఁబోదు
రభ్రకుసుమసౌరభసాధనార్థహేతు
వాశ్రయాసిద్ధ మనియెడియయ్యె లెల్ల. 84

చ. సుకవులు క్రిందుమీఁదరసిచూడక యీడనియాడుకొన్న హా
టకకదళీవిలాస మకటా విపరీతము గాక సాటియే
యకలుషరామణీయకసముంచితకోమలతద్వధూరుల
క్ష్మికి సరిగావ మెంత తలక్రిందయినన్ గరిరాజహస్తముల్.

తే. రమణిజంఘములు శాలిగర్భములు పీర
దీప్తిజలపూర్తి నొప్పునందియలు మళ్లు
వానిలోపలఁ జలువకై వచ్చియున్న
కచ్ఛపంబులఁ బోలి మీఁగాళ్లు దనరు. 86

క. కెందామరలుఁ జిగుళ్లును
సౌందర్యశ్రీలఁ దమకు సరి గా వని యా

యిందుముఖిపాదములు నగుఁ
గందళదుజ్జ్వలనఖాంశుకైతవయుక్తిన్. 87

శా. శృంగగ్రాహికఁ జెప్ప నేతెఱ తెఱఁవుల్ సిద్ధింపమింజేసి చి
త్రాంగశ్రీనిధి నవ్వధూమణిని స్థూలారుంధతీన్యాయమా
ర్గాంగీకారమునన్ వచించితిని జంద్రాద్యోపమ ల్యూచనా
భంగుల్గానియధస్సహస్రగుణసౌభాగ్యంబులాయజ్ఞముల్. 88

ఉ. వెన్నెలతేటసిగ్గు నరవిందపుతేనియమృదుత్వముం బదా
ర్వన్నియజాళువాపసిఁడికంగు మెఱుంగులధాళధళ్యముల్
గన్నియరూపుగాఁ గరువుగట్టినినోజుఁడుపోఁతఁబోయఁబో
లు న్నెఱనేర్పుతో ననఁటలోకులపల్కిడిచాల దేమియున్.

ఉ. ఎమ్మెయిఁ బ్రజ్ఞ మీఱ వచియించెద నన్ను వచింపలేన య
క్కొమ్మపెడంగులోననొకకోటితమాంశమునైన నంతమా
త్రమ్మ మదుక్తిశక్తి యనరాదతివాఙ్మహిమాఢ్య నేనుమా
యమ్మ సరస్వతీపతి తనంతటిదానిఁగ నన్ను దిద్దుటన్. 90

వ. అని తాను బ్రహ్మదేవుని రథవాహనంబైనసారంధరుం డను
హంసవంశావతంసుకూఁతు రగుటయుఁ దదీయసంబంధ వశం
బున నంబుజాసనురాణివాసంబునందు వాణిపెంపఁ బెరుఁగు
టయుఁ దదనుగ్రహంబునం దనకు నఖిలవిద్యలుం గరతలా
మలకం బగుటయుం జెప్పి మన్ముఖంబు శబ్దసంస్కారపూతం
బనుబుద్ధి నద్దేవియ నాకు శుచిముఖి యను పేరిడియె నని
యిట్లనియె. 91

చ. నలినజు రాణివాస మొకనాఁడు ననుం దనచేతిప్రోదిరా
చిలుకనువాడుకుంగవితచెప్పఁగదానియమించియందునా

పలుకులఁగొంతవాసిగనిభావముసంగడు మెచ్చుచున్నఖాం
చలమునవాదుతెక్కనులిచక్కఁగదువ్వుచుగారవించుచున్.

చ. ప్రబలము లైనకౌతుకకృపారసవత్సలతాదరంబులన్
శబలితచిత్త యై యపుడు నాకుపమాతిశయోక్తికామధే
నుబిరుద మిచ్చి తల్లి ఖితనూపురము న్భువనైకమాత య
య్యబలమదంఘ్రిఁ దాఁ దొడిగె నా బిరుదం బిది చూడు
మేర్పడన్. 93

క. అని నిజనూపురగతవ
ర్ణనికాయముఁ ద్రిప్పి చూపి నారాయణనం
దన యిట్టినాదుపలుకుల
కు నగమ్యము దనుజకన్యకోమ రూహింపన్. 94

వ. ఆజగన్మోహనాంగిం జిత్రఫలకంబున వ్రాసి యైనం జూపెద
నం టేని. 95

క. ఏయంగకమును భావన
చేయక వ్రాయంగ రాదు చేసిన నానం
దాయత్తత మది చొక్కుఁ బ
రాయత్తపుబుద్ధిఁ జెలువ నలవియె వ్రాయన్. 96

వ. అదియునుం గాక. 97

క. అత్తరుణీమణిరూపముఁ
జిత్తరువున వ్రాయునేర్పు చేకుఱునేని
దత్తుల్యవనిత నెందే
నత్తోలువేలుపు సృజింపఁడా తనసృష్టిన్. 98

అజుఁడె యొకప్రసంగమై చెప్ప వింటి న
క్కాంత యతనిసృష్టి గా కునికియు

నాదిశక్తి శివునుమాదేవి తనదైన
చిత్రమహిమచే సృజించుటయును. 99

క. విను మిపు డది సంస్కృతిపద
విని జెందెను మాటమాట వెంబడి నెందే
ననుభవభవసంస్కారం
బున కుద్బోధము ప్రసంగమున నగును గదా. 100

మ. దనుజేంద్రాంగన కంబికావరమహత్త్వస్ఫూర్తినాలోకమో
హన జన్మించుట వింటి వెండియుఁ దదంగాలౌకికశ్రీప్రవ
ర్తనమూహించిననట్ల రెంటికిఁగడుం దార్కాణమయ్యెన్మనం
బునకిట్లిప్పుడు సంస్కృతంబయిన యంభోజాతజాతోక్తియున్.

క. వినుము ప్రభావతి యన న
వ్వనితామణినామ మర్థవంత మ్మగుచుం
దనరారుచుండు ననయం
బును యదుకులకలశజలధిపూర్ణశశాంకా. 102

తే. ఆప్రభావతి తనకల నగజ వచ్చి
వ్రాసి దయ నిచ్చె నని యొక్కరమ్యపురుషుఁ
జిత్రఫలకాభిలిఖితు నెచ్చెలియుఁ దాను
గరము వేడుకఁ జూడ నేఁ గంటి ననఘ. 103

క. ఆకన్నప్రతిమసుద్దులు
మాకు మునుపు కలిమిఁ జేసి మహనీయతదీ
యాకృతిషోలు పంతయు భవ
దాకృతి గని యతఁ డితండ యనుకొంటి మొగిన్. 104

వ. అని పలికి మాకు నిక్కడ మిక్కిలిం దడయుట యుచితంబు
గాదు పోయివచ్చెద మనుప నవధరించితే యనుచుఁ దోడి
యంచలుం దాననప్పులుఁగుచెలువ యుప్పరవీధి కెగసె నప్పు

డమ్మురాళంబు లరాళంబులుగాక యాకాశభాగంబున గమన
వేగంబున దీఁగసాఁగిన బాగు మెఱయునిజగరుత్కనకరేఖా
మయూఖంబు లాఖండలారిదిక్కునకు నక్కజంపు బెలమిం
గొనలువాఱి యుద్దీపించుప్రద్యుమ్నప్రతాపవైభవంబునుం
బోలెఁ జాల నాలోకనీయంబు లగు చుండఁ దత్పురస్సరత
దీయకీర్తిమూర్తివిశేషంబులో యన సోయగంబున మీఱి
గగన మంతయుం గబళించుటకు నొక్కకడకు నొత్తుకొని
పోవ బాఁకలు చాఁచినచందంబున నిస్పందప్రసారితంబు
లైన తనూరుహంబులతోడం జూడ నొప్పారుచు నప్ప
టప్పటికి నవికళధవళిమస్నిగ్ధ నుభయపార్శ్వభాగపాండురబ
లాహకంబుల నహంకృతిపెక్కువ నొక్కపెట్ట కలహించు
టకుం బిలుచుభంగి సంఘటిల్ల నుల్లసిల్లుపక్షయుగళ విక్షేప
వ్యాపారంబులచేత నుద్యోగించుచు నొక్కొక్కయెడఁ
బ్రడీనోడ్డీనసండీనయానభేదవినోదంబు లాచరించి రోదో
ఽంతరం బంతయు నెంతయుం గలయ మలయుతపుచ్ఛామలంపుఁ
దెలివళుకుఁ జిలికి యది మలయజంపుఁగలయంపిచెలువు
నలవరింప నందుఁ గుందనంపురంగవల్లి కామతల్లికలయుల్లా
సంబు వెల్లిగొలుపు గురుదంతకాంతివల్లరులచేత నతిశ
యిల్లుచు నొక్కొక్కచోట నొండొంటిసందున సందర్శ
నీయంబు లగునభోవిభాగంబులవలన నస్థానభానుసంభ
వాసంభేదసంభృత శబలతావిలాసభాసుర సురాపగా
ప్రవాహ సందేహాకందళనంబులకు ననుగుణం బయిన
పరపున నిడుపాఁజులు గట్టి యిట్టట్టు చెదరక చదల
నడచుచు వజ్రపురంబు చేరి తొంటియట్ల సకలజలా

శయంబుల విహరించుచుండె నందు శుచిముఖి కన్యాంతగ
పురసరోవిహారసమయంబుల. 105

సీ. జలఖేలసంగనాకలకలంబులకు మి
క్కిలి వవ్వ వాఱక నిలిచి నిలిచి
పడఁతు లొక్కొ రొకళ్లపైఁ జల్లుజలబిందు
లొడలు సోఁకినఁ బోక యోర్చి యోర్చి
యొలలాటలతమి నొండొరుఁ దఱుముచె
ల్వాలధాక కులుకక మెలఁగి మెలఁగి
లీలావతీహస్తలీలాబ్జకేసరం
బులకును బసి గొంచు మలసి మలసి

ఆ. క్రమముతోడ దనుజకన్యకాంతగపుర
కాంతలకును బెదర కింత నంతఁ
జేరికలఁ జరించు టారూఢిఁగా నల
వాటు చేసికొనియెఁ బాటవమున. 106

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీరుచిరరూపబ్రహ్మముఁ హంసయో
షిదాఖ్యార్థధురీణవాగుపనిషత్సిద్ధాంతమార్గానుసా
రోదృత్పజ్ఞను బల్మఱుఁ మననసంయుక్తంబుగావించుచుఁ
హృద్యంబై యదియంతకంతకలరఁ నిల్పెం గడుం జిత్తమున్.

సీ. కనఁ దొద్ద నున్న వానిని వీరు వా రని
కనినఁ దదగ్రహావర్తనలు మఱచు
వినఁడు చెప్పినపల్కొ వేమఱుఁ జెప్పక
వినిన నే మే మంటి రనుచు నడుగుఁ
జనఁ డెత్తు లిడక మజ్జనముఖ్యవిధులకుఁ
జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు

కొనఁడు నానాసేవకులసేవ లెవ్వియుఁ
గొనిన వీడ్పాటుగాఁ బనులు పనుచు
తే. శుచిముఖీవాక్యదర్పణస్ఫురితనిరుప
మానదనుజేంద్రకన్యకామణిమనోజ్ఞ
రూపరేఖావిలాససంరూఢ మైన
యాత్మ మరలింపనేరక హరిసుతుండు. 103

ఉ. ఉద్యదపేక్ష పక్షివనితోక్తులవెంబడిఁ జంచరీక చం
ద్రాద్యుపమానశోభకు సహస్రగుణంబుగ హెచ్చఁ గేశవ
క్త్రాద్యఖిలాంగలక్ష్మి మదికందిన యంతయునుఁ గనయింపియా
హ్లాద్యతరాంగిమూర్తిసొబగెల్లనొకింతగఁ జూచునాత్మలోన్.

చ. మది గొనినంత మేరయును మాన కతం డుపమానకోటియొ
ప్పిద మఖిలంబు నిట్లు గడుఁ బెక్కుమడుంగులుగాఁ దలంచి
తత్తదవయవత్వసుస్థితికిఁ దార్పఁగ నమ్మదిరాక్షిరూప మె
య్యది యదియే కనంబడియె నచ్చపుబుద్ధికి లే వగమ్యముల్.

సీ. ఆరూపు మదిఁ జాల హత్తించు హత్తించి
యతివ యట్టిది గాక యనుచు మెచ్చు
మెచ్చి కన్గొను కోర్కి హెచ్చించు హెచ్చించి
యంతమే లెట్లబ్బు ననుచు వగచు
వగచి నిట్టూర్పులు నిగిడించు నిగిడించి
తదవలోకము లేని బ్రదుకు రోయు
రోసి దాని కుపాయ మాసించు నాసించి
కలఁక నేమియు దొరకమికిఁ గుందుఁ
తే. గుంది తలపోఁతలకు మదిఁ గొల్లవిడుచు
విడిచి దరిదాపు లేమిఁ బెన్వెతల మునుఁగు

మునికిఁ గి మొప్పఁడు పిలిచినఁ గినియు నిగుల
హారిసుతుండు ప్రభావతీవిరహాచకిత. 111

శా. ధీమంతుండు పటుప్రతాపనయమైత్రీనిత్యనమ్రాభవ
త్స్వామంతుండు సుకీర్తిమౌక్తికమణిస్రగ్భూషితాశావధూ
సీమంతుండు విపక్షమంత్రిముఖరాజీవప్రభోచ్చాటనా
హేమంతుండు నిజస్తవానుకలనాహ్రీమంతుఁ డత్యంతమున్.

క. అబ్జాంబావరుఁ డఖిలక
కుబ్జాంధవరమ్యకీర్తికుఁడు నలినీప
త్రాబ్బిందుసమప్రకృతి
క్షుబ్ధోధమయాత్మతత్త్వకోవిదుఁడు మహిన్. 113

తరల. కుముదబంధునిభుండు పింగళిగోకమంత్రి యశోగకథా
సముదనల్పసభుండు వైదికశాస్త్రసింధునిరంతర
ప్రమథనార్తశుభుండు సంతతభక్తియుక్తి సమర్చిత
ప్రమథలోకవిభుండు విత్తనిరంకుశప్రతిభుం డిలన్. 114

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళియమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతంబైన ప్రభావతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు

# ప్రభావతీప్రద్యుమ్నము

## తృతీయాశ్వాసము



మద్భక్తివిశేష
స్థేమావిశ్రాంతవిహితశివతత్త్వకథా
మీమాంసుఁడు పింగళియమ
రామాత్యవతంసుఁ డపరహంసుఁడు దీప్తిన్. 1

వ. హరికుమారుం డొక్కనాఁ డేకాంతవర్తియు హస్తవిన్యస్త గండస్థలుండు నగుచు నిట్లని తలపోయం దొడంగె. 2

చ. కలుగునొకో కనుంగవకుఁ గాంతఁ గనుంగొనుభాగ్య మెక్కడన్, గలిగెడుఁ దత్పురంబు చొరఁగల్మియ దొడ్డట చొచ్చి చూడఁగాఁ, గలిగిన నవ్విలాసవతిఁ గౌఁగిటఁ జేర్పక యోర్చు టెట్లు నా, తలఁపుబడిం దదాత్మయును దార్కొన కెట్లది సంఘటిల్లెడున్. 3

చ. శుచిముఖిమాట యొండరసిచూడఁగ నెంతయునాసపాటొన ర్చుచుమదిఁద్రిప్పుచున్న యది చూడ్కికినన్ను నెపోలువానినా రుచిరతరాంగిచిత్తరువురూపొకటిక్ రహిఁజూడఁ జెప్పెద ద్వచనముచొప్పునేమినియతంబుసమాకృతులెందుఁగల్గవే. 4

చ. ఇది పదిలంబుగా నడుగ కే నపు డక్కట కోర్కి దాఁచి వ ట్టిదొరతనంపునీటు ప్రకటించితిఁ బాపపులజ్జ నన్ను నో

రదిమె ననాదరంబు తెఱఁగై యది హంసికిఁ దోఁచెనే మొని
ల్వాద మఱి యించు కైన గలువ ల్చవిగానికథ ల్వచింతురే.

ఉ. ఏ నొకయించుకంత మనసిచ్చినమాటలు పల్కకుండఁగా
గాని మరాళి యద్దనుజకన్యకకైనను నొత్తి చూచి యే
మైన ననంగఁ బూను నని యాత్మకుఁ దోఁచుచునున్న దిప్డుకా
దేని ప్రసంగముండిగిచియేల నుతించుఁ దదీయరూపమున్.

మ. అటుగా కద్భుతరామణీయకగుణాఢ్యం బైనసద్వస్తువుల్
బటువాచారసికుల్ప్రసంగమయినన్ భావంబుముట్టన్ రసో
త్కటతం జెప్పక మానఁజాల రనుపక్షంబొందుభావించినన్
ఘటియిల్లు న్వనితాంగవర్ణనకు నిక్కంబ న్యభాసిద్ధియున్. 7

చ. హరియనువాసవుండుఁదమునంపిన కార్యముహంసితానయై
ధరణికి డిగ్గి చెప్ప మదుదగ్రమనస్థితిఁ గాంచు టెన్న నా
సురరిపుఁ జంప నన్ననుపుసుద్దులుపుట్టఁగఁ బోలు నెట్లెడన్
సరసిజనేత్రు దక్షిణభుజంబవు నీ వని పల్కినందునన్. 8

ఉ. అన్నియు నేకవాక్యముగ నారయ నాసలు పెంచుపక్షమే
యున్నది కొంతమించియిది యోజనసేయఁగ నాదురూపెయా
కన్నియచేతిచిత్రఫలకంబున నున్నది యెవ్వ రట్టిచో
నన్ను నెఱింగి వ్రాయననిన్ శివ వ్రాయుటవింటెఁజొప్పడన్.

సీ. శివ నన్నె వ్రాసియిచ్చినపక్షమునను లే
ఖననిమిత్తము వేఱకలుగు నొక్కొ
కలుగ దంతఃపురకన్య కిట్టిది భర్తృ
పరతఁ దక్క ఘటిల్లు టరుదు గాన
నది యట్లయైనను దదభీష్టయువపరీ
క్షామాత్రఫలకమై జాలు నొక్కొ

జాఱి దీశ్వరి యిచ్చె సత్కృప నని బాల
వేడ్కఁ జూచుటఁ జెప్ప వింటిఁ గాన

తే. నిట్టిగతిఁ జెల్వ కుమ పెద్దపెట్టు నొక్కొ-
పెట్ట వది దా సృజించినబిడ్డ గాన
బొం కగుచు నంత కిదియ త్రోపుడు నొక్కొ-
పడ దజుఁడు చెప్పె నని వినఁబడియెఁ గాన. 10

చ. మును తనసృష్టికామి నలుమోములవేలుపు చెప్పవింటి నే
ననుచు మరాళి పల్కనపు డక్కట యే నడుగంగ లేన యే
మని ననుఁ దిట్టుకొందు నజుఁ డట్టిప్రసంగపువేళ నవ్వరా
ననకు విభుం డితం డతఁ డనన్ వినఁబడ్డది యేమి గల్దెనో.

ఉ. వావిరి నవ్విలాసవతివార్తలపట్టున నెన్నియెన్ని ప్ర
శ్నావసరంబు లైన నొకయర్థము నే నడుగంగ లేమి ని
చ్ఛావిముఖుం డితం డని ప్రసంగము వచ్చిననూరకుండు నే
మో వరటాలలామ యిఁకముద్దియసన్నిధి నేమి సేయుదున్. 12

ఉ. పోవునొకో సరోజముఖిపొంతకు నిం కొకమాటు హంసి దా
నావలనం దదిష్టవచనం బొకటేని నొనిపోవఁ గానమిన్
బోవుట నిష్ఫలం బనుచుఁ బోకయె మానునొ కాక పోవునో
దైవతకార్యభారమును దద్వశ మైనది కొంత గల్గినన్. 13

క. తరుణికడ కంచ యేగతి
నరిగిన నాస గల దది మహామతి నాయం
తరగతిఁ గనదే వినదే
ధర 'నప్రతిషిద్ధ మనుమతం భవతి' యనన్. 14

క. ఏపనియు లేక యుండిన
నాపడఁతుకఁ జూడఁ జనక హంసి నిలువ నె

ట్లో పెడును దానిఁ జూచిన
జూపఱకును వశమె తిరుగఁ జూడక యుండన్. 15

క. అని భావనాబలంబున
మనమున ఘటిత మగుమగువ మధురాకృతి య
క్కునఁ జేర్పఁ గడఁగి త త్తఱ
మునఁ గానక వెగడుపడుచుఁ బొదలు విరాళిన్. 16

వ. ప్రొద్దు గడపుట తద్దయు భరం బగుడు నుద్యానంబునకుం
జనియె నప్పుడు. 17

సీ. నిబిడంపుజిగితోడ నిండుపూగుత్తులు
బిగువుపాలిండ్లయొప్పిదము నెరప
నునుఁగెంపు గ్రక్కునూతనపల్లవంబులు
కరతలంబులసోయగంబుఁ దెలుప
నెలమిఁ బర్వెడునట్టిరొలదీఁగియలసొంపు
సుకుమారబాహువిస్ఫురణ జరుపఁ
గడుఁ జేరెములువాలుగండుఁదుమ్మెదచాలు
కడకంటిచూపులబెడఁగు నడప

తే. విరుల తెలిడాలు చిఱునవ్వుసిరులఁ జిలుక
మధురసపునిగ్గు లావణ్యమహిమ గులుక
నతనిచూడ్కికిఁ జూడ నుద్యానభాగ
మంతయుఁ బ్రభావతీమయం బగుచుఁ దోఁచె. 18

ఆ. యువతిపై విరాళి యొక్కింత మఱతునో
యనుచు నాస నేఁగి యచట నతఁడు
మఱచెఁ దదితరంబు నెఱయంగ నిది సుమీ
యొకటి గోర వేఱ యొకటి యగుట. 19

వ. అతం డివ్విధంబునం బ్రభావతీవిభ్రమభ్రమవశంబున లత లతఁ దప్పకుండఁ గదియం జనుచు. 20

సీ. తరుణి కెంగేలంచుఁ దమిఁ బట్టి కటకటా
చిగురాకె యిది యంచుఁ జిన్నవోయి
వెలఁదిపాలిం డ్లంచు వెస నంటి చెల్లఁబో
పూగుత్తులే యంచుఁ బొలుపు దఱిగి
చెలువపయ్యెద యంచుఁ జేసాఁచి యయ్యో ప
రాగోదయమె యంచు రహి దొఱంగి
రమణి వేనలి యంచు రతికాంక్ష నొడసి హా
తేటిమొత్తమె యంచుఁ దెల్లఁబాఱి

తే. యకట యనిమిత్తకృపఁ దాన యరుగుదెంచి
హితవు నెరపెడిహంసితో హృదయ మిచ్చి
పలుకనికృతఘ్నునకు నాకుఁ బ్రాప్త మగునె
యట్టియువతిపొం దనుచుఁ దా నాత్మఁ గుందు. 21

వ. అంత నంతర్గతంబున. 22

తే. ఉవిద నాకుఁ బ్రాపించు టటుండ నిమ్ము
హంసి యిఁక నొకమఱి చూడ నబ్బునేని
నాదుకన్నులు కన్ను లెన్నంగ నేన
యగ్రగణ్యుండ ధన్యాత్ములందు నెల్ల. 23

ఆ. వచ్చునొకో సురారివార్త చెప్పఁగ దాను
వచ్చి కడలఁ బోక యిచ్చటికిని
దెచ్చునొకో ప్రభావతీక్షేమవృత్తాంత
మాత్ర మయిన నంచమగువ నాకు. 29

చ. వినుకలిచేతనే విరహవేదన నామది నింత వర్ధిలెఁ
గనుకలి నిట్లు చిత్రఫలకంబునఁ గాంచినయింతి నెమ్మనం
బునఁ గడు నింతకెంత పరిపూర్తివహించునొ యెంతనొచ్చునో
ఘనమనివింటిఁజిత్తరువుఁగన్గొనుప్రేమయు నేమిసేయుదున్. 25

ఆ. అందుమీఁద హంసి యరిగి నాతోడఁ దా
మాటలాడుటయును మద్విధంబుఁ
దెలుప నాస లేమి దలపోసి యెట్లొనో
చెలువ యకట యేమి సేయువాఁడ. 26

మత్త. అంచతొయ్యలి దేవతాపతియానచొప్పనరించి యే
తెంచు నెన్నఁడు దానిచేత మదీయవృత్తగతిఁ జెప్పి యేఁ
బంచు నెన్నఁడు గావున న్వెసఁ బత్రికన్ లిఖియించి యా
యంచ కిప్పుడు పంచెద న్సతి కంత దెల్పెడు నట్లుగాన్. 27

వ. అని తలంచి యాక్షణంబ శుచిముఖపేర లేఖ వ్రాసి యిది గొంపోవువా రెవ్వ రని నివ్వటిల్లెడుచింత నంతరంగంబు గలంగ నుద్యానమధ్యంబునకుం గ్రమ్మఱ నరుగుదెంచి యత్తఱి నుత్తరంబు చనువాని నెల్ల నుద్దేశించి తద్దయు దుర్దమం బైనవిహారికతన వార్తాహరయోగ్యాయోగ్య వివేకంబు లేక యిట్లనియె. 28

సీ. కృప నెఱింగింపరే కీరోత్తమములాల
వజ్రపురికిఁ బోవువారె మీరు
సదనుగ్రహమునఁ దుమ్మెదలార చెప్పరే
వజ్రపురికిఁ బోవువారె మీరు
కరుణతో వినిపింపఁ గదరె కోయిలలార
వజ్రపురికిఁ బోవువారె మీరు

తెలుపరే దయఁ జూచి మలయవాయువులార
వజ్రపురికిఁ బోవువారె మీరు

తే. చలువ లొసఁగెడు మేఘరాజంబులార
యమలపక్షత నొప్పు రాయంచలార
నిలిచి నామాటలకు మాఱు పలుకరయ్య
వజ్రపురికిఁ బోయెడువారె మీరు. 29

క. అని పలుకుచున్న సమయం
బున నొకశుక మభ్రమార్గమున నేఁగుచు నా
తనికీనాలాపంబులు
విని కారుణ్యమున నిలిచి విస్ఫుటఫణితిన్. 30

ఆ. ఏను వజ్రపురికి నేఁగెడువాన నా
వలనఁ గార్య మేమి కలదు నీకుఁ
దెలుపు మొకటిరెండుపలుకుల ముగియఁగా
ననుచుఁ బలుకుటయును యాదవుండు. 31

సీ. ఓపక్షివర విను మాపురి శుచిముఖి
యనుపేరి యొక రాజహంసి యుండు
నది యున్నచోటు నీ వరసి యీపత్రిక
యందింపవలయు మత్ప్రార్థనమున
నన విని యాచిల్క యట్ల చేసెద సహా
యంబు పోయెద మాట లాడ నాకు
లే దవకాశంబు లేశ మాత్రంబును
నాదుపక్షంబులనడుమ లేక

ఆ. యొరుల కెఱుకపడక యుండునట్లుగఁ గట్టు
మతిరయంబుతోడ ననుచు నతని

దండ కరిగి నిలిచెఁ దడయ కాతఁడు నట్లు
చేసె నదియుఁ జనియె శీఘ్రగతిని. 32

వ. అంతకు మున్ను శుచిముఖియును నుచితప్రకారంబున నట్లు తనబలఁగంబునుం దానును దానవాంతకపురకామినీసమీప సంచారపరిచయంబు సంపాదించుకొనుచుం గ్రమంబున బ్రభావతితోడి చెలిమిగలిగించుకొనుటకుండఁజే వేచియుండుఁ గావున నది గని పెట్టుకొని యుండ నొక్కనాఁ డక్కలకంఠి తోంటిసరసీపరిసరంబునం దమందకందర్పతాపశమనార్థంబుగ రాగవల్లరి యను నెచ్చెలియుం దానును వచ్చి వనవిహారంబు సలిపె నప్పుడు. 33

సీ. అతిమందస్మితద్యుతి ప్రసాదంబున
విపులపాండిమ యభివృద్ధిఁ గాంచె
సతికటాక్ష శ్రీలసాహాయ్యకమునఁ దు
మ్మెద పిండుచెలువ మభ్యుదయ మొందె
జలజాక్షికరతలచ్ఛవియను గ్రహమునఁ
జివురుఁగెంజాయ పుష్టిని వహించెఁ
దరుణినిశ్వాసగంధము ప్రోది మలయవా
యువుల నెత్తావివైభవము చెందె

తే. నవి లతాంగికిఁ దోడ్తోన యార్తిఁ బెనఁచెఁ
బాటిలదె రజోమాలిన్యపల్లవత్వ
చాపలంబుల కాధార మై పరఁగెడు
వారికిని మే లొనర్చినవారి కెగ్గు. 34

సీ. విరహార్తముతోడిమరునిబల్లెములన
నెల్లెడ విలసిల్లుపల్లవములుఁ

బాంథ మేదస్స్నేహభరితకామాస్త్రాళి
నా నొప్పుసరసప్రసూనములును
భావజుమిడివింటఁ బాలునీలపుగుండ్ల
భంగిఁ జరించుపుష్పంధయములుఁ
జేతోజబలసముద్ధూతధూళి యనంగ
రాజిల్లుసుమనగపరాగములును
తే. నసమసాయకజయబిరుదావళీప్ర
పాఠకవరవందిజనఘనార్భటి యనంగఁ
గడు విజృంభించుశుకపికకలకలమును
నెలఁతకును గుండెదిగులు జనింపఁ జేసె. 35

వ. ఇవ్విధంబున నయ్యింతి తంతన్యమానకంతుసంతాపయగుచు
రాగవల్లరిం జూచి యిట్లనియె. 36

మ. అకటా యిట్టిది ప్రొద్దు పుచ్చుట కుపాయంబే విరోధంబ
కాక కడుం జాలు వనాంతఖేలన మిఁకం గన్నార మత్ప్రాణ
నాయకురూపంబును జూచు చుండుటయె మే లామీఁద
భావ్యర్థ మంబిక యొక్క_ర్తె యెఱుంగుః దత్ఫలకముఁ
బింబోష్ఠి తేవే వెసన్. 37

వ. అని తెప్పించి యప్పలకయందు నాత్మసంకల్పవాసనావిశేష
వశంబున ననేకవిధశృంగారభావచేష్టావిశిష్టతంగనుపట్టునట్టి
లిఖితరూపయదుకులప్రదీపు నెమర నుండియుం గ్రేడించియు
నిర్నిమేష యయ్యు నిమీలితాక్షి యయ్యుం గొంతతడ
వనేకభావంబు లావహిల్లం జూచి చూచి. 38

చ. అనయముఁ దృష్టిగావలయునంచు నజస్రము నెంత చూచి
నఁ, గనుఁగవ కంతకంతకును గాటముగానొకవింతవింతయిం

పు నెరపు చున్ననుం దరలి పోవఁగ నీ దిఁక నోర్వఁజాల నే
ననుచు రసోద్ధతిం గదియ నక్కునఁ జేర్చె నిజేశురూపమున్.

తే. చేర్చి యొక్కింతతడవు నిశ్చేష్ట యగుచుఁ
జొక్కి కనుఁగవ యరమోడ్చి శోభనాంగి
యంతఁ జిత్రరూపత మదియందుఁ దోఁపఁ
గమ్మెఱఁగఁ బుచ్చి కనుఁగొంచుఁ గాంతు లడర. 40

ఉ. ఇట్టిమనోహరాంగుఁ డొకఁ డెందయినం గలఁడేని గల్గియుం
గట్టిగ నా కతండు బిగికౌఁగిటఁ జేర్పఁగ నబ్బునేని నే
నిట్టటు కొంచిన వ్రీడక యిష్టవిహారము లెల్లఁ గాంక్షఁ జే
పట్టి యొనర్చునేని రసభావము లెట్టివి యొక్కొ యత్తఱిన్.

క. అని యువ్విళ్లూరుచు మది
ననయముఁ దలపోయు నుస్సు రనుఁ గాంతాళిం
బునఁ బొరలు నిట్లు విరహాం
బున కోర్వక యవ్వధూటి బోటిం బలికెన్. 42

క. ఉమసేవ యేను సలిపెడు
సమయంబునఁ గర్తృకర్మసాధనవైగు
ణ్యము లేమి గలిగెనో యి
ట్లమితవ్యథఁ దెచ్చి పెట్టె నాయమ నాకున్. 43

క. ఇటు గాక లోకముల నిం
తటిచెలువుఁడు గలఁడె గలిగినను సుబ్బదే యి
చ్చట నచ్చటఁ గలఁ డని య
క్కట నన్నిట్లేచు టంబకరుణ తెఱంగే. 44

సీ. అని పల్కుపలుకు లాయవసరంబునఁ దత్స
మీపంబునం దనురూపగతిని

శుచిముఖి సంచరించుచు విని యుత్తరస్వి
చిత్తంబు వడసియేఁ జెలిమి కలిమి
వర్తించుకొనుటకు ననుగుణం బగువేళ
యిదియ యటంచు నూహించి మదిని
దగునుపాయంబు వితర్కించి యప్పుడు య
దృచ్ఛనపోలె నా తెఱవయెదుట
తే. నడ్డముగ నల్లనల్లన యరుగుచు సవి
మర్శదృష్టినిఁ బలుమఱు మరలి మరలి
చిత్రఫలకంబువంక వీక్షించెఁ గొంత
సరిగడచుదాఁక నొకవింతసరణి మీఱ. 45

క. అప్పు డమ్మరాళిచందం
బుపలక్షించుచుఁ గపోలయుగ్మము పరహా
సప్రఁగాంతిఁ దనరఁగా నా
చపలేక్షణ తనదుప్రాణసఖి కిట్లనియెన్. 46

క. కఱదులపులుఁ గిది తా నే
మెఱుఁగునొకో తిరిగితిరిగి యీఫలకముపైఁ
బఱపెడుఁ జూడ్కుల నా నా
మెఱుఁగుంబోడికి మరాళి మృదుమధురోక్తిన్. 47

వ. ఇట్లనియె నోపడంతీ నీ పలికినట్లు మాయట్టితిర్యగ్జంతువు లేమియు నెఱుంగమి యథార్థంబ యైనను నేను నీచేతి చిత్రఫలకం బబ్రపడి చూచుటకుం గారణంబు వినుము మున్నొక్కచోట నొక్కపురుషుం జూచి తత్సమానరూపుని మఱి యొందునుం గానక యిప్పు డిందు నతని కైవడి దోఁచిన నిది తదీయరూపం బెఱింగి వ్రాసినతెఱంగో యటు గాక యట్టి

వాఁడె వేఱొక్కఁ డెక్కడ నైనం గలిగెనో యని యించుక విమర్శించి వీక్షించితి నన విని ప్రభావతి యద్భుతప్రమోద సందేహంబులు డెందంబునం గ్రందుకొనుచుఁ గందళింప నప్పులుగుం దప్పక చూచి యి ట్లనియె. 48

శా. ఏమేమీ యిఁకనొక్క మాటు చెప్పుమా యీవున్న రూపిట్ల యో, యే మైనం గలదో విశేష మిట ర మ్మాక్షింపు మిం కన్ వచ, స్సామర్థ్యం బరయన్ మహాత్మ వని యస్మద్బుద్ధి కిం దోఁచె దా, హా మాభావము గానలేవె మదిలో హంసీ భయం బేటికిన్. 49

వ. అనిన నది మదిరాక్షి నీక్షించి యి ట్లనియె. 50

క. నీ వనినయట్ల యేను భ
యావహులను గానివారి నాకృతిన కనం
గా వలఁతి నైనఁ బిలువక
యే వెఱ్ఱిని చేర నిరువు రేకత మాడన్. 51

వ. అనిన వెఱఁగంది యాయిందుముఖి సఖియునుం దానును నొండొరులమొగంబులు చూచి నగుచుఁ జెవులకుం జవులు మివుల నలవరించు గులుకుమెలుంగు గలకలికిపలుకులకె వలచి మొలచుకుతుకంబున నతివశంవదహృదయ లై తమ కిద్దఱకుం దానిపెద్దబుద్ధులు సుద్దులు ముద్దు రప్పించుచుం దద్దయు నుద్దీపితరాగంబు లగుచుండ రాగవల్లరి యాగఱు వతనంబులాగు లేగరితలందును మున్ను కన్నవిన్నయవియె దీనికఱదు లెంతయరుదులు చూచితే యంచు నాయంచపై నాదరాహ్లాద మేదురనిరీక్షణంబుల నీక్షించి యోపక్షికుల భూషణంబ నీభాషణంబు నిక్కంబ మిక్కిలి నక్కఱపడి

వేఁడక ప్రోడ లగుగఱువ లిరువు రేకాంతమాడుచోట్రి
కేటికిఁ బోయెద రిది యట్లు గాదు గదా యే మొక్కసంది
యంబు నివర్తించుకోనం గోరి యిత్తఱి నత్యంత ప్రార్థనంబు
గావించు చున్నవారము గావున నీకన్నయప్పురుషుని
యొప్పు నిప్పలకపై వ్రాసినరూపంబుచొప్పు నొక్కటి
యగునో కాదో యీడండకు వచ్చి నిచ్చలంబుగాఁ జూచి
నిశ్చయించిచెప్పు మిప్పుడుచు నేను నిట్టివాఁ డెందును లేఁడు
కలఁడనువివాదంబునం బన్నిదంబు చఱచినవారము. 52

క. అనుటయుఁ బందెముకోఱకై
నను వేఁటోకపనికినైన నా కది తెలియం
బని గలదె మీకు నాచే
వినవలసినయర్థ మరసి వినిపింతుఁ దగన్. 53

తే. అనుచు శుచిముఖి తనమాట కాపడంతు
లీక్షితాన్యోన్యవదన లై యెంతదూర
మరుగుచున్నది దీనివాక్యాశయ మని
మివుల వెఱఁగందఁ గొంతచేరువకుఁ బోయి. 54

క. సవిమర్శదృష్టి నాటిత
కవిధాన మొకింత నడపి కడుఁ బదిలముగా
వివరింప నతనిరూపము
యవు నౌ నది యిందు సందియము లే దనియెన్. 55

చ. అనుటయు రాగవల్లరి మహత్తరమోదవిశేషసంభ్రమం,బునఁ
బఱతెంచి యప్పలుఁగుముద్దియఁదద్దయు ముద్దుగారవం,బును
జిగురొత్త నెత్తుకొనిపోయి ప్రభావతిదండఁ బెట్టి యొ,య్యన
నఁగొనగోళ్లఁద త్తనురుహాంబులు దువ్వుచుఁ గూర్మి నిట్లనున్.

ఉ. అంచవుగావు నీవునసునారసి ప్రోవఁగ మూర్తిమత్త్వముం
గాంచినభాగ్యదేవతవు గాని మదుక్తితెలుంగు నేఁడు గ
ల్పించితి వేజగంబునను లేఁ డిటువంటి మనోహరాంగకుం
డంచుఁ గలంచు నిజ్జలరుహాసన మానక నాదుచిత్తముల్.

వ. అనిన విని ప్రభావతి నిజవయస్యం జూచి. 58

తే. రాగవల్లరి నీ వేల వేగిరించె
దింతమాత్రంబ చాలునే యీప్సితార్థ
సిద్ధి కతనిలక్షణము లీచిత్రమూర్తి
యందు నేమైనఁ గల వేమొ యడుగవలయు. 59

వ. అనిన విని యాహంసి యాచిత్రరూపంబు నిరూపించి ప్రభా
వతి నుద్దేశించి యిట్లనియె. 60

ఉ. ఆరయ నింక నే మడిగె దల్లవె యాతఁడు శంబరుం ద్రిలో
కారిని ద్రుంచునప్పటిప్రహారకిణంబు లురంబునందు నా
హా రతికంకణాంకములు నల్లవిగో మెడయందు వీరశృం
గారకళాఢ్యు ని ట్లతని గట్టిగ నెవ్వ రెఱింగి వ్రాసిరో. 61

వ. ఈలక్షణకథనంబుచేత నతనినామజాత్యాదు లత్యంతప్రసి
ద్ధంబులు మీరు మీయంతనె యెఱింగెదరు గావలయు
నంతిపురవాసినులు గావున నెఱుంగరో యని యెఱింగిం
చెద నంటినేని. 62

చ. ఎనయఁగ నెవ్వ రెంత మన సిచ్చి వచించిరి తాను వారితోఁ
బసువడనంతమాత్రప్రతిభాషణమాడుటయుక్త మండ్రు మీ
కొనరఁగఁ బన్నిదంపు గెలుపోటలు దీర్పఁగ నిప్పు డేను జె
ప్పినదియచాలు నింకఁ దలపెట్టుటచెల్లద యెక్కుడేమియున్.

తే. నీవ కద ప్రభావతి యన నిన్ను మున్ను
తరుణి నే వింటి రాగవల్లరియె బోటి
పేరు నీ విపు డన వింటి మీ రిరువురు
నీ యెఱుక మఱచెదరు సూ పోయి వత్తు. 64

ఉత్సాహ. అనుచు గగనభాగమునకు నంచ యెగయ జూచినన్
దనుజకన్యకాలలామ తనదు రెండుచేతులన్
వినయ మొప్పఁ బోదుగఁ బట్టి వేనవేలుభంగులన్
దనరఁ బ్రియము జెప్పుచును ముదం బెలర్ప నిట్లనున్. 65

సీ. నిద్దంపుఁబండువెన్నెల గాయుఱెక్కల
యొప్పు చూడఁగ నొక్కయుత్సవంబు
మెఱుఁగుఁదీఁగెల బాగు మించుపసొంతహా
టకరేఖ లరయ నొండొక ప్రియంబుఁ
గమనీయ మగుమహాగమనగాంభీర్యాది
విలసనం బీక్షింప వేఱె యింపు
మాధుర్యధుర్యకోమలవచనామృతం
బనుభవింపఁగఁ గౌతుకాంతరంబుఁ

తే. గలుగఁ జేయుచు నువ్విళ్ళు గొలుపునీదు
సంగతి యొకింత గని యెట్లు జాఱవిడుతు
నింక రాగవల్లరి పేరు నీవు నిజము
ననఁగ నీతో నొనర్తు నెయ్యంపుఁజెలిమి. 66

ఆ. ప్రణయ మొప్ప మిగులఁ బ్రార్థించుచున్నట్టి
నన్ను ననుగ్రహించి నాదు చెలిమి
కోడఁబడంగవలయు నోహంసభామినీ
యనుచు వేడుకొనఁగ నంచ పలికె. 67

ఉ. ఇప్పుడు నీవు చెల్మికిని హేతువుగాఁగ గణించినట్టినా
యొప్పును గిప్పుఁ బా నెచట నుండు రహస్యవిచారవిఘ్నమా
కెప్పుడు నీకుఁ దోఁచె నపు డింతయు రోసెదు దీనిచేత మీ
యిప్పటిమంతనంపుఁబనియేమఱ కంపుఁడు పోయి వచ్చెదన్.

వ. అనిన విని రాగవల్లరి హంసీమతల్లికం జూచి యిట్లనియె. 69

క. పోయెదఁ బోయెద నంచి
ట్లోయంచలతల్లి యేల యుద్దాడింపన్
మాయేకాంతపుఁబనికిని
నీయునికి విరోధి గాదు నిర్వాహకముల్. 70

వ. ఇదే నిమిత్తంబుగా సఖ్యంబు గావలయు నని ప్రార్థించెదము గాని కేవలంబైన లావకరామణీయకంబున కాదు నీదు పలుకుం దెఱపులు పరికింప నిది నీవును దెలియుట విస్పష్టంబ యైనను శుద్ధాంతస్థితిదోషంబునం జేసి యే మయి యీ మాట మాటు పెట్టక గొబ్బునం జెప్ప నేరకున్నవారము చెప్పి వేఁడికొనక యేపనికిని నీవు చోరమి మొదలన పదిలంబుగాఁ దెలిపినవానవు గావున. 71

ఉ. వట్టిమఱుంగుఁ బెట్టి నుడువం బని లే దది యెల్ల ఖేరి జో
కొట్టుట కాక నీ నెలువఁ గూడునె మాటల నీవు గంటి న
న్నట్టిశుభాంగుఁ డీరమణియాసల కాస్పద మిప్పు డాతని
నట్టిగ నన్వయాదికథనంబునఁ దెల్పి యనుగ్రహింపవే. 72

తే. ఇప్పు డిది చెప్ప కెడ సేయు టీలతాంగి
ప్రాణసంకటపఱుచు టోపక్షిరమణి
కావునను గావవలయు శీఘ్రింబ చెప్పి
వెనుక నెఱిఁగింతు నీకు మావృత్త మెల్ల. 73

వ. అనిన శుచిముఖి వచనవక్రత చాలించి యి ట్లనియె. 74

ఉ. అంతిపురంబుకన్యలఁట యాత్మ దెలం గభిధాప్రయుక్తి నొ
క్కింతయు నేర్పరింపరఁట యి ట్లన ని ట్లని నాకు నాకె య
ర్థాంతరము ల్గడించుకొని యంజకయెట్లు యువ స్తుతు ల్ప్రపం
చింతునటందు నుంటి నిఁకఁ జెప్పెద మీరలు గుట్టు దెల్పుటన్.

వ. అని పలికి ప్రభావతిం జూచి నీకు మనోహారి యైనయాపురుష
రత్నంబు దెలంగు విను మని యి ట్లనియె. 76

క. భారతవర్షమునందున్
ద్వారక యనుపురము గలదు తద్వర్ణన వా
ణీరమణున కైనను దు
ష్పార మపారము సమస్తసౌభాగ్యములన్. 77

ఆ. ఏను దానిమహిమ నానేర్చినంత వ
ర్ణింతుఁ గొంత యని తలంతునేని
నీవు ప్రకృతయువకథావిలంబమునకు
నోర్వ వేమొ యది యటుండనిమ్ము. 78

క. నావిని నీకిది చెప్పం
గా వలయునె యెందు మిగులఁ గతరాజవు నీ
వావరటారత్నమ యని
యావనితలు నవ్వ నవ్విహాగి యి ట్లనియెన్. 79

ఉ. ఆనగరంబునన్ యదుకులాభరణం బగుమర్త్యజన్మమున్
బూనినసర్వభద్రపరిపూర్ణుఁడు కేశవుఁ డుండు నాథుఁడై
యానలినాక్షు షోడశసహస్రవధూప్రియు మిక్కిలి న్గుణ
శ్రీనలరించి యష్టమహిషీజను లెంతయు మింతు రున్నతిన్.

ఆ. అందు నగ్రగణ్య యై యొప్పు రుక్మిణీ
నామధేయ యొకతె యామగువకుఁ
బట్టి యొకఁడు గలఁడు ప్రద్యుమ్న నాముఁ డా
యనఘురూప యిది సుధాంశువదన. 81

ఉ. శౌర్యము నుండఁ దండు భుజసత్త్వనిధానము కాంతిరాశి గాం
భీర్యపుఁబ్రోక సత్కళల పెన్నని రూపము దాల్చినట్టి యౌ
దార్యము పెక్కు లేటికి నుదాత్తగుణోదయ మా య
పూర్వసాంద్రత కెంత యెంత యుచితం బగు నంతయుఁ
గల్గి శోభిలుఁ. 82

వ. అని చెప్పిన. 83

శా. సంతోషం బపు డాత్మఁ బిక్కటిలుచుఁ సర్వాంకషంబై శౌరి
రాంతర్భాగముఁ బట్టఁ జాలక నిలింపారాతిరాట్కన్య క
త్యంతంబు న్వికసిల్లఁ జేసె ముఖపద్మంబు న్దరీపాళికిఁ ద
త్కాంతాకర్ష మొనర్చునట్టియపరిహార్యాయత్నముస్మిలుచుఁ.

మ. ప్రమదం బొప్పఁగ రాగవల్లరియు నాపద్మాననం జూచి చి
త్రము నీకిచ్చిన దేవివాక్యమునకుఁ దార్కాణగా నామజ
న్మములున్నింటికిగదమ్మ తత్పతియుఁ సంసిద్ధియయ్యెంగదా
కమనీయం బగునీమరాళిక్రృప నింకన్నాను మాందోళముఁ.

వ. ఇమ్మరాళబాలిక యాలాపచాతుర్యంబు చూడఁ గడమకా
ర్యంబును సాధించిపెట్టునట్టి దిట్టతనంబు గానిపించుచున్నది
మొదలనుండియు సకలకళల సడిసన్నఁ జదురుల ప్రోదిఁ
బెరిఁగినది గాఁబోలుఁ గాలిపెండెరంబు నొక్కటి గలిగి
యున్నది యని తదక్షరంబు లీక్షించి చదువుకొని యాబిరు
దంబునకు నరుదుపడి యాహంసివలనం దజ్జన్మనామవిద్యా

ఖ్యాపాదులు విని మనంబునం గడు ముదం బందుచుం బ్రభావతిం జూచి యోచెలువ మనకొదవ లన్నియుం దీర్పుటకు శరణం బింక నిదియకాని వే ఱొండు గాన మని పలికి యాపుష్పులుఁగుఁజెలువకుం దనచెలికత్తె కలతెఱంగు సకలంబునుం జెప్పి తదాదిగా నప్పటిదుదకు ముదితకొదవ వినమదనావస్థ లెల్ల సవిస్తరంబుగా వినిపించి యింతకుం దెల్లంబుగ నీపల్లవాధరయాకారంబు పరికించి చూడు మని యి ట్లనియె. 86

సీ. నెలఁతముక్కరయందు నీలంబు గాదు సూ
తెలిదళుకొత్తుము త్తియము గాని
యువిదసందిళ్ల బాహుపురులు గావు సూ
మితి చూడ నిడినయూర్మికలు గాని
సుదతిపాలిండ్లఁ గస్తురిసల్పు గాదు సూ
కనుదోయికాటుకకప్పు గాని
రమణికర్ణికల వజ్రపుదీప్తి గాదు సూ
ప్రాఁగెంపుఁదునుకలరంగు గాని
తే. యూర్పువేఁడిమిఁ గృశత బాష్పోదయమున
గండపాండిమఁ దత్తప్రకారములను
గానఁబడియెడు నోవిహంగమపురంధ్రి
యింక నీచేత నున్న దీయింతిబ్రదుకు. 87

చ. అరయఁగఁ దల్లి కక్కచెలియండ్రకుఁ దక్కను గల్గినట్టిచు
ట్టరికమువారికి న్నెరయఁ డాఁచు రహస్యము లీనిజాంతర
స్మరవికృతిప్రవర్తనలమాటలు వీని వినంగ నాప్తలై
పరఁగెడునెచ్చెలుల్ చెలికిఁ బ్రాణము లిచ్చిన నప్పు దీఱునే.

సీ. కావున నోహంసి నీ వెఱుంగనిసఖి
ధర్మంబు లేదు విద్వజ్జనంబు
సఖ్యంబు నెంచును సాప్తపదీనంబు
గాఁగ నట్లౌట వేగంబ యరిగి
యదుకుమారకునకు హృదయంగమముగ నీ
యతివసౌందర్యాదు లభినుతించి
యేతన్మనోరథం బీడేర్పవలయు నీ
వని పల్కుటయును నాహంసరమణి

తే. యతనియొద్ద నీయంగనయంగకముల
చక్కఁదన మెల్ల నొక్క ప్రసంగవశత
నేను మున్న వర్ణించినదానఁ దత్ప్రి
సంగ మెయ్యది యంటేని సకియ వినుము. 89

ఉ. ఏ నిట మున్ను నివ్వనరుహేక్షణఁ గన్గొని చన్నదాననై
యానరవర్యుఁ గాంచి యరుదైనతదాకృతిశోభ కెన్న జో
డైనది యావిలాసవతియాకృతిచెల్వము కావునం దలం
పైన వచింపఁగా వలసె నాతనియొద్దఁ బ్రసక్తివెంబడిన్. 90

క. వచియించిన నోఁ గా దను
వచనం బప్పు డేమియు నుడువకయుండె నతం
డచలస్థితి నాకును నది
య చాలు నప్పటికి నేతదర్థ మెఱుఁగమిన్. 91

క. అన విని మనసు చివుక్కుర
మనఁగఁ బ్రభావతి వివర్ణ మగువదనముతోఁ
గనుపట్టుడు నింతనె ముగి
సెనె కార్యం బేల యింత చింతిల ననుచున్. 92

వ. అద్దనుజరాజకన్యక నూరార్చి హంసి యి ట్లనియె. 93

మ. అతివా ని న్వినిపించువేళఁ బ్రతివాక్యం బేమియు న్లేమిఁ ద
ద్రతికాంతుఁ డెవఁ డెత్తెఁబంపుమని పంతంబాడుకోరాదుగా
ని తగం దెచ్చెద నిశ్చలం బయినపూన్కి న్సిద్ధగంధర్వదై
వతదైత్యాదికులంబులం దొకని నెవ్వాని న్మదిం గోరినన్. 94

తే. తాను జెప్పినవానిని మాని యితర
పురుషు నేఁ గోర నుమచి త్తమునకు రాదొ
యనవలదు భ క్తపరతంత్ర కాభవాని
కరయ భవదిష్ట మెయ్యది యదియ ప్రియము. 95

వ. కావున సందిగ్ధఫలం బయిన ప్రద్యుమ్నవాంఛ విడిచి దేవ
దైత్యసిద్ధవిద్యాధర గంధర్వాదులందు నెవ్వాఁడు గా
వలయు నన్న నతని నతనుపావకప్రజ్వలనధాయ్యాయమంత్రా
యమానం బయినతావకీనసౌందర్యసంపత్సహప్రతమభాగ
కథనమాత్రంబున నపాస్తధైర్యుం జేసి తెచ్చి నీకుఁ గింక
రుంగావించెద నీవించుకయు నీరామణీయకమహిమ యెఱుం
గవు గాన యిది విన్న మదనవశంవదహృదయుండు గాని
వాఁడునుం గలండె యదుకుమారుం డొక్కరుండ యనుప
మేయరూపలావణ్యగర్వంబునం గన్ను గాన కున్నవాఁడు
గావలయు నతం డట్ల యుండనిమ్ము తత్సమాను లన రాదు
గాని నానాభువనసంచారిణి నైననాకు నక్కడక్కడమిక్కిలిం
జక్కని కొమరుఁబ్రాయంపుఁ గొమరు లెంద ఱెంద
ఱైనం గనంబడుదురు వారల నందఱ లిఖించి తేవలసి
వచ్చినం దెచ్చెద నిచ్చకు మెచ్చువచ్చినవాని వరియింపు

మనిన నమ్మాటలు పెడచెవులం బెట్టి యొక్కింతతడవు
చింతించి కటకటం బడుచుఁ బ్రభావతి యిట్లనియె. 96

మ. చిరకాలంబునఁబట్టి యేనుమదిఁ గాంక్షింపం బ్రియోదంతమి
ట్లరుదార న్వినిపించి ప్రాణసఖివై హంసీ తుదన్ యుక్తమే
విరసంబై నవచగ ప్రపంచనముచే వేపంగ నిండాఁక నీ
సరసత్వంబునఁ బ్రౌఢవంచు మదిలోఁ జాలంగ నేనమ్మితిన్. 97

తే. వజ్రనాభుండు మును స్వయంవరపువిధికి
నను నియోగించి దేవగంధర్వసిద్ధ
యక్షవిద్యాధరాదుల నసురవరుల
విశదముగ వ్రాసి చూపించె వేలువేల. 98

క. వారలలో నెవ్వానిం
గోరెడునందాఁక లేదు కోలుపఁ యుల్లం
బారసి చూడఁగ నైనను
బ్రారబ్ధం బెట్టు లున్నయదియొ యెఱుంగన్. 99

చ. జనకుఁడు నప్పు డీసకలసద్గుణపూర్ణుని వ్రాసి చూప నా
కనుపఁడు వ్రాయునంతటిసమర్థులు లేమినొ తా నెఱుంగఁడో
మనుజుఁడటంచుఁ గైకొనఁడొ మత్కులవైరితనూజుఁడంచు
మ్యానెనొ యెఱుగన్ సుకారికులనిర్మథనుం డని విందుఁ
గేశవున్. 100

చ. అది తలపోసి కుందఁ దగునా యదునందనునందు నున్న నా
మది తెలియంగన్ జగజ్జననిమాటలుఁ జెప్పఁగ వించు శంకచే
నెదు పురుషాంతరానుమతి చేకుఱునో యని నీకు నింకనా
హృదయములోఁతు గానఁబడ దే నెఱిఁగింతుఁ బ్రతిజ్ఞ యొం
డిఁకన్. 101

క. విను ప్రద్యుమ్నునిఁ దక్కఁగ
మనమున నే నొరు వరించుమాట విడువు మా
ఘనుఁ డొల్ల కున్నఁ జెందుదు
మనసిజశిఖిఁ దనువు ద్రేల్చి మఱుసటిమేనన్. 102

ఉ. ఈతుదిపక్షమే మదికి నిప్పుడు నిశ్చిత మెట్లటన్న ము
న్నాతఁడు వించు నాకథల కట్టిటు పల్కమి కాక తద్గళ
ద్యోతితకంకణాంక యగుతొయ్యలి నొక్కతె గల్గఁజెప్పి తీ
వేతప మాచరించెనొకొ యిందుల కారతి ప్రాగ్భవంబునన్.

వ. అని తదీయం బయినసతీవాల్లభ్యంబునకు ముచ్చటపడుచు
నొక్కింత తలపోసి. 104

సీ. ఆరతికిఁ గరంబు లైతిరే నివ్విభుఁ
గౌఁగిలింపఁగ నబ్బఁ గరములార
యాయింతికిఁ గుచంబు లైతిరే నతనివ
క్షోనిపీడన మబ్బఁ గుచములార
యాలతాంగికి జెక్కు లైతిరే వారమ్య
శీలుచుంబన మబ్బఁ జెక్కులార
యానెలంతకు వీను లైతిరే నాకళా
విదుమంతనము లబ్బ వీనులార

తే. యట్లుగా నోఁచ కేల నాకైతి రకట
యని నిజావయవంబుల కాత్మ నగచు
బాల్యమునఁ దన్ను రమణ సౌభాగ్యకలిత
యనినసాముద్రికులమాట లరసి తిట్టు. 105

వ. ఇవ్విధంబునం బెద్దయుం బ్రొద్దు విరహవేదనాదోధూయ మానమానస యగుచు నుండి యంతట శుచిముఖిం జూచి యి ట్లనియె. 106

సీ. ఓహంసి నిన్ను నే నొక్కటి తుదమాట
యడిగెద నీహృదయంబునందుఁ
గలయట్లు చెప్పుమీ కల్ల లాడిన నీకు
నాతోడు సుమ్ము ప్రాణసఖి వీవు
తడయక ప్రద్యుమ్నుకడ కింక నొకమాఱు
పోయి దుస్తర మైననాయవస్థ
చెప్పి చేరికఁ గొంత చేయ వచ్చునో రాదో
యీదురాశాపాశ మెందుఁ దెగని

తే. బంధ మై ప్రాణముల వెలువడఁగ నీక
యాఁగి పెంచెడు మదనాగ్ని నహరహంబు
నీవు చని యవ్వుగాములు నిశ్చయించి
యాశఁ దెగఁగోయు మదియ మత్ప్రాణరక్ష. 107

వ. అనుటయు నాతరుణికిం గల హరితనయవరణానురాగం బెవ్వారికి నవారణీయం బనియును నింక నియ్యాస చెడ కుండ నిర్వహింపక తడసినం గడు నెడరు వాటిల్లఁ కార్యంబు దప్పు ననియును నిశ్చయించి యంచ యి ట్లనియె. 108

చ. మదితమిఁజూడఁ గొన్ని వెడమాటలు పల్కితి నీవు నమ్ము మే నిదె భవదీశుఁ దెత్తు నపుడేమి పరాకున మాఱు పల్కెడో సుదతి యెఱుంగఁగాని యిఁకఁ జూడుము తావకరూపవైభ వాభ్యుదయము విన్కలిక ప్రియముపూని యతండు విరాలిఁ గుందెడున్. 109

వ. దీనికి నిమిత్తంబును దైవనియమంబు గల దది విను మెఱిం
గించెద. 110

తే. బ్రహ్మకును సరస్వతికిని బ్రణయకలహ
మయ్యె మును పొక్కనాఁ డపు డబ్జభవుఁడు
తద్విరహపీడ సైరింపఁ దరము గాక
వాణిఁ దేర్పఁదదాప్తు లెవ్వారొ యనుచు. 111

క. ఆరసి ననుఁ బిలిపించెను
శారదకడ నప్పు డేను సరసక్రీడా
చారసచివత్వమున సం
చారముఁ గావించు చునికిఁ జంద్రనిభాస్యా. 112

వ. అట్లు పిలిపించి నన్నుం దనపాలఁతిపాలయలుకం దీర్పుటకుఁ
బనుపుచుండి యద్దేవి నుద్దేశించి. 113

సీ. నీసుప్రసాదసన్నిధిమహత్త్వమ సుమీ
నిగమరాశి ముఖస్థ మగుట నాకు
నీవిలాసమచర్చికావిశేషమ సుమీ
సంగీతసాహిత్యసౌరభంబు
నీకటాక్షశ్రీవిపాకభేదమ సుమీ
వేణువీణాదులరాణ లెల్ల
నీ వనుగ్రహలీలఁ గావించుటన సుమీ
యఖిలలోక వ్యవహారసిద్ధి

తే. కావున నొకింత యోవాణి నీ వలిగిన
నొకవినోదంబు నొదవ దే నోర్చు టెట్లు
విరహ మేకాంతదాస్యకింకరునియందుఁ
గరుణ లే కింతతడ వలుగంగఁ దగునె. 114

క. అని యేఁ దనుఁ గడుఁ దూఱితి
నని మత్ప్రియకడకు నేఁగి హాంసి పలుకుమీ
యనుచు నపు డంతకంతకుఁ
దనరు మనోజార్తిఁ గరఁగుఁ దప్తం డగుచున్. 115

తే. ఏలరా మన్మథుండ నన్ను నింత యేచు
టేమి మేలు గానున్నవి యిట్టిపాట్లు
నీకు నిఁకఁ బ్రభావతి యనునెలంతపై వి
రాళి కారణముగ వేగిరంబు వలదు. 116

క. నావిని యేను రతిప్రియు
భావము నట్లపహరించుపాటివి యైన
న్నీ వనిన వనిత యెక్కుడె
లావణ్యాదులను రతివిలాసిని కనుడున్. 117

క. రతిరూప మెక్కుడ ప్రభా
వతిరూ పెక్కుడ విమర్శవంతులు దెలియన్
రతిసొబగుకంటెను ప్రభా
వతిపస ముమ్మడి నలుమడి వాసి మరాళీ. 118

వ. ఆ ప్రభావతిరూపంబును మదీయస్పృష్టియం దతిదుర్లభం బది పార్వతీవరప్రసాదజనిత యై పొలుపొందు నని పలికి నిజాంగనారోపంబుఁ దీర్చుటకు సత్వరంబుగాఁ బనిచిన నే నతని కాలవిలంబనాసహిష్ణుతంబు దెలిసినదాననై యప్పు డేమియు నడుగ వెఱచి యరిగితి నటేయుఁ గ్రమక్రమంబున నట్టి ప్రభావతివి నీవ యని నిశ్చయించితిం గావున నీవల్లభుండు భవదాయల్లకభరంబునం బరితప్తుం డగుచు నిన్ను వరియించుటకు నీకంటెను వేగిరించు నని తోఁచుచున్నయది రతీ

విలాసంబును దదంతరాయంబు సేయం జాలదు నీవు సకల సంశయంబులు నుడిగి సుఖం బుండు మనిన విని యద్దను జేంద్రనందన తనడెందంబున సందియంబు నొందుచు రాగ వల్లరి మొగంబు చూచుటయు నది తదభిప్రాయం బెఱింగి హంసి కి ట్లనియె. 119

తే. ఏమిటికి హితవుగఁ జెప్పి యెందు నదికి
తచ్చెరువు నీదుమాట లోయంగరిత
కాముఁడు ప్రభావతీకాంక్షఁ గలఁగనేని
మనచెలియ కిష్టుఁడు విరాళి గొనుట యెట్లు ? 110

మ. అనినన్నవ్వి మరాళి యిట్లనియెఁ జెల్వా కాముఁ డన్వాని మీ
రను విన్నారు గదమ్మ యాసకలసద్రూపోపమానత్వశో
భనకీర్తిప్రథితుండు తొల్లిటిసురూపశ్రీఁ గడు న్మించుచె
న్నొనరంబుట్టినవాఁడు రుక్మిణికిఁ బ్రద్యుమ్నుండనంబుత్త్రుఁడై. 

క. అని నిజశంకల కన్నిటి
కిని బరిహారములు చెప్పి కెంటక యుండన్
దనమాస నిలుప దితిసుత
తనయ రమణుఁ గలయ మిగులఁ దమకించుమదిన్. 122

వ. హంసిం జూచి. 123

సీ. నీచెప్పినట్ల యున్నియునైన మొదలఁ ద
త్పుర మెంత దవ్వొ నీపోవు టెపుడు
పోయి వేళ యెఱింగి పొసఁగ నవ్విభున కీ
దృశ మైననాకోర్కిఁ దెలుపు టెపుడు
తెలిపిన నేవిఘ్నములకు లోఁబడక నా
పై నతఁ డనుకంపఁ బూను టెపుడు

పూని తా నచటికిఁ రా నొక్కనెపమున
 గురునాజ్ఞ దొరకించుకొనుట యెపుడు
తే. నట్టి వెనుమచ్చరపురాళి వజ్రనాభుఁ
 డస్మదిచ్ఛకు ననుకూలుఁ డగుట యెపుడు
 విరహవారిధి నేఁ గడవెళ్లు టెపుడు
 వలవనిదురాశలను గుమారిలుటె కాక. 124

క. అని తాల్మి వదల విడుచుచు
 ఘనముగఁ బ్రజ్వరిలుదర్పకజ్వాలనముచే
 ననయము శోషిలి చెలి లో
 చనముల వెడలించె మోవిసరసత యెల్లన్. 125

క. అట్టియెడఁ గట్టెదుర నొక
 చెట్టున నురిఁ దగులువడినచిలుక వెఱపుతో
 ని ట్టటు ఱెక్కలు తటతటఁ
 గొట్టుకొనుచు నెగయఁ బెనఁగఁ గోమలి కనియెన్. 126

క. కని ఘనసంభ్రమమున ది
 గ్గున లేచి దయాకులం బగుమనోవృత్తిన్
 దనతోఁ జెలియున్ హంసియుఁ
 జను దేరఁగఁ దానిఁ జేరఁ జనిగొ రయమునన్. 127

క. చని చిలుకఁ గదల కుండఁగ
 ననువునఁ దాఁ బొదుగఁ బట్టి యంఘ్రియురి వద
 ల్చిన నది రయమున నభ్యా
 మిని కే ల్విడిపించుకొనుచు మింటికి నెగసెన్. 128

వ. అప్పుడు. 129

మ. శుకపక్షంబులలోననుండి తదతిక్షోభంబునం జాఱె ప
త్త్రిక వడ్డన్ వెఱఁగందెయిట్టులను దైతేయాధిపాంతఃపురం
బకటా చోద్యము చూచితే యిదికడున్హంసీవిచార్యంబుకొం
కక యిం దెవ్వరి కెవ్వ రంపిరొకొ చిల్కం బట్టి తే నోపుదే.

తే. అని ప్రభావతి పల్కిన హంసి యపుడ
కూడఁ జని పట్టి తెత్తుఁ జిక్కుపడ కెంత
దవ్వు పాఱెడు ననుచుఁ బంతమునఁ బఱచె
శీఘ్రగతి నింత నంత నాచిలుకఁ దగిలి. 131

ఉ. అంతఁ బ్రభావతీసతి వయస్యఁ గనుంగొని యింతి చూచితే
యెంతటిచోద్యముల్ మొదల నిక్కడని ట్లురు లెవ్వరొడ్డిరో
వింత యటన్న నీచెవికి వేడిగఁ బల్కుపికాళిఁ బట్టి శి
క్షింతునటంచు నేఁ గడఁగి చేసినతప్పిది యొప్పునో ర్వఁగన్.

క. చిత్రము మిక్కిలి నిపుడీ
పత్త్రిక చందంబ యోప్రభాతాబ్జలస
న్నేత్ర యది చూడ మనుచున్
బత్త్రిక పుచ్చుకొని విచ్చి భాసురఫణితిన్. 133

సీ. "శ్రీమత్సరస్వతీశ్యామాకృపాసంప్ర
యుక్తోపమాతిశయోక్తికామ
ధేనుసద్బిరుదాంకదివ్యమంజీరసం
శోభితపాదకు శుచిముఖికిని
బ్రద్యుమ్నుఁ డూర్జితప్రణయపూర్వకముగా
ననిపినయట్టిరహస్యలేఖ
ప్రప్రభాభా వతిఁ బలుదెఱంగుల నీవు
వచియింప" నని చదువుచునె యుబ్బి

తే. సంతసము నాఁడు జాలక చంక వైచు
కొనుచు నొకదాఁటుగొని నిన్నుఁ గూర్చి కాంతుఁ
డనిపినట్టిపత్రికయె కదమ్మ భాగ్య
వతివి నీ వని చెలి ప్రభావతిని బల్కె. 134

చ. పలికిన నట్లు గాదు సుమ్ము దిరేసు పత్రికలో నడకించెదో ననుఁ
జెలియిటుచూపుమాయనుచుఁజేరఁగఁ బోవుచుఁ జేయిసాఁచె
న్యాయలినిభవేణి తత్పత్రమును వట్టిటుపాఱుచు దేవునాన
రేఁ, గలయదియంతయుం జదువఁగా విను చూచెదు కాని
నావుడున్. 135

ఉ. ఆవిధిఁ దప్పకున్నఁ జెలియా ననుఁ జేకొను టెట్లు ప్రప్రభా
భావతి నాఁగ నెవ్వతయొ పత్రిక యింకను లెస్సచూడు నా
కీ వల దన్న నెట్లెలు గవే భవదాఖ్యయె కాదె యిట్లుగా
నోవనజాక్షి వర్ణపునరుక్తిగ వ్రాసినవాఁడు భ్రాంతిచేన్. 136

వ. అనుటయు. 137

క. ఎట్టటు కాని మ్మది యిఁక
నట్టిటుపాఱక కప్పగాక్షి యవలఁ జదువు మే
నిట్టే యుండెద నావుడు
గట్టిగ నట్టేని వినుము కడమ చదివెదన్. 138

వ. అని ప్రథమశ్రుతాంతంబు నందుకొని యిట్లని చదువం
దొడంగె. 139

సీ. "ప్రప్రభాభావతిఁ బలుదెఱంగుల నీవు
వచియింప నపుడు నిర్వచనవృత్తి
నే నున్కి కల్లగు ట్టెంతియె కాని యా
యింతియంగము లెవ్వి యెట్లు చెప్పి

తవి యెల్ల నట్ల నాయాత్మఁ దద్దయుఁ బడి
యచ్చున నద్దిన ట్లమర నంటి
మలిచినగతిని మిక్కిలి దృఢత్వముఁ జెంది
స్వగుణసంపద్గౌరవమున నేమొ

తే. యూఁది బడలించుచున్నవి యోమరాలి
యధరసుధఁ దేర్చుమని వేఁడు మాన్మృగాక్షి"
నని చదువునంత గొబ్బునఁ జని సురారి
పుత్త్రి సఖచేతిపత్త్రికఁ బుచ్చుకొనియె. 140

ఉత్సాహ. పుచ్చుకొనుడుఁ బెనఁగఁబోక బోటి చేయి వదలిపో
నిచ్చి నాకుఁ జదువఁ దగద యింతనుండి మిక్కిలిన్
బచ్చిగాఁగ వలపు తేటపఱచి వ్రాసినాఁడొ నీ
యిచ్చఁ జదువుకొనుము వెనుక నిపుడు దాఁచి నావుడున్.

వ. ప్రభావతి భావంబునం గోపలజ్జాలోల యగుచు లేఖ నలిపి
వేయం బోయిన రాగవల్లరి పెక్కాన లిడుచుం బడుచుఁ
దనంబును మనంబున నింతఘనంబుగాఁ బూనియున్న దానవే
దానవేశ్వరతనూజా నీయోజ మేలు మేలు చాలుం బది
వేలు వచ్చె నా చేతికిఁ దెమ్ము తేవేనిం బదిలంబుగాఁ
బొదివి దాఁచుము మొదల నీయాకునకు నీకుం బని యేమి
యామహామహుండు శుచిముఖిపేరం బుత్తెంచినాఁ డింతియ
యాశకుంతకాంత చూచుకొనకుండ మనలో మనమె
యడంచిన నదియె ట్లుండు మనము దానితోడం జేసిన
ప్రాణసఖ్యం బెట్టిది యగు గట్టిగ నింతవట్టు నీవ భావించి
కొను మదియునుంగాక నీపోకడమాలినతనం బేమి చెప్ప
వల్లభుండు వాల్లభ్యంబు వెలిపి యనిపిన పత్త్రిక భాగ్య

పతులు కులదేవతంబలెఁ బూజించి దాఁచుకొనుట యొప్పుఁ గాక యిట్టట్టు సేయుటకంటె నమంగళంబు గలదే యని యుదరవైచియు బుజ్జగించియు బోధించియు వారించెనంచయు నించుకదవ్వునన చిలుకం గూడ ముట్టి పదంబులం బొదిగి పట్టిన నది యిట్టు నట్టుం బెనంగుచుఁ గీచు కీచు మని యఱచుచుం జనంబులు గఱచుచు రాక చీకాకు పఱచిన రేసి యోసి గడుసుంబులుంగ యెలింగించి చావక వేవేగ నావెంట రమ్ము తెక్కలలో దాఁచుకొని యెక్కడెక్కడి లేఖ లెక్కడికి నడపుచున్నదానవు రక్కసులతేని యాఁడు బిడ్డ నిన్నుం బట్టి తెచ్చునందాఁక నదె కదల కున్నది యనిన నది యి ట్లనియె. 142

క. చంపినఁ జంపుము న న్నటు
గొంపోకుండినను జాలు కొసర కదయతఁ
జంపిన న న్నొకటిన మఱి
కొంపోయిన నెంద తె ట్లగుదురో యెఱుఁగన్. 143

వ. అనుటయు. 144

క. నిను విడిచినఁ గొంపోయినఁ
బనికొదవలు లేమి సరియె పత్రిక చేఁ జి
క్కినయది నీ విఁక నీడిగి
లిన నొచ్చుట మీఁది మిక్కిలి వివేకింపన్. 145

తే. వచ్చితేనియు విను ప్రభావతిమనమున
కెట్టిగతి నైన దయపుట్ట నేను జెప్పి
నిన్ను విడిపింతు ననుచుఁ దన్వీడక బలిమిఁ
గొని చనంగ మరాళి కి ట్లనియెఁ జిలుక. 146

ఉ. ఏల చలంబు నీ వడిగెదేని వచించెద నాదుగోప్యముం
బేలవె యార్చి తేల్చఁ దలఁబెట్ట రహస్యము దప్పు నన్న చోఁ
దాలిమిఁ గప్పి పుచ్చినను దద్గుణ మొక్కొకచో ఫలించు నా
వేళఁబసంచు నేయ నొకవీసము గల్గదు హింస తప్పదుఁ. 147

సీ. కావున నొకవివిక్తస్థలంబున నిల్పి
వినుము నాతఁ పెల్ల వినినవెనుక
నీకుఁ దోఁచినయట్లు గైకొని చేయుదు
గాని నాపుడు హంసకాంత దనకు
నప్పటి కదియ కార్యముగ వివేకించి
చుట్టుపట్టుల నెందుఁ జెట్టు చేమ
లేక యొప్పెడునొక్కలీలామహీధర
శిఖరంబుపై నిల్చి చిలుకఁ దనదు

తే. పక్షముల బల్మిఁ బట్టి యాపత్త్రికాప్ర
కార మేమియు నీ వింకఁ గడమపెట్ట
కంతయును నాకు నెఱిఁగింపు మనుచుఁ బలికె
నంచతో యవ్వలి కదియు నిట్లనుచుఁ జెప్పె. 148

క. ద్వారక యనుపురము కొక
కారణమున నేఁగి నేను గ్రమ్మఱి రాఁగాఁ
జారుతరమూర్తి యొకఁ డొక
యారామములో నతివ్యథాకులుఁ డగుచున్. 149

సీ. కృప నెఱిఁగింపరే కీరోత్తమములార
వజ్రపురికిఁ బోవువారె మీరు

సదనుగ్రహమునఁ దుమ్మెదలార చెప్పరే
వజ్రపురికిఁ బోవువారె మీరు
కరుణతో వినిపింపఁ గదరె కోయిలలార
వజ్రపురికిఁ బోవువారె మీరు
తెలుపరే దయఁ జూచి మలయవాయువులార
వజ్రపురికిఁ బోవువారె మీరు

తే. చలువలొసఁగెడు మేఘరాజంబులార
యమలపక్షత నొప్పు రాయంచలార
నిలిచి నామాటలకు మాఱు పలుకరయ్య
వజ్రపురికి బోయెడువారె మీరు. 150

వ. అని కన్నకన్నవారి నెల్లఁ బ్రార్థించుచుండ విని దయ పుట్టి యేల పలవరించెదు వజ్రపురంబునకు నేఁ బోయెడు దాన నావలన నయ్యెడు కార్యంబుఁ జెప్పు మనిన నత్యాదరుం డై.

శా. శ్రౌతస్మార్తపథానువర్తనపరిష్కారాత్మ వర్ణాశ్రమ
స్ఫీతాచారపవిత్రమూర్తి శమగాంభీర్యక్షమాసత్యని
ష్ఠాతుష్ట్యాదిగుణోరుకీర్తి సముదంచన్నీతివిద్యామహా
చాతుర్యాస్పదకావ్యుఁడార్యజనతాసంభావ్యుఁడత్యంతముక్.

క. చారిమకారిమహత్తర
గౌరిమహారిమహనీయగాఢయశుఁడు గం
భీరిమదారినిషూదుఁడు
భూరిమదారిమహిమవ్యపోహకుఁ డెపుడున్. 153

స్రగ్విణి. ఇందుపూతక్రతాయీతనూజార్థరా
ణ్ణందనస్వాంతభూనైషధేళాసుతా

మందసౌందర్యసంస్కారకాకారసం
సందితశ్రీధృతిప్రాభవుం డెంతయుఁ. 154

గద్యము. ఇది నిఖిల సూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతంబైన ప్రభావతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు

# ప్రభావతీప్రద్యుమ్నము

## చతుర్థాశ్వాసము



క. రుచిరతరుఁడు విమలా
చారధురంధరుఁడు సుకవిసముదయగోష్ఠీ
సారస్యపరుఁడు పింగళి
సూరనయమరార్యవరుఁడు సురగురుఁ డుక్తిన్. 1

వ. ఆరామవర్తి యైన కుమారోత్తముండు నన్నుం జూచి యోచిలుకలకులభూషణంబ నాకు నీవలన నయ్యెడుప్రయోజనంబు విను మావజ్రపురంబున శుచిముఖి యను రాజహంసి గలదు దాని నరసి యొక్కలేఖ యందింపవలయు ననియె నే నతని యతిదైన్యాతిభారంబు భావించి కారుణ్యపరవశత్వంబు నొందినదాననై తక్కినయాగాములు లెక్కసేయక యీకమ్మ హంసి కిచ్చు టింతియ కదా యని కొంచుఁ బోయిన నెంత తప్పు వాటిల్లెడు ననుతలంపున నియ్యకొని యయ్యాకు పత్త్రంబులోన లీనంబుగాఁ గట్టించుకొని వచ్చి యిప్పు డప్పువ్వుఁదోఁటలోని కొలంకులు కలహంసకులకలకలాకులంబు లగుటయుఁ దత్కన్యకాపరిచయంబున నున్న నిన్నుఁ బరికించి. 2

తే. ఇచట శుచిముఖి యనుహంసియీగడ యొక
కొంత దొరకునో యంచు నక్కుజమునందు

నోయ్య నిలిచిలి నంతనె యురిని దగులు
కొంటి లోనైతి నీపాట్లకు స్మరాళి. 3

వ. అని చెప్పుటయు 4

క. తనకార్యము యది యగుటకు
ననయము ముద మొదవ మదివ యడంచి యిది యొటెం
నదియది యింతియ కావల
యును బత్త్రికచంద మింత యొనరునె యనుచున్. 5

వ. కావున నింక నీపత్త్రికాప్రసంగంబు నిస్సారంబుగాఁ బోనాడి ప్రసంగాంతరంబున మఱపించి విడిచెద నని హంసి చిలుకకి ట్లనియె. 6

ఆ. పక్షిపేర వ్రాసి పత్త్రిక యనిపెడు
నట్టివాఁడు భ్రాంతుఁ డగుట ధ్రువము
నా కతం డనిపిన యాకమ్మ యె ట్లుండె
నేమి మిగుల నొరసి యేల యడుగ. 7

క. నీ వాపురికిని మొదలం
బోవం బని యేమి చెప్పుము యథార్థముగా
నావుడును నీళ్లు నమలుచు
నావిహగము చెప్పఁ గొంక నంచయు దానిన్. 8

ఆ. బిగియఁబట్టి యొందు బెణఁక నీ కడిగె నే
యర్థ మిందుఁ గలదొ యనుతలంపున
జడియ కదియుఁ జత్తు సరిపోదు మాటప
ట్టీక చెప్ప ననుచు వీఁక నుండె. 9

ఆ. నవనిధానములును దవిలి యిచ్చిన నైన
మెడలమీఁద గత్తి యిడిన నైనఁ

జాల రసఘుచరితు లేలినవారిర
హాస్యభంగమునకు ననుమతింప. 10

వ. హంసియు దాని కడిగినమాటప ట్టిచ్చె నదియు ని ట్లని
చెప్పె. 11

క. విను వజ్రనాభుతమ్ముఁడు
సునాభుఁ డనుఘోరరాక్షసుండు గలఁడు త
త్తనయలు గల రిద్దఱు సొబ
గున నధికలు చంద్రవతియు గుణవతియు ననఁ. 12

చ. అతఁ డొకనాఁడు నారదుఁ విహారవశంబున నాత్మసత్సభా
గతుఁ డగువాని సద్వినయగౌరవపూజలఁ దన్పి సొవిద
ప్రతతులఁ గూర్చి లోపలికిఁ బంచెను దేవ్రులు నక్కుమారికా
ద్వితయము మ్రొక్కి రాతనికి దీవనలందుటకై వినీతితోఁ.

సీ. ఇవ్విధమ్మున నమ్మునీశ్వరుఁ బూజించి
యతనియాశీర్వాద మందుటకును
దనయంతిపురమువారిని సునాభుఁడు నియ
మించి పంచినఁ బరమేష్ఠిసుతుని
వారును వివిధోపచారపూజలచేత
సంతుష్టుఁ జేయుచోఁ జంద్రవతియు
గుణవతియును భక్తిఁ బ్రణమిల్లఁ బతిమనో
వల్లభలై పుత్త్రవతుల రగుచు

తే. నొప్పుఁ డనుచును దీవించె నప్పు డచటి
దాదు లోమునివర్య యీతలిరుఁబోండ్ల
కధిపు లెవ్వారు వారల నానతింపు
మాపుడును గొంత చింతించి నారదుండు. 14

మత్తకోకిల. వీరి కిద్దఱకుం గ్రమంబున విస్ఫురద్గుణశోభితుల్
ద్వారకానగరాశ్రయు ల్యదువంశజు ల్గదసాంబు ల
న్వారు నాథులుగాఁ గలా రని వారి కానతి యిచ్చె న
న్నారదోక్తికి వారు చిత్తమున న్విచారము సంధిలన్. 15

తే. కుడిచి కూర్చుండి వెతఁ దెచ్చుకొంటి మొకటి
యెన్న నెక్కడిద్వారక యెక్కడిగద
సాంబు లివి విన్నఁ బెనుచేటు స్వామిచేత
నసురులకుఁ బగ వీడఁట యాపురంబు. 16

చ. అని తమలోనఁ దా రడఁచి రాపలు కెందును సుబ్బకుండ న
ద్దనుజవరేణ్యకన్యకలు తాపసవాక్యము విన్న యాదిగా
మనమునఁగూర్మి హెచ్చి నియమంబులునోములుదానధర్మవ
ర్తనలుఁ గరంబుసల్పుదురు తద్గదసాంబశుభంబుకోరుచున్.

ఉ. క్రమమున భోగయోగ్య మగుప్రాయము నిండుచు రాఁగ
భర్తృసంగమనమనోరథంబునతిగాఢము గాఁగఁబతిప్రవృత్తి
లాభము గడు దవ్వుగా నలసి బాలిక లిద్దఱు తద్దయున్
గత, తమఁ గుసుమాస్త్రబాణములఁ గాంతిరొ చిక్కఁగఁ
జిక్కి రే మనన్. 18

ఉ. అచ్చపలాక్షు లిద్దఱును నర్మిలిఁ బెంచియుఁ బల్క నేర్పి
యున్, ముచ్చటకాఁపుగాఁ దమవినోదపు నెచ్చెలిగాఁ నను
న్గదున్,మచ్చికఁ జూతు రాసతులమన్ననకుం దగఁ బ్రత్యుప
క్రియా, సచ్చరితంబుఁ జూపఁగ నజస్రము నేనును గోరు
చుందుదున్. 19

క. కావున వారలయప్పటి
భావజశరపీడఁ జూచి భామినులారా

మీవల్లభులశుభస్థితి
నావెరవునఁ దెలిసి వత్తు నమ్ముఁడు మదిలోన్. 20

తే. మఱియు నప్పటికొలఁదిని మంతనముగఁ
జేరి మీకోర్కిఁ జెప్ప వచ్చినను జెప్పి
మాఱుమాట యేఁ దెచ్చెద మానసముల
నన్యచింతలు మాని న న్ననుపుఁ డనుచు. 21

వ. ఏను మద్విరహాసహత్వంబునం జేసి వార లనుపం జాలక యనుమానించినను మానక యపుడ కదలి ద్వారకా పురంబున కరిగి నాచేత నైనపాటిగ మనకార్యంబు సాధించు కొని తిరిగి వచ్చునప్పు డాలేఖ యట్లు ప్రాప్తం బయ్యెఁ దత్ప్రకారంబును వినిపించితి నన్నుఁ బ్రభావతి చూచి గుఱు తెఱింగెనేని చంద్రవతీగుణవతులకు నేమి కొఱ గామి సంఘటిల్లునో యని తలంకెద నవ్వనితలకు మత్పున ర్దర్శనంబునకై మితి పెట్టినదినంబు నేఁడ కావున నెంత వంతెం బొరలుచున్నవారో వారికిం జూడసూప వలయు న న్ననిపి యనుగ్రహింపుము. 22

తే. ఘనపయోవృష్టికిని జాతకములు వోలె
గొమరువెన్నెలకును జకోరములు వోలె
భాస్కరోదయమునకు నబ్జములు వోలె
నెదురు చూతురు నాకాక కిందుముఖులు. 23

వ. అనుటయు. 24

ఆ. ఏను నిన్ను విడువ కిట్ల వచ్చెద నీవు
చెప్పినంతవట్టు నప్పడఁతులఁ

బిలిచి నాయెదుటను గల దనిపించిన
విడుతు మదుపకారవృత్తి దెలిపి. 25

క. అనవుడు నట్లన కాని
మ్మనుచుఁ దదాక్రాంతమూర్తి యగుచునె వెసఁదాఁ
జని చిలుక కేళవు లరయుచు
సునాభకన్యలు వసించుశుద్ధాంతమునన్. 26

క. ఒక సౌధవిటంకనుత
ల్లికమాటుగ వ్రాలి లాఁతిలేమ లచటఁ జే
రికఁ బొలయ కుండ నారసి
యకలంకస్వరతఁ బిలిచె నాకన్నియలన్. 27

క. పిలుచుటయు వార లిది మన
చిలుకయెలుం గనుచు నుల్లసిల్లి రపుడు పీ
నుల నూఁదుకప్పురపుఁజలు
వలఁ బోలి విరాళియలఁత వడి నవి తీర్పన్. 28

ఆ. అట్లు సంతసిల్లి యతిసంభ్రమంబున
నరుగుదెంచి హంసికావృత మగు
చిలుకలెఱుఁగు జూచి వెలవెలఁ బాఱుఁ ద
ద్భయనివృత్తి గాఁగఁ బలికెఁ జిలుక. 29

క. నిను నంపినవారికి నీ
కును హితమె యొనర్తుఁ బ్రాతికూల్యం బొకప
ట్టునఁ జేయ ననుచు నిది నా
కు నిజముచేసినది మీరు కొంకకుఁడు మదిన్. 30

వ. అని తనకును దానికిం బ్రాపించినసంబంధంబు తెఱంగునుం
దాను మాటపట్టు పుచ్చుకొని తనకార్యరహస్యంబుఁ దెలు

పుటయుం దెలిపి యేను మీాదాన ననుట మీాచేత వెళ్ల
నాడించుకొని మీా కుపకారం బెక్కించి విడుచుటకు వచ్చిన
దని చెప్పి తత్ప్రార్థనావశీకృతహృదయ యగుహంసిచేత
విడునంబడి యేను బోయినకార్యంబు వివరించెద నని వారల
వేఱువేఱం బేరు గ్రుచ్చి యి ట్లనియె. 31

తే. చంద్రవతి నీదుప్రాణేశుం డింద్రనిభుఁడు
గదుఁడు ద్వారక నున్నాఁడు ముదముతోడ
గుణవతీ నీదుప్రియుఁడు సాద్గుణ్యరాశి
తనరుచున్నాఁడు సాంబుఁ డెంతయు శుభమున. 32

క. ప్రకటితచాతురి నారా
జకుమారులతోడ నుచితసమయముల న్మె
చ్చిక చేసితి నేఁ గ్రమమున
నొకఁ డెఱుఁగక యుండ నొకనియొద్దకుఁ జనుచున్. 33

క. విదితము చేసితి మీామీా
హృదయేశుల కంత మీాయభీష్టము తెఱఁగుల్
తుద నంతయుఁ దెలిపితి మీా
బ్రదుకులతదుపేక్షణైకపర్యంతతయున్. 34

తే. వారు నేయుపాయములను వదలక వరి
యించువారైరి మిమ్ము మీా రింతలోన
ధృతి సడల నిత్తురే నాత్మహతియకాక
పతిహననపాతకముఁ గల్గఁ బల్కి రపుడు. 35

సీ. అని చెప్పుటయు విని యాకన్యకలు గరం
బులఁ గర్ణయుగళంబు మూసికొనుచుఁ

దమ కంత యే లగుఁ దాము దీర్ఘాయుర
న్వితు లగుదురుగాక యతివియోగ
వనరాశి నేమును మునుఁగక తమమాట
యాస పెన్దెప్పగా నచల మైన
తాల్మి నీఁదుచు నుండెదము తమ కస్మదీ
య ప్రాణసంరక్షయందుఁ దగిన
తే. త్రోవ మాభాగ్యవశమునఁ దోఁచుదాఁక
నోర్చుటయకాక తమకింప యుక్త మగునె
యని పలికి యూరకుండిన నంచచెలువ
వారి కి ట్లను సముచితవాక్యసరణి. 36

క. మీపతు లిట వచ్చుట కుచి
తోపాయము మిగులఁ దడయ కొక్కటి తగ నే
నాపాదించెద మీరలు
నాపై దయ మఱవకుఁడు మనంబులయందున్. 37

వ. ఏను బ్రభావతికిఁ బ్రాణసఖి నై యుండుదుఁ గావున నా చెలువపనుపున నీచిలుక నిట్లు దగులుకొని వచ్చితి నిది నిమిత్తంబుగా నైన మీతోడిమైత్రి దొరకె నింక నిక్కడ మిక్కిలిం దడయఁ దగదు పోయి వచ్చెద నచ్చట నిచ్చటి రహస్యంబు వెలివోవ నీక తగిన యుత్తరం బిచ్చి కప్పి పుచ్చెద నిచ్చలంపుమనంబుల నుండుం డని పలికి యా మాటల కత్యంతసంతుష్టాంతరంగ లగు నాయంగనల వీడ్కొని వజ్రనాభతనయకడకు నరుగుదెంచి యి ట్లనియె.

క. చెలువా నీసౌభాగ్యపు
విలసనమ కదమ్మ యెచట వీక్షించిన న

ర్శిలి నీపతి నీ కై చిం
తిలి యనిపినలేఖ యఁట కదే తెలియంగన్. 39

వ. అనిన నక్కన్యకారత్నంబు నవ్వుచు ని ట్లనియె. 40

క. అడుగఁగ వలసినయది యే
నడుగుదు విశదముగ మొదల నాచిలుక యదె
క్కడిది యిటఁ దేక యేటికి
విడిచితి నీకడుపు కందవిత్తుగ హంసీ. 41

వ. అనుటయు శుచిముఖి యి ట్లనియె. 42

క. నీపతి నీకై కుందుచు
నాపేరను లేఖ యనిపినాఁ డని యిది యే
నాపులుఁగువలనఁ దెలిసి ము
దాఘూర్ణత నుబ్బి విడిచి యనిపితి దానిన్. 43

క. మన కి మ్మనుచు నతం డని
చినపత్రిక దొరకె నొరులచేఁ బడ కిదియే
మనకుం బడినే లెట్లట
చనని మ్మాచిలుక తద్విచారం బేలా. 44

సీ. అని రాగవల్లరిఁ గనుఁగొని యాపత్రి
కార్థ మే విన్నట్లె యగుఁ గదమ్మ
చదువుకొంటిరె యన్న నది తాను జదివిన
యంతయు జెప్పి నన్నవలఁ జదువ
నీక తా నొడిసి యాయాకు బలిమిఁ బుచ్చు
కొనియెనీపడుచన విని మరాళి
యటమీఁద దెలియ న్యాయము కాదు మనకు న
నన్యప్రకాశనీయంబు లైన

వలు గొనుచుండఁ జేరి తగువర్తన నొప్పుచుఁ దన్నతండు వ
త్సలతయు గారవంబు వెదచల్లెడుమాటల నాదరింపఁగన్.

వ. తదీయరత్నసింహాసనసమీపంబునఁ బ్రవర్తిల్లుచు నల్లన ప్రసం
గంబు దిగిచి సవినయమధురభాషణంబుల నిట్లనియె. 55

క. మనబొడ్డనబావులలో
ననుదినముఁ జరించునంచలం దొకహంసాం
గన యేమిచెప్పఁ దంశ్రీ
కని విని నే నెందు నెఱుఁగ గని విద్యలకున్. 56

చ. శుచిముఖియం డ్రదాని వచోనిపుణత్వమునందుసత్కథా
రచనలయందు నీతివిదురత్వమునందు బహుశ్రవోవలో
కచణతయందు నెందు సరి గానము దానికి వేయు నేల దా
నిచతురతావిశేషములు నీవ కనన్వలయు న్మహాత్మకా. 57

తే. అనుడు నాదైత్యపతి తనయనుఁగుఁగూఁతు
మాట లొకముద్దుసేయుచు బోటిఁ బనిచి
యమ్మ రప్పింపవే చూత మమ్మరాళి
ననియె నింతియు రప్పించె హంసి నపుడ. 58

వ. రప్పించి ముందట నిడుకొని శుచిముఖి నీదువిద్యావిలసనంబు
విన్నవించిన నయ్య విననలయు నని వేడుక పడుచున్న
వాఁడు శాస్త్రప్రసంగంబు సేయు మనిన నదియును. 59

క. వీనులకు సుధారసముల
సోనలు వర్షించుమృదులసుస్వరఫణితిం
దా నిట్టటు గ్రుక్కక పని
లేనిపునరుపదము లిడక లీల దలిర్పన్. 60

శా. కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబున్ భుజం
గాగ్రణీ, పాణీమార్గము జైమినీయమతముల్ వ్యాసోక్త
శాస్త్రంబు న, క్కాణించెం గడుఁ బూర్వపక్షములు జోకం
బెంచుచు న్మెంచి యుక్తీణ ప్రౌఢిఁ దిరస్కరింపుచుఁ దుదన్
సిద్ధాంతము ల్నిల్పుచున్. 61

మ. స్వమతిప్రౌఢి దృఢానుమానముల సంస్థాపించు నేవేళ నె
ద్ది మతం బప్పుడు వానివానికి నుపాధిగ్రస్తతావ్యాప్తిభం
గముఖానేకసుదూషణంబులు వెసం గల్పించుఁ దానన్యశా
స్త్ర మతస్థాపనవేళ నవ్విహగిదైత్యశ్రేష్ఠుఁ డోహో యనన్. 

వ. మఱియును. 63

తే. కావ్యనాటకాలంకారగానముదన
శాస్త్రపరిచయమహిమంబు జాలపాద
భామినీమణి నెరపె నుద్దామపటిమ
నాయసురభర్త మెచ్చి పురే యనంగ. 64

వ. అంత నద్దనుజనాయకుండు శుచిముఖిముఖం బవలోకించి
నీవును నానిగంతచారిణివి నీ కనినయద్భుతంబు లే మేని
యుం గలిగిన నెఱింగింపు మనవుడు నాయంచ యించుక
విచారించుట యభినయించి యి ట్లనియె. 65

తే. కనినచోద్యంబు లెన్నియో గలవు వాని
నేమి చెప్పుదు నందులో నెల్ల నాకు
నతివిచిత్రమై తోఁచినయది నిశాచ
రాధిప వచింతు నొక్కటి యవధరింపు. 66

ఆ. నటుఁ డొకండు భద్రనాముండు మున్నొక్క
చోటఁ దాపససభ నాటనేర్పు

వలన మెచ్చుఁ జేసి వరముగా నత్యద్భు
తంపునాట్యపటిమ పెంపు వడసి. 67

సీ. ఏడుదీవులఁ జరియించుచు నున్నవాఁ
డని చెప్పి యతనినాట్యముల వేళఁ
గలయట్టియద్భుతంబులు సర్వమును సవి
స్తరముగ వినిపింప దానవేంద్రుఁ
డాశ్చర్యకౌతుకాయత్తాత్ముఁ డగుచు నే
నును గొంత కొంత యాతనితెఱంగు
విని చూడవలయు నన్వేడుక నుండుదు
నీవు ప్రవీణ వన్నిటను హంసి

తే. యానటుని నిచ్చటికిఁ దెచ్చితేని మెచ్చు
గలదు నీ కని ప్రేమతోఁ బలికె నదియు
నట్ల చేసెద నని దనుజాధినాథు
వీడ్కొని ప్రభావతినిఁ జూచి వినయ మొప్ప. 68

ఉత్సాహ. అని పెదే ముదంబుతోడ నమ్మ పోయి వత్తునా
యనుడు నదియుఁ గొన్ని యడుగు లనుప నేఁగు దేర నో
వనరుహాక్షి యింతయు న్భవత్ప్రియార్థమే సుమీ
మనమునందు నిది యెఱింగి మైత్రి మఱవ కుండుమీ. 69

వ. అనుచు గూఢవృత్తిఁ దదిష్టసాధనపరత సూచించి యని
పించుకొని ద్వారకానగరంబునకుం బోయి తాను వజ్రనాభు
చేత భద్రనామధేయనటునిం దోడ్కొని తెచ్చుటకు
నియుక్త యగుట కృష్ణుని కెఱింగించి వజ్రనాభానుజుండగు
సునాభునికూఁతులు గదసాంబులకు భార్యలుగాఁ గల రని
నారదవచనంబులకలిమి చెప్పి ప్రద్యుమ్నున కసురజయ

సాహాయ్యకంబు నడుప గదసాంబు లరుగువా రని నిశ్చ యించిన యాచక్రధరునినిశ్చయంబు విని యది తదీయశాస నంబున వాసవునకు విన్నవింప దివంబునకుం జనుచుం బ్రద్యుమ్నునింటి కరిగి యప్పు డతండు ప్రభావతీవియోగ తాపాతిభారంబున నసురుసు రగుచు మిగుల నొగిలి తదు దంతచింతం జేసి నిజాగమనంబ కోరుచున్నవాఁడు గావున నతనిచేత నతిమాత్రాదరగౌరవంబు వడసి యేకతంబున నతనితోడ. 70

సీ. ఒకచిల్కచేతఁ బత్రిక యంచితే నాకు
 ననిచితి నది నీకు నందె నొక్క
యనుచు లెవ్వరిఁ గూర్చి యది వారికిని జేరె
 నాయింతికి శుభంబె హంసరమణి
నాలేఖ యందుట నామాట యనవచ్చు
 మున్నట్టికొదవ రా మూల మెద్ది
పత్రిక కడు దైన్యపడి నీవు పంచు ట
 ట్లాకాంతపై నెంతహాళికలిమి
తే. నాసతియు భవద్విరహాగ్ని నంత గుందె
నన్ను నెఱుఁగుట గాట్లు ము న్వాంఛసేయ
శివ లిఖించి యిచ్చినది నీచెలువు దాని
కేమిటికి నిచ్చె వరుఁడు నీ కీతఁ డనుచు. 71

మ. అనుచు న్నాటకుమాటగా వరుసతో హంసీకులోత్తంసమా
తనికిం దైత్యతనూజకోర్కి తెఱఁగుం దన్మూలముం జెప్పి యి
ట్లను నే నీ కిది నాఁడె తెల్పుటకుఁ గాదా చేసితి న్జాలఁ ద
ద్ఘనశోభా స్తుతి నీవాకించుకయుఁ జిత్తం బీమిఁ జాలించితిన్.

వ. ఆప్రభావతి నన్ను నత్యంతప్రియసఖింగా నడుపుకొన్నది గావున దానికు ట్టించుకయు నే నెఱుంగనియది లేదు కని యు వినియు సమస్తంబు నాకళించినదాన నని యతనికి భవానీకృపానుగ్రహాపతిప్రకారంబు సకలంబునుం దెలిపి యి ట్లనియె. 73

చ. భవదమలాకృతిప్రతిమఁ బర్వినయప్పుడు చూపుక్రమ్మఱన్
దివఁ గదలింప రాక సురతి స్థగితచేష్టితఁ జేసె నోయదు
ప్రవరుఁడ యేమిచెప్పుదును రాగకుతూహలవిస్మయాంతిగా
రవమున నెంతవ్రేఁగగుచు రాపడియుండెనొ కాని యత్తఱిన్.

చ. కొసరక చూపుచేతఁ గడుఁ గ్రోలిననీచెలువంబు చెల్వమా
నసమున నెంత మిక్కిలి ఘనంబుగ హత్తెనొ కానియప్పుడో
రసికశిఖావతంస యదురత్నమ కాకరకాయరీతిఁగాఁ
గిసలయపాణిచన్నుఁగవక్రేవ గగుర్పొడిచెం బొరిం బొరిన్.

ఉ. వావిరి నెల్ల ప్రొద్దును భవత్పరిరంభణచుంబనాదినా
నావిధభోగలీలకు మనంబున నువ్విళులూరు చున్కి ప్రీ
డావతి దెల్పెఁ గొన్నినిశలం గనుమూసినయంతమాత్రఁబై
పై విలసిల్లుకుట్టమితభావవిశేషవిజృంభణంబులన్. 76

మ. కలలం గూడినవేళ నెట్టిపాలయల్క ల్పుట్టెనో యేమి నీ
వలనం దప్పుఘటిల్లెనో యెఱుఁగఁ దత్స్వాప్నాగమామర్షవి
హ్వలితస్వాంతయ పోలె నిద్ర నెఱయ న్వర్జించెఁ బద్మాక్షియ
త్తు లహోరాత్రములందుఁ బద్మకుముదస్ఫూర్తి న్విడం
బింపఁగన్. 77

క. చిత్తజమహాగ్ని కాఁకల
నెత్తు దఱిగి వన్నె యెక్క నెంతయు నెమ్మే

న త్తరుణికి జను లంద ఱుఁ
బు త్తడిబొమ్మ యనుమాట బొం కేల యగున్. 78

సీ. రోలంబనికురుంబనీలిమశ్రీఁ బోలె
వేణి ముట్టుట కడు విరస మయ్యె
సమదకోకిలశుకస్వరసామ్యమునఁ బోలె
సఖులసల్లాప మసహ్య మయ్యెఁ
బరిపూర్ణచంద్రబింబసమత్వమునఁ బోలె
నిలువుటద్ద మదర్శనీయ మయ్యెఁ
బ్రసవాస్త్రవివిధమార్గణవర్ణధృతిఁ బోలె
రత్నభూషాళి యగ్రాహ్య మయ్యె
తే. వేయుఁ జెప్పఁగ నేల నీవిలసనంబు
లుల్లమునఁ దలపోయుట యొకటి దక్క
బహుదినంబులనుండి యాపడఁతి కితర
వస్తురుచు లన్నియును గాన వావి యయ్యె. 79

క. వెదకికొని తానె యిటు రా
మది సాహస మొంది కదలు మాటికి నీరూ
పెదుటఁ దన కంతఁ దోఁచిన
మదిరేక్షణ తత్తఱిలుచు మగుడుఁ లజ్జన్. 80

క. ఆపడఁతి యడలఁ జేసెను
జూపఱ నపు డేమి చెప్ప శోషిలుచుఁ గడుఁ
నీపత్త్రిక యానిమిషము
లోపల రాదేనిఁ బాటిలు దశాంతరమున్. 81

వ. ఆపత్త్రికయుపకారంబునుం దాత్కాలికస్థితికారణం బగుట

యొక్కటియ కాని యక్కన్యకు మిక్కిలిం దాపంబుగావించు
చున్నయది యె ట్లంటేని. 82

క. క్రిందటిదినములు విరహాద
శం దా నలఁగుటయ కాని సరిగ నిపుడు నీ
వుం దన కై కుందుట విని
యొం దరుణికి నింక నిమిష మేఁ డై తోఁచున్. 83

ఉ. భావన చేసి చూడ క్షణభంగుర మింతులతాల్మి కల్మి వా
తావిలపల్లవాంచలహిమాంబుకణంబును నంతకం టె మే
ల్గావున నింక నెంత యవిలంబమునం గృప నేఁగి ప్రోచెదో
దేవరచిత్త మాసతియదృష్టము వేయును జెప్ప నేటికిన్. 85

వ. అనిన విని యతండు. 85

క. గ్రక్కునఁ జని వ్రాలుదునో
ఱెక్కలు గట్టుకొని దివిజరిపుమేడలపై
నక్కొమ్మఁ జూచు టెప్పు డెపు
డో కో యనునంతతమక మున్నది మదిలోన్. 86

తే. ఏమి సేయుదు నాదైత్యునియ్యకోలు
లేక వీ డెవ్వరికిఁ జొర రాక యునికి
యరసి వేఁగుచు నున్నాఁడ నమరపతియు
హరియుఁ దలపోయుకార్య మే మయ్యెఁ జెపుమ. 87

వ. అనిన శుచిముఖి యతనిం జూచి యోకుమారక నీకుఁ
దత్పురప్రవేశ చింత వలవదు తదుపాయంబు హరి నిశ్చ
యించుకొనియున్నవాఁడు వజ్రనాభకార్యంబునకు నేను
భవదిష్టసాధనానుకూల్యంబు చింతించి నిన్నే యనువు
నట్లుగాఁ జేసితి వాసుదేవుం డిపుడ యేతదర్థంబు నిన్నుఁ బిలి

పించి యనుపుచున్న వాఁడు వజ్రికి నిచిరుయెఱింగించి వజ్రపురం
బున కరిగి యేనును దగిన తెఱంగునం దానవకీనకార్యాను
గుణ్యంబు నడుపుచుండెద నని పలికి యతని వీడ్కొని
చనిరియె నప్పుడు. 88

సీ. అమరారికరులకుంభములు వ్రయ్యఁగ మొత్త
రమణిచన్నులు నఖాగ్రముల నొత్త
సమదరాక్షసరథచక్రంబు లిలఁ గూల్పఁ
గాంత శ్రోణికి నూడిగంబు సల్ప
నసురేంద్రజయశంఖ మవనిపై వ్రేయింపఁ
గామినికంఠంబు గౌఁగిలింప
వజ్రనాభునిధనుర్వార్తలు గడతేర్పఁ
బడఁతికన్ప్రేమసంజ్ఞఁ బను లొనర్ప

తే. దైత్యు మెఱుఁగుఁ దూపులు దళితములు సేయఁ
దత్తనూజచూపులు ఫలితములు సేయ
నుదుటుఁడనమును వలపు నొండొంటితోడ
దంటగొని క్రమ్మ నెమ్మది దాల్చె నతఁడు. 89

సీ. అంతట గోవిందుఁ డతనుని గదసాంబు
లను బిలిపించి యలంఘ్యదర్ప
వజ్రనాభుని బ్రహ్మవరబలోద్ధతుని దే
వహితార్థమై త్రుంపవలయుటయును
దన్మహత్త్వంబును దత్పట్టణప్రవే
శం బన్యులకు నసాధ్యం బగుటయుఁ
దాను మరాలిచేఁ దగ ఘటింపించిన
తదుపాయమును విశదముగఁ జెపి

తే. యందు రుక్మిణిసుతుఁడు భద్రాఖ్యరూపు
గదుఁడు పారిపార్శ్వకునియాకారము మఱి
సాంబుఁడు విదూషకుని ప్రకారంబుఁ దాల్చి
చనఁగ నియమించి పంచెను దనుజపురికి. 90

ఆ. ఆముగురు పరస్పరావిదితస్వప్రి
యాంగనాసమాగమానుగుణతఁ
బ్రమద మొంది రపుడు ప్రత్యేక మీయాత్ర
నాదుభాగ్యవిలసనంబ యనుచు. 91

సీ. మనముల నిట్టుబ్బుచును నటవేషంబు
ధరియించి తమకును దగినయట్టి
వారసీమంతినీవ్రాతంబు గొలువ వై
ణిక వైణవికహాసాంరజకజనాది
నాట్యసామగ్రి ముఖ్య భద్రున కెట్టిది
యట్టిద యై కనుపట్టుచుండఁ
గదలి యథోచితగతిఁ బయనంబులు
వర్తిల్లఁగా నేఁగి వజ్రపురము

తే. ప్రాంతమునను శాఖానగరములయందు
విరివి చూపట్టు మేళంబు విడిసి విడిసి
యతివిచిత్రంబు లగుతమయాటనేర్పు
లెల్ల నెఱపిరి కడువార్త కెక్కుచుంట. 92

క. దనుజేంద్రుఁడు తద్వార్తలు
వినుచుఁ హృదయమునఁ బొదలువేడుకతో వా
రిని బిలిపించెను వారును
జని యాదనుజునకు నుచితసమయమునందున్. 93

క. తమనాట్యవిద్యఁ జూపఁగ
సమకట్టి తదర్హ మైనసన్నాహవిశే
షముతోడ నేఁగుదెంచిరి
రమణ దలిర్పంగ నృత్యరంగస్థలికిన్. 94

వ. శుచీముఖి యటమున్న తనపలికినక్రమంబున వచ్చి వజ్రనాభునియాదరంబు వడసి ప్రవర్తిల్లుచుం బ్రభావతికిం జంద్రవతీగుణవతులకుం దత్పతులరాక తెలం గెలింగించి వియోగతాపంబున మిగుల నొగులకుండఁ దదాశాశీతలోపచారంబున నేద దేర్చుచు నుండి యప్పు డక్లేతెంచినప్రద్యుమ్నునకు క్షణక్షణప్రవర్ధమానప్రభావతీరాగవృత్తాంతంబుననౌత్సుక్యంబుఁ బెనుచుచు నతిగాఢంబుగా రాకపోకలు గావింపు చునికిం జేసి యతనితోడ నేఁడు నీహృదయవల్లభ నీనాట్యంబు చూడవచ్చు నని చెప్పి తదాగమనీయహర్మ్యస్థలంబునుం జూపి పోయె నంత 95

సీ. వజ్రనాభుఁడు రాజ్యవైభవం బెంతయు
మెఱసి నానాబంధుమిత్రసచివ
సంఘంబుతోడ నాస్థానమహామంట
పమునందు నొడ్డోలగమున నుండి
పరులదృష్టికి నగోచర మగుసంవృత
స్థలి నిల్చి రాణివాసపుజనంబు
చూచునట్టుగఁ జేసి సొంపారు వేడ్కతో
సావధానస్వాంతుఁ డగుచుఁ జూడ
తే. సంవిహితరంగమంగళాచార్యుఁ డగుచు
సురహితముగ మాయానాట్యసూత్రధార

వృత్తి గైకొని శంబరద్వేషి యొనరెఁ
బూర్వరంగప్రవర్తన పొందు పఱుప. 96

వ. అప్పుడు. 97

శా. గాంధారప్రముఖస్వరశ్రుతికళాగంభీరవారాంగనా
గాంధర్వంబు ఘనస్వనంబు తతనిక్వాణంబు వంశాదిసం
బంధిస్వానపరంపరామహిమముల్ మద్దెళ్లఁదిందింధిమిం
ధింధోంధిక్కిధిమిక్కిశబ్దభరముల్ దీపింప నాపూర్ణతన్. 98

సీ. సరవిఁ జంచత్పుటచాపపుటోద్ఘట్ట
పట్పితాపుత్త్రకసంజ్ఞ లమర
వెలయు చుండెడుసమవిషమతాళప్రవృ
త్తులు నాల్గు ప్రస్తారకలనవలనఁ
గలుగునానాతాళములు యథోక్తసూత్రిఁ
బరఁగునేలాదిప్రబంధచయముఁ
దత్తదర్థస్థానదత్తపటాక్షర
బిరుదాదికాంగవిస్ఫురణ దనర

తే. శ్రుతిఁ జతుర్దశముద్రకగీతభేద
ములు దురాపము లండ్రు వర్తిలె నవియును
నిఖిలకళలును గలరాక్కిణేయుశిక్ష
వలనఁ దన్నాట్యకర్మప్రవర్తనమున. 99

ఉ. ఆవనజాక్షునందనుఁడు నంతట నాంది దగం బఠించి యిం
పౌఁగహిలం బ్రరోచనయు నాముఖముం దనరార నొప్ప బ్ర
స్తావనతోముఖాదులగుసంధులుసాంగతఁ బెంపుమీఱఁగ రం
గావతరాదినాటకము లాడె ననేకము లద్భుతంబుగన్. 100

సీ. ఆనాటకప్రయోగావసరముల భ
    రతఖాద్యాకారధారణమును
గంగాదినిమ్నగాగతియుఁ గైలాసాది
    నగకల్పనమును నానావనప్ర
పంచనంబును బశుపక్షిమృగాదిజం
    తువిశేషరూపవృత్తులును మఱియు
నెచటి కెయ్యది యోగ్య మచటఁ దత్తద్వస్తు
    సృష్టి పన్నిదము వేసియును గృతక

తే. మగుట నిశ్చయింపఁగ లేక యబ్రపడుచుఁ
జూచి సామాజికులు తమసొమ్ములెల్ల
నొసఁగులుగ వైవ నడుపుచు నొప్పు మీఱె
రుక్మిణీసుతుండు మాయానిరూఢి మెఱసి. 101

వ. ఇవ్విధంబున నాత్మీయ దివ్యమాయాప్రపంచనముదంచిత నాట్యవంచితులం గావించి నక్తంచరులధనసంచయంబు నూఁచముట్టుగా దోఁచుకొనుచుం జూచుఖేచరులకు వేడ్కఁ బుట్టించె. 102

మ. ప్రియకాంతామణిచూడ్కికిం నిజవపుశ్శ్రీతోన తోఁచెం మహా, నయమాయానిధి రుక్మిణీసుతుఁడు నానాభూమి కాధారణుం, డయి భద్రుం డయి పొల్పువేళ 'నహి మాయాయా మసంభావ్య మ, స్తి' యటంచు న్బుధులాడు మాట మదిఁ జింతింపంగ బొం కేలగున్. 103

శా. ఆభవ్యుం డటమీఁద నొక్కొక్కనెప మొప్పారన్స్మరాళీప్రది
ష్టాభిజ్ఞానగవాక్షలక్ష్యధనుజాదృత్యాత్మజావక్త్రపీ

ఘాభ్రంబును సారెకుం దనకుఁ గల్గం జేసికొంచున్కిన
ట్లాభామామణికిం బ్రభుస్తుతివిలీహార్థంబుగా నిట్లనున్. 104

చ. సకలవిశేషశోధనకుఁ జాలిసయోనెజజాణ వజ్రనా
భ కులవతంసరత్నము ప్రభావతిరోహితకంటకంబు తా
వక మగుచూపు నాపయిఁ బ్రవర్ధితరాగతఁ బర్వఁ గాన న
త్యకలుషవృత్తి నాసుకృత మంతయు నేఁడు సుమీ ఫలించు
టల్. 105

తే. నీకు నామీఁదఁ గలయట్టినెయ్యమును మ
హాదరము నీవు పనిచినహంసి చెప్ప
నాత్మలో ననవరతనాట్యప్రసంగ
మున నిను భజించువేడుక ఘనము నాకు. 106

క. నను నేలికొను మవశ్యం
బును నీయూడిగము చిత్తమున కెక్కఁగ నే
నొనరింతు నేఁటిితమి నీ
మనమున నెంతయు నిడుకొని మన్నింపఁ దగున్. 107

క. అన విని కపోలయుగళము
ఘనపులకితముగ మరల్పఁ గ్రక్కున నాత్మా
ననము ప్రభావతి యాలో
కనజాలకమునకు నెగడఁ గడు లజ్జమెయిన్. 108

చ. అపుడు తదీయపార్శ్వగత యైనమరాళవధూటి దానవా
ధిపతనయం గనుంగొనిమదింగనుఁగొంటివెయాత్మనాథువా
క్యపదవిఁ దోఁచునట్టియితరార్థము సర్వము నాననాబ్జముం
ద్రిపనిటు త్రిప్పితింతిగరుదాల్పఁగపోలము చాలనావుడున్

క. విచ్చలవిడి నను బేర్కొని
యిచ్చును గళ లెల్లఁ బలికి యిదె నేఁటిసిరికా
వచ్చెద ననుచున్నాఁ డిఁక
నిచ్చో మఱి యర్థ మెద్ది యితరము దీనన్. 110

క. ఎవ్వరు వినుటకుఁ గైకొనఁ
డివ్విభుఁ డిది యేమిభ్రాంతి యెత్తెనొకో నా
కెవ్విధి ప్రాప్తమొకో యని
నివ్వెఱ పడి యింతతడవు నిలిచితి వినుచున్. 111

వ. అనుడు శుచిముఖి యా శశిముఖి నీక్షించి. 112

మ. అతివా యన్నిట జాణ నీమగఁడు నీకాచింతయుక్తంబుగా
దతఁ డర్థద్వితయోక్తి నీకు నుచితం బైనట్లు నీకు న్సభా
పతి కర్థం బగురీతి నాతనికిఁ దోఁపం బల్కినాఁ డేది నీ
మతిఁ దోఁచెం బ్రకృతంబు గామిఁ బరు లాత్మం గానరా
యర్థమున్. 113

క. సకియా నానార్థోక్తుల
నొకనియమము తెలియు మర్థ ముచితం బెచ్చో
టికి నెద్ది యదియ యచ్చోఁ
బ్రకటము హరి శ్రీవిభుఁ డనుపల్కునఁ బోలెన్. 114

వ. కావున నీవల్లభుండు నిన్నుఁ బలికినపలుకు లన్యు లెఱిఁగిరో
యనుశంక విడువు మతం డితరులకు నాట్యావసానసమయ
సముచితస్తోత్రప్రకరణబలంబునఁదోఁచుచున్న యర్థాంతరంబు
చేతఁ బ్రభువు నుపచరించి యిదె యతనిచేఁ దన విడిదికి నని
పించుకొని చను చున్నవాఁ డని పలికి శుచిముఖి యంతం
బలికినట్ల సేయు రాక్షిణేయుం జూపి తనతలంపు యథార్థం

బగుట తార్కాణించె నట్టు విహగమహిళా రహస్యసం
భాషణరసానుభవంబున విభాసిల్లు ప్రభావతియు రాగవల్లరీ
సహితంబుగా గృహంబునకరిగి ప్రియసమాగమత్వరమాణ
మానస యగుచు నుండె నంత. 115

ఉ. ఎప్పుడు వచ్చుఁ గాంతుఁ డినుఁ డెప్పుడు గ్రుంకు నటంచు
నాత్మలో, ముప్పిరిగొన్న రాగము సముత్కట మై కనుదో
యి కుబ్బఁగాఁ, దొప్పఁగఁ దోఁగుచూడ్కిని వధూమణి
సారెకుఁ జూడఁగా జామీ, యిప్పాలు పొందె నీతఁ డన
హేళి క్రమంబునఁ దాల్చె రక్తిమన్. 116

ఉ. అంబుధిలోని కంతటను హంసుఁడు డిగ్గె దినాంతమజ్జనా
ర్థంబును బోలె నట్టియెడఁ దత్తటి నాఱఁగఁ గట్టినట్టిర
క్తాంబరమో యనంగఁ దనరారెఁ గడుం గడసంజతీవి యం
తం బొడసూపెఁ దారలకు తత్పతనోద్గతబిందులో యనన్.

క. తోరపుజీఁకటు లంతఃక
మారోత్సవకలనమునకు మదిఁ బొంగుచు ది
జ్నారీజను లాడెడిక
స్తూరివసంతములయొప్పు చొప్పడ నెఱసెన్. 118

వ. అంత. 119

క. ఐరావణకరికరధూ
త్కారవమధురేణుపటలికై వడిఁ గుత్కీ
లారిదిశఁ దెలుపు తోఁచెను
దారలు ప్రథమోత్థబిందుతతిగతిఁ బరఁగెన్. 120

వ. తదనంతరంబ. 121

చ. తివిరి త్రియామకు న్నొగసు దిద్దికొనంగఁ బురోదిశాళి దా
గవిసెన వెల్వరించు మణికల్పితదర్పణమో యనంగఁ గై
రవకులబంధుమండలము రాజిలె నోలి నిలీయమాన మై
మివులఁ గలంకలక్ష్యతఁదమీప్రతిబింబమునంత నేడ్పడన్.

తే. తామరసలక్ష్ము లాచంపమామ రాకఁ
గలఁగుచును గుముదాలికై తొలఁగె నపుడు
తొలఁగుబావయె కాఁడె తమ్ముల వరించు
సట్టిసతులకు నతఁడు మున్నొట్టిఁ డైన. 123

చ. పనుపడ వేణునాళములఁ బగ్గములం బలెఁ గ్రిందఁ బర్వు శో
భనకిరణప్రకాండములు భాసిలఁ జందురుఁడొప్పె నెంతయు
న్మనసిజుఁ డెల్లప్రాణులమనంబులు చేలుగ రాగబీజముల్
వెనుజతనంబుతోడ వెదఁబెట్టెడు రౌప్యపుజడ్డిగం బనన్.

చ. నెల యను వెండికుండఁ గడు నించి నిశాఖ్యచకోరనేత్ర యిం
పలరఁగ నంబరాహ్వయమహానటమూర్తిమహాభిషేకముఁ
జలుపఁగ నెల్లదిక్కుల వెసం బ్రవహించెడుపాలవెల్లి నాఁ
బొలిచె సమస్తముం జలువఁబొంచననుందతసాంద్రచంద్రికల్.

చ. తొలఁకెడుహంసకాంతులవిధుద్యుతిఁ బ్రోచి చకోరమైత్రి జో
కలు మెఱయించుకన్నవలకల్కితనంబునఁ బుష్పలావికల్
తలఁపులు గొల్లలాడి మిగులం బ్రమయించి యువవ్రజంబుచే
వెల లధికంబుగాఁ గొనుచు వేడుకనమ్మిరి పువ్వు లంగడిన్.

తే. అప్పుడు ప్రభావతికి నొక్కయతివ విరులు
గొనుచుఁ బోవఁగ నందు నింపునఁ జరించు
తేఁటిగమిలోనఁ దా నొక్కతేఁటి యగుచు
నేఁగె మాయాఘనుండు రతీశ్వరుండు. 127

వ. అటమున్న పతిసమాగమోత్సవ సముత్సాహంబునం జేసియప రాహ్ణాంబుననుండియుం గ్రీడాభవనపర్యంకాదిసముచితనూత నసత్క్రియావిశేష సంపాదనంబునకుం దగినపరిచారికలని యోగించుచున్న ప్రభావతిమనోరథం బెఱింగి రాగవల్లరి యతి ప్రయత్నంబున. 128

క. చెలువకు సంపెఁగనూనెం
దలయంటె సుగంధవాసితము లగుచూర్ణం
బుల నలుఁగుఁ బెట్టి గంధా
మలకం బిడి చమురు దిగిచె మజ్జన మార్చెన్. 129

చ. చెలికి మెఱుంగుఁబావడలచేఁ దడియార్చెను ధూపవాసనల్
దలకొలిపె న్ప్రసూనసదలంకృతి మీఱఁగ వేఱువేఱ మె
చ్చు లరసికీలుగంటు జడసుల్లెము ప్రేలుడుఁగొప్పుముూఁడు
మూ, లలబిగికొప్పు పెక్కుగతుల న్నిలిపెం బలుమాఱు
విప్పుచున్. 130

వ. అప్పుడారాగవల్లరి ప్రభావతి నుద్దేశించి. 131

చ. విరిసిన నొక్కయొప్పు నరవీడినవేళొకయొప్పుఁ జిక్కువా
టొరసిననొక్కయొప్పునదియాడ్చినవేళొకయొప్పు వేణిభా
వరచననొక్కయొప్పు ముడివైచినవేళొకయొప్పుకొప్పుగాఁ
బరఁగిన నొక్కయొప్పుఁ గనుపట్టక మానదు నీకచంబులన్.

క. తెఱవా సందిట సందెడు
నెఱివెండ్రుక లాయతములు నీలము లివి యే
తెఱఁగున ముడిచిన నీకుఁ
గొఱఁత గలదె యవియ జట్టిగొను నీవిభునిన్. 133

క. అనుచు విరు ల్కాచబంధం
బునఁ జెరివెడుసఖిని మరలి పొలఁతుక నైచెం
దనచేతిపువ్వుబంతిని
గినుకయుఁ జెలువవ్వఁ గన్నుఁగ్రేవలఁ బొలఁకన్. 134

వ. అంత. 135

తే. అని చెలువ యేటికర్దమం బాదిగాఁగఁ
గలపములభేదములు చనవలసినట్లు
సంఘటించించి కుంకుమచందనాదు
లలఁది నిలిపించుకొనియె మే లరసి యరసి. 136

తే. మృగమదాదులఁ జొక్కఁబో ట్టగిసెయొకు
బొట్టు పూర్ణచంద్ర తిలకంబు నెలవంక
విధమునామము గుమ్మడివిత్తునామ
మొకటి గా దని యొకటి యాయువిద దాల్చె. 137

తే. వెలఁది మట్టెలు పిల్లాండ్లు వీరమద్ది
యలును నందెలు మొలనూళ్లు నంగుళీయ
కంకణాంగదహారతాటంకముఖస
మస్తభూషణములు దాల్చె మార్చి మార్చి. 138

క. ఒక్కొకతొయముసొమ్ములె
పెక్కుదెఱంగు లవి యునికి పెంపున నివి యొం
డొక్కటి మీఱుచుఁ దనప్రభ
నెక్కుడగుటఁ ద్రిప్పిత్రిప్పి యింతి ధరించున్. 139

ఉ. అంచల పట్టొకింతతడ వబ్రపుమంజిడి కొంతసేపుఁ గ్రొ
మ్మించుజరంగుదట్టిఁ గడుమేలిమిమాదళము ల్బవంతు లొ
క్కించుక యించు కంతవడి యింపున నొక్కటి మెచ్చ కొ

క్కటిం, జంచలనేత్ర దాల్చెఁ బ్రియుసమ్మత మెట్లగు నొక్కొ యన్నదిన్. 140

చ. తరుణి రొయికింతసేపు చిఱుఁదమ్ములపుంబసతోడిమోవి మే
గరగరిక న్విరాజిలుచుఁ గమ్మలుఁ దీఁగెయుఁ బూని వేణి కా
సురభితఁ బొల్చి యొక్కపరిశుద్ధపుసైకపుటొల్లె గట్టి భా
సురతఁ గడు న్వెలార్చెఁ బెఱసొమ్ముల కోపమియన్నిషంబు
నన్. 141

వ. వల్లభమనస్సమాకర్షణ కౌశలాకౌశల సందేహంబునంజేసి యెందును మనస్స్థైర్యంబు చాలక మఱియును. 142

ఉ. శ్రీలలితాంగరాగములుఁ జీరలు సొమ్ములు నేర్చి యేర్చి తా
మేలుతరంబుఁ దాల్చియును మెచ్చక మార్చుచు నెన్నిమా
ఱులుం, జాలక దిద్దినట్టిదియె సారెకు దిద్దుచు మించుటద్ద
ముక్, గేలి ధరించి చూచుఁ బరికించుఁ బొరింబొరి సద్మసం
స్కి(క్రి)యల్. 143

సీ. కేళీగృహాంబుముంగిట గరగరిక లా
లోకించు గంధాంబుసేక మరయు
నలుకుపూఁతలపరిమళముఁ బరీక్షించు
రంగవల్లికలతెఱంగుఁ జూచు
సకినలమంచంబుజాడ విమర్శించుఁ
గుంకుమపరపుభంగులు గణించు
హారాంబట్టుతలగడయొప్పు విచారించు
నగరుధూపములసోయగము లెంచు

తే. నలరుటోవర్లు మేల్కట్లు నంగరాగ
పూర్ణపాత్రికలును గంధవాడిబరణులు
జాలవల్లిక లాదిగా సముపభోగ
సాధనశ్రీలు పరికించు సారె కబల. 144

వ. ఇట్లు వర్తించుచున్న యన్నీలవేణి యాపుష్ప లాదరంబునం బుచ్చుకొనియె నట్టియెడ నిట్టు నట్టుఁ జెవరి పఱచుతున్మెద పదుపుపొది వదలి యొదిగి యదుకుమారుం డక్కుమారిక నవరించు శ్రవణోత్పలంబులోనం గాన రాకుండ నడంగి యుండె నప్పు డప్పడంతి ముప్పిరిగొనురాగవేగంబునఁ బ్రియా గమనవిలంబంబు సహింపలేక బహిఃప్రాణంబు లన నొప్పు శుచిముఖీరాగవల్లరుల నేకతంబునకుం బిలిపించి శుచిముఖి కి ట్లనియె. 145

శా. రాఁడయ్యెన్ హృదయేశుఁ డీహృదయభారం బెట్లు సైతున్ క్షణం, బేఁ డైయున్నది యేటికిం దడసెనో యేవిఘ్నము ల్పుట్టెనో, నేఁ డేతెంచు ప్రయత్న మున్న నకటా నీతోడఁ జెప్పండె యె, వ్వాఁ డీరీతి యెఱింగెనో యపుడు నన్వాక్రు చ్చి య ట్లాడఁగన్. 146

శా. ఆహా యప్పటికట్లు న న్నలఁచె గా కంతగపురంబు ల్పదు గ్రాహంబుల్ పెఱవారికెట్లు చొర శక్యంబై నఁగానీ కదున్ మాహాత్మ్యంబున మేటియంటి వతనిన్ దౌవారికాత్యుగ్రస న్నాహంబెక్కుడనుండు రావలసినన్రాలేఁడె యెట్లేనియున్.

క. వత్తు నవశ్యము నేఁడని
చిత్తము తమి రేఁచి యంత జింత యొకతెపై

హత్తిన నది వృథపుచ్చినఁ
బుత్తురు మగవారిమాట పొసఁగదు నమ్మన్. 148

క. అనఘాత్మకుఁ డతఁ డాతని
నన నే మున్నది మదీయ మైనయదృష్టం
బను దూఱుట గా కెట్లది
యొనర్పు నున్నదియొ చంద్రికోగ్రదవాగ్నిన్. 149

వ. అని చంద్రు నుద్దేశించి. 150

క. నీశైత్యము నమ్మితి న
త్యాశన్ హిమధాముఁడును సుధాంశుఁ డనంగా
నోశశధర యేలా ఘృత
కోశాతకి వయ్యె దేమి గూడెడు దీనన్. 151

క. చలువ యొనరించినంతయు
ఫల ముష్ణత విడువు మిదియ పదివే లింకన్
జలిపందిలి పెట్టుట కద
వలఁబో మొత్తమియె మాకు వనజాక్షాక్షీ. 152

సీ. శ్యామకంఠలలాటసామీప్యపరితప్య
మానంబులుగఁ గళల్ మార్చి మార్చి
సింధూదకాంతస్సమింధనబడబాన
లోగ్రకీలల సెగ నూని యూని
ప్రత్యమావాస్యసంభవదర్కసంయోగ
కలితాధికోష్ణిమఁ గ్రాఁగి క్రాఁగి
విప్రయోగోష్ణపాంథప్రాణపరిపాన
భూష్మజం బగుకాఁక పొంది పొంది

తే. కాలకూటాహ్వయభ్రాతృపాలు పట్టి
పుచ్చుకొనుదాహకత్వంబు ప్రోచి ప్రోచి
యింతవేఁడిమి సాధించితేమొ చంద్ర
నన్ను నేఁచుటకే ప్రయత్నంబుతోడ. 153

చ. ప్రథమకళ ల్నెలనెల నుపాయన మిచ్చుచు వహ్నిసూ
ర్యులకు,బృథుతరమైనమైత్రిఁ గడుఁ బ్రీతులఁజేయుట యీ
దృశోక్షిమ, ప్రథమఫలీభవద్విరహిబాధకె కావలయు న్న
శాంక యీ,పృథివి నధర్మి కెన్నఁ బరపీడయె యుత్తమలాభ
మెప్పుడున్. 154

చ. చలువయె భ్రాంతిమూలము నిశాకర యింకొకఁ డెన్నిచూ
డఁ గే,వలమును వేండ్రపుం బ్రకృతివాఁడవ యె ట్లనిసం జ
కోరముల్, వెలయుఁ గడంక నీయుడుకువెన్నెల జొబ్బుచు
దానఁ జేసి కా,కలవడ శైత్యము ల్మరగినట్టివి నిప్పులమేఁత
కోర్చునే. 155

మ. ఇటుగా కొక్కొక కాలదోషమున నా నేమో విపర్యాసమ
న్నిటియందు న్మలయానిలుఁడు నిదిగో నెమ్మేనికిం జాల ను
త్కటతాపం బొనరింపఁజొచ్చె నిదియుం ద్వచ్చంద్రికాజాల
సం,ఘటనాదౌష్ట్యము రాజధర్మ మనుచుం గ్రౌర్యంబుఁ దాఁ
బూనెనో. 156

వ. అని దక్షిణానిలు నుద్దేశించి. 157

క. తలఁప జగత్ప్రాణుఁడవై
వెలసిననీ విట్లు నన్ను వేఁచుట తగునే
యిల వెలుగు చేను మేసిన
మలయానిల యొద్ది కాఁపు మదిఁ జింతింపన్. 158

వ. అని యతని వేఁడిమి మాన్పుటకై యనేకప్రకారంబులం దూఱియుం బ్రార్థించియు గుణంబు గానక విసివి యి ట్లనియె. 159

సీ. అంతకాశాసమాయాతత్వ మరసినఁ
జలువకు నీకును జాలదవ్వు
రౌద్రమూర్తిత్వవార్తలు విచారించినఁ
జలువకు నీకును జాలదవ్వు
దహనసారథ్యతత్పరత భావించినఁ
జలువకు నీకును జాలదవ్వు
శ్రీఖండవిషధరోచ్ఛిష్టత యెంచినఁ
జలువకు నీకును జాలదవ్వు

తే. పలుకు లేటికి నీయందు మలయపవన
చలువ గల దనునట్టిసంశయము దగదు
వసుధ నెందైనఁ జండాలవాటిలోన
బ్రాహ్మణగృహంబు వెదకుట భ్రాంతి గాదె. 160

ఉ. దక్షిణగంధవాహ నినుఁ దన్మలయద్రుమరూఢగూఢపా
ద్భక్షణనింతకెంతయు నపాయముపొందదె పొందకుండఁగా
నిక్షుశరాసనుండు విరహిశ్వసితోపచయక్రియ న్నిము
త్తక్షయుఁ జేసెఁగావలయుఁగాక తదుష్ణతనుష్ణమెక్కఁగన్.

వ. అని మలయసమీరు నుపాలంభించి. 132

శా. పాథోరాశిగభీరు సద్వ్రతరణప్రాగల్భ్యమందారు భూ
నాథాస్థానవిధేయవర్తను నపైనగపద్ధతీవర్తనుఙ్
యాథాతథ్యవిధప్రయోగవివిధోపాయార్జితద్విణ్మదో
న్మాథఖ్యాతసునీతికౌశలు నసన్మార్గచ్ఛిదాపేశలున్. 163

క. వ్యాచక్షాణసుధీజన
వైచక్షణ్యోదయాభివర్ధన వైద
గ్ధీచుంచురనిజకృతమై
త్రీ చుంచువిశృంఖలాష్టదిక్చరకీర్తిన్. 164

మాలిని. అమలమప్రియసూనుఁ యామినీశోపమానుఁ
గమలభవమనీషుఁ గణ్యవాక్ప్రౌఢిశేషుఁ
శమదమగుణనిష్ఠుఁ శాస్త్రచింతాగరిష్ఠుఁ
బ్రమథపతిసుభక్తుఁ బ్రహ్మవిద్యానురక్తున్. 165

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతంబైన ప్రభావతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీ ర స్తు

# ప్రభావతీప్రద్యుమ్నము

## పంచమాశ్వాసము



శ్రీఫలతులసీసక్తుష
లాఫుల్లజ్జాతివిచికిలప్రముఖద్ర
వ్యాశ్యఫల్గుకృతేశ్వరపూ
జాఫలచిద్ఘణుఖ్య నమరసచివవరేణ్యన్. 1

వ. మన్మథు నుద్దేశించి యాకన్యకాతిలకంబు. 2

ఉ. భూనుతలీల రుక్మిణికిఁ బుట్టి మనోభవ మత్ప్రియత్వముం
బూనినవాఁడ వీవయఁట పూర్వపునీయతనుత్వధర్మముం
మానక యేఁచుచున్న నదిమామకభాగ్యమునిన్నెటాడఁబోఁ
గా నెటు వచ్చునో తడవఁగావెఱతుం గరముల్మ్రాగిడ్చెదన్.

వ. అని పలుకుచున్నప్పు డంతకంతకుం బెల్లయిన యాయల్లక
భరంబునం బెల్లగిల్లునుల్లంబు తాల్మి నిల్వరింపం జాలక
యబ్బాలాలలామంబు. 4

తే. నాఁడె చనకుండ లేఖఁ బ్రాణములు నిలిపి
యంత భరపడి వచ్చి నేఁ డాత్మవీక్ష
నోర్వరానినాతమికి న ట్లొనరఁ బలికి
ప్రియుఁడు తుద నిట్లు విడిచె నన్నియును పృథగ. 5

మ. అనుచుం జెప్పలు తేలవైచుచు విశుష్యత్కంఠయై రుక్మిణీ
తనయా మీఁదట నైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ
యను పల్కించుక నాలుకం దడుపుచుం బ్రాణార్తి దీపింపఁ
జయ్యనఁ బూఁబాన్పువ్రాలఁ బోవుటయు మీనాంకుండు
చిత్రంబుగన్. 6

వ. సంభ్రమంబునఁ గర్ణోత్పలంబువెలువడి నిజరూపంబుతోడ. 7

క. హా తాలిమి వదలెదు సు
మ్మే తెంచితి యున్నవాఁడ నిదె నీపతి న
న్నో తరుణి చూడు మని తా
నాతల్పమునందు నిలిచి యక్కునఁ జేర్చెన్. 8

మ. అతిశీఘ్రంబున నాలతాంగియుఁ దదీయాలింగనస్పర్శనా
మృతసేకంబున మూర్ఛదేఱుచునె యు న్మీలన్మహానందమూ
ర్ఛితయయ్యెంగామగుడం బదంపడి మదిం జేష్టలనింపంగఁ దా
బతిఁ గం జెప్పలు విచ్చి చూచి భయకంపస్వేదలజ్జాత్తయై. 9

క. చిరకాంక్షితనిజపరిరం
భరసస్థితిఁ జొక్కి యున్నపతిచేతులు స
త్వరత విడిపించుకొని యో
వరిలోనికిఁ బాఱి పోయె వనజాక్షి వడిన్. 10

వ. ప్రద్యుమ్నుండును శుచిముఖిరాగవల్లరులం జూచి యి
ట్లనియె. 11

ఉ. సర్వాయువాధికుం డనుయశం బెసఁగు న్నను నేలికొన్న మ
త్పూర్వసమస్తపుణ్యఫలభూమిక మీచెలి యీవిలంబమే
నోర్వమిఁజూడకిట్లరుగుటొప్పునెతోడ్కొనిరండుపోయిగాం
ధర్వవివాహలీలకు ముదమ్మున మీరలె పెండ్లిపెద్దలై. 12

వ. అనిన విని రాగవల్లరి నవ్వుచు నతనిం జూచి. 13

చ. తనవిరహాసహిష్ణుతవిధం బఖిలంబును నీవు వింటి గా
యనయము నాడుకోఁగ నిపుడంచుమనంబున నెత్తుసిగ్గునన్
మునుఁగుచుఁ గుందుచున్నదియె ముద్దియనీతమకం బెఱింగి
ని, ల్వానితెఱఁ గొక్కతప్పుగఁ దలంచెదు సూ చతురుండ
వన్నిటన్. 14

వ. అని పలుకునంత నతనికి శుచిముఖియు ని ట్లనియె. 15

ఆ. నీవు సకలనాయికావిశేషస్వభా
వములు నెఱిఁగినట్టివాఁడ వైన
నాకుఁ దోఁచినంత యాకన్యచిత్తంబు
విధము నీకు విన్నవింతు వినుము. 16

ఉ. తాఁ గడు వేగిరించెఁ గద తద్గతి నీవు నెఱుంగ సిగ్గునన్
లోఁగుమ నింతనుండి యిఁక లోనుగ నొల్లక పట్టఁబట్టఁగా
నేఁగుచుఁ గోరు నీబలిమి నీప్సితసిద్ధిగ వీఁపు గాన రా
డాఁగుట దీనిపేరు నిబిడం బిది బాలిక కెల్ల నాత్మలోన్. 17

వ. కావున నప్పుడుచు త ప్పేమి గలిగిన నదియు నొక్కయను
రాగవిలసనవిశేషంబ కా నెఱుంగుకొని యనుగ్రహంబు వద
లక పరిగ్రహింతుగాని వే ఱొండుగఁ దలంచెదు సుమీ
యేము పోయి యాముద్దియకు బుద్ధి చెప్పి యెత్తుకొని
వచ్చెద మని రాగవల్లరియుం దానునుం దత్సమీపంబునం
దెరమఱుంగున నుండి తమపలుకు లాలకించి వినుచున్న
యన్నెలఁతపాలికిం బోయి యల్పస్వరంబున ని ట్లనియె. 18

ఆ. తలిరుఁబోఁడి మంచిదానవు గలిగి తి
ట్లరుగు దెంతురమ్మ యధిపుమనసు

విరస మయ్యో నేని వెర వెద్ది మఱి చక్కఁ
జేయ నీవ చింత చేసి చూడు. 19

వ. అనిన శుచిముఖికి రాగవల్లరి యి ట్లనియె. 20

క. అప్పటి క ట్లరు దెంచుట
త ప్పన రా దంత మనము దండ నునికిఁ దా
నప్పడుచుఁదనము మానక
యిప్పుడఁటుక యంత వెఱ్ఱియే యిఁకఁ జేయన్. 21

వ. అని ప్రభావతి నవలోకించి. 22

క. వరుఁడు సమాగమ కాంక్షా
త్వరితపడుచు నుండ నిచటఁ దడయుట తగ దో
వరవర్ణిని రార మ్మొక
సరవిని దమి యుండ వెల్ల సమయములందున్. 23

వ. అని కేలుపట్టి తివియఁబోయి యాలజ్జావతిచేత విదుల్పులం
బడి నగుచు నిట్లనియె. 24

క. ఏరీతిం బెనఁగిన నె
వ్వా రెఱుఁగరు నీదుగుట్టు వనితామణి రో
ళ్లారోఁకండ్లం బాడిన
కూరుము లిపు డింత దాఁచుకొన్న నడఁగునే. 25

వ. అని వెండియు నతిప్రయత్నంబున. 26

సీ. విభుఁడు దండనె యిది వినుచున్నవాఁ డెంత
గబ్బివే యిది లజ్జక్రమమె యనియు
నతఁ డిది సరకు సేయమిగ భావించిన
నపు డేమి యగుదు వీ వబల యనియు

రసికశేఖరుఁడు సర్వజ్ఞుఁడు ప్రియుఁడు నీ
కొలఁదిన నడుచు భీతిలకు మనియు
నతిగోప్య మీశుభావాప్తి దీనికి నింత
తడయు టొప్పమి యెట్లు దలఁప వనియు
తే. మఱియు నెన్నియొ బిసిబిసిమాట లమరఁ
బ్రియము చెప్పియు నదరవైచియు హితాను
వృత్తిఁ దెలిపియు నొకకొంత మెత్తఁబడఁగఁ
జేసి కేల్వట్టి తిగిచె నాచెలువఁ గదల. 27

సీ. తిగిచిన రాక యీడిగిలం బడుచును ల
జ్జాలసత్వమున మల్లాడి యాడి
నిలునిలు మొకమాట గల దని నిలిపి ప
ల్కుట కేమియును లేక గ్రుక్కి గ్రుక్కి
యడుగడుగునకు నత్యంతనిర్బంధంబు
సలిపెడునందాఁక నిలిచి నిలిచి
తెరువున నర్గళాదిక మేది చేతి కం
దినఁ బట్టువిడువక పెనఁగి పెనఁగి
తే. యిందుబింబాస్య కడు నలయించెఁ జెలిని
విసివి పోదుగదా యనువెఱపు నొదవ
విభునిమూతనసంగమవేళఁ గరము
వక్రములు లో పడంతులవర్తనములు. 28

క. ప్రకృతిజ్ఞయు హితనిర్వా
హికయు నగుట నల్ల నల్ల నేనుఁగుఁ గంబా
నకుఁ దిగిచినట్లు యత్నా
ధికతం జెలి తెచ్చె నాసతిం బతికడకున్. 29

వ. ఇట్లు తెచ్చి. 30

క. అనయము చేరిక యగుతఱి
నవివాక్యవ్రీడ భయభరాకులగతి యై
తనవెనుక నొదుగ నొదుగఁగ
వనితామణిఁ దేర్చి తేర్చి వల్లభుఁ జేర్చెన్. 31

వ. ఇట్లు దగ్గఱఁ దెచ్చి యజ్జలజాక్షి యత్యూర్జితసముజ్జిహాస
దుర్జయలజ్జాసముద్వేగవేగయు నుద్దామరోమహర్షణస్వేదో
ద్భేదసాదితప్రకృతిమకరికాపత్త్రాంగరాగయుఁ బురస్స్థితిపరి
త్యాగయత్నసంక్షోభసంచలీభవదుత్తరీయపార్శ్వపునఃపునరా
లక్ష్యమాణవక్షోజకుంభతటవిజృంభణాభోగయు నగ్రదృష్టి
ప్రసారపరిహారనియమనియతకటాక్షసంచారచారుకర్ణగోళకా
లంకషలోలలోచనద్రాఘిమశ్లాఘనీయముఖపరావృత్తి పొసఁగ
పున్నాగధన్యాయితోభయోపాంతభాగయు నైన యెలనాగం
జూపుచు నాపురుషరత్నంబుం గటాక్షించి. 32

చ. పడఁతులచక్కి లిట్టివి నృపాలకుమారక నేఁటిదాఁక గు
ట్టెడలఁగ నీదుకూటమియపేక్షఁ బడం గలపాటు లెల్లఁ దాఁ
బడియిపుడిష్టమబ్బుతఱిఁ బాఱుచుఁదాఱుచు నేక్రియంబె
నం, గెడఁగనుఁగొంట యంచు జెలికేల్గదియించె రతీశు
చేతితోన్. 33

క. ప్రమదంబున రాకొమరుఁడు
కమలాక్షిఁ బరిగ్రహించె గాంధర్వవివా
హానుచే నయంముహూర్త
స్సుముహూర్తోఽస్తంచుఁ గెలన శుచిముఖి నవ్వన్. 34

క. అప్పు డింపుకతడ వనో
న్యపాణిసంస్పర్శసంభృతానంద స్తం
భపరీతాత్మత నుండిరి
ప్రపంచ మంతయును మఱచి పతియు న్సతియున్. 35
వ. తదనంతరంబ. 36
క. తనరెడులజ్జాభయవా
సన లుద్బోధమునఁ దనర సతి కనుఁగొని మె
ల్లన నిలుఁ డని యాన లిడఁగ
జని రోకొకనెపముఁ జెప్పి సకియ లిరువురున్. 37
వ. అప్పుడు ప్రద్యుమ్నుండు. 38
క. నిలువక యిటు పోచున్నా
రలికుంతల చెలుల నేల యానవొడిచె దేఁ
జెలికాఁడఁ గానె యనిపై
దలి చెవిలోఁ జెక్కు చెక్కుఁ దార్కొనఁ బలికెన్. 39
వ. అప్పుడు. 40
చ. ఉవిద తదుక్తి కంత చెవి యొగ్గక పోఁ బెనఁగ న్విభుండు కే
ల్దవిలిచిచుట్టు నించుకయెడఁగ భుజముల్వాలగొల్పి పొమ్మనఁగ
సువదన వెల్వడం దిరుగ శ్రోణిభుజ స్తనవేణికాధర
శ్రవణకపోలముల్పతిని సారెకు సోఁకుచుఁ దేల్చె నింపులన్.
వ. అంత. 42
చ. నళినదళాక్షి సిగ్గరితనంబు గదా యని యింత చెల్లునే
యలయఁబెనంగితంచు విభుఁ డంగనహస్తము పట్టి నిల్పి చె
క్కిలి మిగులం జెమర్పఁ బులకింపఁగ ఘర్మకణావళు ల్నఖం
బులఁగొనిపాఱమీటుచునుబొల్పుగ మేనిమిరెం గరంబునన్.

సీ. మఱియుఁ గపోలచుంబనసమీపతయాస
        రి త్తమంతనము సారెకు వచించి
యభివీక్షణేచ్ఛ నవ్వ్రాససం బెగనెత్తి
        కొనగోళ్లఁ బలుమఱుఁ గురులు దువ్వి
చనుగుబ్బ లంట ముచ్చట పడి మాటికిఁ
        బయిటపై నెరసులు పాఱ మీటి
గనయంబు ముట్టుటకును జేరికలుగ వే
        మాఱును మొలనూలిముడులు దడిచి
తే. బెద రుడిపి వ్రీడజాడ్యంబు వదలఁ జేసి
కాంత నొగి మెత్త మెత్తనఁ గౌఁగిలించె
నీవి తనయంతటనె జాఱె నెయ్య మెఱిఁగి
పాణిఁ జెక్కిలి నొక్క చుంబనము చేసె. 44

వ. తదనంతరంబ. 45

ఉ. శౌరిసుతుండు బాలికను శయ్యకుఁ దార్చి యపీక్ష్య యత్నత
ద్వారణాసంప్రబుద్ధరసతం దరితీపుగ మించుబాహ్యనా
నారతభోగలీలల మనంబునఁ జొక్కుచుఁ జొక్కఁజేసెఁబో
తారతమల్పమల్పముగఁ దన్మతి యోర్పుకొలందిఁ జేయుచున్.
తే. సౌరభమె చిక్క లోనికి జాఱె నొక్క
రాయిడికిఁ గాక బహిరంగరాగ మెల్ల
ననఁగ నినుమడించుచు నంతరంగరాగ
మలరఁ బెనఁగిరి దంపతు లతులరతుల. 47

వ. ఇవ్విధంబున. 48

చ. స్వకుతుకపూర్తిగాఁగ రతి సల్పి సుషుప్తివహించి రంత నా
యికయును నాయకుండుఁదమయిద్దఱియంగములున్విమిశ్రభా

వకలనఁ జిక్కుఁజీరుపడ వైచినచంపకనీలకంజమా
లికల తెఱంగునం బరఁగ లేఁజెమట ల్నునుఁగాలినాఱఁగన్. 49

వ. అంత. 50

క. అరుణాంశుపటలి యనువా
సరరాజపురోధృతధ్వజంబుకొనన్ వి
స్ఫురిత మగురత్నమో యన
సురపతిదిశయందు వేగుఁజుక్క వెలింగెన్. 51

చ. యదుకులచూళికాభరణమంతట మేల్కని నిద్ర చొక్కునన్
వదలినకౌఁగిలిన్మెలపునన్ బిగియించుచుఁ జెక్కు చెక్కుటన్
గదియఁగ నొత్తియొత్తి తన కాంతను మేల్కొలిపెన్ మృగా
క్షియున్, నిదుర దొఱంగి చూచుచునె నేత్రము లెప్పటి
మూసె సిగ్గునన్. 52

సీ. అంతఁ గామిని కన్ను లరవిచ్చి సురతసం
క్షుభితవేషము పతి చూడకుండఁ
దనదుచెక్కిలి మొగంబున కడ్డముగఁ జేర్చి
పొరిఁ బొరి నది దాన పులకితముగఁ
గెంగేల నతనికౌఁగిలి యూఁగి యెడగొంచుఁ
జేలాంచలము పెఱచేతఁ దడవి
తెచ్చి పాలిండ్లమీఁదికిఁ జొనుపుచు నితం
బావృత్తి యరపి రెండవచెఱఁగు

తే. కటితటం బెత్తి యొత్తి క్రిందటికిఁ బరపి
లోనుగా దానిపై యంచుతో నమరఁగఁ
బొక్కిలి గదించి పట్టె మూపున నరవిరి
వదలుతురుమానుకొనుచు లేవంగఁ గడఁగె. 53

క. ఈచాడ్పునఁ బానుపుపై
లేచుచుఁ గడు నింపు గులుకు లేమవిలాస
శ్రీచేఁ జిత్తము గరఁగఁగ
నాచెలువుఁడు మగుడఁ బెగిచి యక్కునఁ జేర్చెన్. 54

వ. తదనంతరంబ కార్యాంతరచింత చిత్తంబునఁ బొడమఁ దన వదనంబు ముకుళితచెవిం గదియించి యోయువిద యిది మొదలుగ మాపు లెల్ల నిచ్చటికి వచ్చెదఁ గాని తేపులు దప్ప కుండ నూవిడిచిన యుండ కున్న రహస్యభంగంబు పుట్టిన మనమనోరథంబు విఘ్నాకులం బగుంగావున నిక్కడ నుండి మదీయనివాసంబు దాఁక భూవివరంబు గల్పించు కొని పోయెదఁ దద్ద్వారం బన్యుల కెఱుకపడ కుండునట్లుగ సంవరణంబు గావింపు మని చెప్పి యప్పలుకులకు నాలజ్జావతి యంగీకారసూచనంబుగాఁ దల యెగుర వైవ నుక్త ప్రకారంబున నిజనికేతనంబున కరిగెఁ బ్రభావతియుఁ దద్బిలంబు తగు తెఱంగున సంవృతంబు గావించె నంత. 55

మ. సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు 'వివిధచ్ఛంద స్త్రియామాంత
రం,తిమయామో భగవా న్నృషిః కుసుమధన్వీ దేవతా
మానినీ,రమణాయాం వినియోగ' యంచు నిది యారంభిం
చెఁ గాఁబోలు నా, నమరెం దద్ధ్వని మానినుల్ రతికిఁ దా
మై నాథులం బైకొనన్. 56

వ. మఱియు నాసమయంబున వాసరప్రత్యాసత్తినిమిత్తవిరహాశంకాసముంకురితసంతాపంబున లోపలిపట్టు వదలి వెలికి నిర్గమించు నిఖిలకాముకద్వంద్వసముదయహృదయంబులచలువలం ద్రోవ యడ్డగించి గడ్డురికి యాక్రమించెనో

యనఁగఁ దనరారుచు హారవమార్తికంబు లత్యంతశైత్యం
బునం బ్రవర్తిల్లె నచిరభావియైన భావజవశంవదస్త్రీపురుష
పరస్పరపరిరంభవిశ్లేషఖేదవేదనాప్రాచుర్యంబు సూచించు
భంగి నొండొంటియంటు విడిచి బిరుసెడలినదళంబులతో
నతివిరళం బగుచు మేల్కట్టుపువ్వుదండలుం దమయంతస్థ
ణంబులకొలఁది విశదంబుగాఁ దెలిపె ననోన్యసన్నిధిం
జెన్ను మీఱు దంపతు లింపుసొంపున నాదరింపం బెంపొందు
సౌభాగ్యవైభవంబు నేఁటి కిదియకదా యనుహ్రాసయా
త్సుక్యవిలసనవిశేషంబునం బోలెఁ దాంబూలంబు లచలి
తంబుగా రుచులప్రచురతం బచరించెఁ బ్రచురసురతంబులఁ
జరించు సుద్దామయావనమదమదనమత్తమత్తకాశినీమణుల
మణితరణితంబులజోక లేక సంతన గ్రహించి యంచిత
ప్రౌఢదక్షతం బరీక్ష యిచ్చుభావ మూవహిల్ల గృహ
శారికాకీరపారావతకులంబులును గలకలితలయలలితకలకాకు
భావంబు దులకించుకులుకుబెలుంగుఁ గలకలికిపలుకుల
వికలంబులుగాఁ గులుకరింపదొరకొనియెఁ బ్రతికలనవనవా
యితప్రౌఢియువమిథునరతిపరిమళంబులఁ గలపడంబయి
పొలువెసఁగవికసనారంభశుంభదంభోజ ముకుళసుకుమార
సౌరభంబుసారెకు వెదచల్లుచు నల్లనల్లన సంచరించు చల్లకరు
వలిబలంగములు తెరువరులతనువుల నవిరళముగఁ దల
కొనం బులకాంకురంబులు మొలపించుగతదివసావసాన
సమయంబున జిగీషితదేశాంతరుండైన భాస్వంతుచేత నాత్మ
తేజస్సమర్పణానల్పలాలనాపురస్సరంబుగా నియోగింపంబడి
యుం దమతమయున్న భవనంబుల నివసించుకొంచెపుఁజీఁకటు

లనేకాని నానాతమోనీకంబులం బోకార్ప లేనితప్పు
గలిగియున్నయవి గావున నావేళ కాసన్నం బయిన యా
వాసరాధీశురాక యాకర్ణించి కార్యవైకల్యంబున నాకుల
త్వంబు నొందునో యన నేవు దఱిగి దీపకళికలు వెల
వెలంబాఱె విక్రమవిహారంబు ముగియించి గవుసెనఁ
బొదివిన కుసుమకోశంబు వెండిజల పోఁత దళుకు టరిగ
తెఱంగున మెఱుం గడంగి యుడురాజమండలంబు
మాఁగుడువాఱె కానిపించెఁ బొల్లి నిజసంతతి హితార్థిని
యై సురభి ప్రార్థింప నిలింపవిభుం డమృతం బిడుట
ప్రత్యక్షం బయ్యెనో యనునట్లుగా దట్టం బగుచు శాద్వల
ప్రదేశంబులం బ్రకాశించుముక్తాఫలస్థూలప్రాలేయబిందు
బృందంబు పశ్చిమరాత్రిగోచరప్రచార్యమాణపశునికరం
బులచేతఁ గసవుతోఁగూడ గ్రసింపంబడుచు నుండ గగన
ముకురపరిదృశ్యమాన తదీయ ప్రతిబింబ విభ్రమ దృఢీ
కారపారీణంబు లై తారకంబులు క్రమంబునం బలుచగాఁ
దొడంగెఁ బ్రాబోధికంబు లైన భూపాలదేవగాంధారి
ప్రముఖరాగా భోగసౌగంధ్యబంధుర గాంధర్వనాదమేదుర
మృదువాద్య విశేషపోషిత సూతమాగధాది క్రియమాణ
స్తుతిపాఠరవంబులు ప్రభుద్వారంబులఁ దోరంబు లై సొంపు
మీఱె నపరరాత్రస్వాధ్యాయాధ్యయనశబ్దస్థానంబుల నైన
యాదేశంబులుంబోలె నిర్భరక్షీరభారభిద్యమానపీనాపీన
స్వార్యమాణతర్ణకోపసరణారణాక సంభ్రమసముదితసముత్థాన
ధైనుకగంభీరహంభారవంబులు విజృంభించెఁ జంద్రాస్తమయ
సంభవక్లేశభవపరిఘూర్ణార్ణవధ్వానంబు పెక్కువను వెక్కి

రించినట్లు మిక్కిలి నక్కజపుబాహుళ్యంబు నెఱపుమహా
సందోహదోహనిస్స్వానసాహచర్య సమధికదధిమథనవిధివిహి
తఘుమఘుమఘోషంబులందు గండూషితదిక్కంబు లగుచుఁ
బిక్కటిల్లె నప్పుడు. 57

సీ. మును విలూనం బైనయినపాదపము మొదల్
మగుడఁ జిగిర్చినచిగు రనంగ
గతనిద్రశక్రేభకర్ణతాళానిలే
రితకుంభసిందూర రేణు వనఁగ
ధ్వాంతజాలముమీఁద దండెత్తుభానుమం
తునివెలిగొల్లెనతోఁ పనంగ
మార్తాండపథరోధిమందేహజలపదో
ద్ధుతపూర్వనగధాతుధూళి యనఁగ
తే. వనజరంగస్థలిని నాట్యమునకు వచ్చు
సిరికిఁ బట్టిన కెంబట్టుతెర యనంగఁ
బ్రాగ్దిశాలిప్తఘుసృణాంగరాగ మనఁగ
మెఱసె నరుణోదయపుదీప్తి మింటికెలన. 58

చ. అనుదితసూర్యహోమము లగుయజ్వలప్రజ్వలదగ్నిదీప్తులో
ద్ద నమరుసోమిదమ్మలమిథఃకషణోల్లసితస్తనంబులన్
దనరుచు గేలి చేసెఁ గడుఁ దత్సమయాప్తపరస్పరోపగూ
హానరసరంగదంగకరథాంగపతంగతతారుణద్యుతిన్. 59

ఉ. ఏఁ గలలోన నొం డెఱుఁగ నీవె విభుండవు సందియంబు నా
పైఁ గలదేని చూడు మని ప్రాగ్దిశ గౌతమదారజారునిన్
దాఁ గడు నమ్మఁ జేయుటకుఁ ద్రాఁగఁగ నెత్తెడునట్టియొఱ్ఱగాఁ
గాఁగినమడ్డుచంద మెసఁగం గనుపట్టె నినుండు నుష్ణతన్. 60

వ. అప్పుడు. 61

సీ. బిగువుఁగౌఁగిళ్ల చేఁ బ్రియుబాహువుల లొత్తి
కుమ్మెలు వోయినకుచతటములు
వరుమేన నొఱసి పోవఁగఁ జిట్లినట్టిగం
ధపుఁబేంట్లతో నొప్పునఖపదములు
రమణుకుండలపీడనముల రేఖలు మాయ
కలరు చున్నకపోలఫలకములును
బ్రాణేశదశనకోరకశిఖాసంపర్గ
మునఁ గందినట్టికెమ్మోవిసిరులు
తే. నిలువుటద్దాల చేరువ నిలిచి నిలిచి
పలుమఱును జూచుకొనుచు నాబాగు సడలఁ
జేయఁ జాలక తడసె దైతేయకన్య
ప్రాతరుచితాంగసంస్క్రియాపరత లేక. 62

వ. అంత నచ్చటికి శుచిముఖరాగవల్లరు లరుగుదెంచి యాచంచ
లాక్షి యున్న చెల్వు దవ్వుదవ్వుల నవలోకించి నవ్వుచు.63

ఉ. పుక్కిటిచిత్తములం బుమియు బ్రాద్దునుగాదొకదమ్మ నేఁడుమా
యక్కకు నిప్పుడిట్లిటఁ బ్రియంబునఁజూడఁగఁగల్గెఁ జాలుమా
కిక్కడి కేఁగుదెంచుట నభీష్టరతి న్వసివాళ్లు వాడునీ
చక్కనిరూపము న్నిదుర చాలనికన్నులుఁ జిట్లుగందమున్.

వ. అనుచు డగ్గఱ నేతెంచి. 65

సీ. పలుగఱ సేయక పసుపును నలిపించు
కొనక మొగంబుమజ్జనము లేక
పరిశుద్ధవస్త్రంబు ధరియింపక కచంబు
లొగిఁ జిక్కు పుచ్చి క్రొత్తగ ముడువక

ప్రత్యగ్రతిలకధారణ మొనర్పక నవీ
నముగఁ గాటుక లోచనముల నిడక
తగునట్టిసొమ్ములు దాల్పక దినముఖ
నియమపుణ్యంబు లెవ్వియుఁ జలుపక
తే. నీవు తడయుట చోద్య మోనీరజాక్షి
ఘనము గాఁబోలు శ్రమ మట్లు గాక రతుల
చిన్నె లింపునఁ జూచుకొం చున్న దాన
వే మొ విఘ్నమై వచ్చితి మెఱుఁగ కేము. 66

వ. అని పరిహాసగర్భంబుగాఁ బలుకుచు లజ్జారోషభూషితంబు లయినయా రోషారత్నంబు చేతియదరుపేఁతలు తమకు నూతనోత్సవంబు లగుచుఁ గౌతుకం బొనరించుచుండఁ బ్రవర్తిల్లుచున్నంతఁ జంద్రవతీగుణవతు లటమున్న నిజవల్లభసమాగమంబునకు నుపాయంబు గానక శుచిముఖితోడి విచారంబు గోరుచు నుండుటం జేసి యమ్మరాళిఁ దమనిలయంబున కెలయించుకొనిపోవుటకు నుద్యోగించి ప్రభావతీదర్శనమిషంబున. 67

క. లలితప్రియసంభోగా
కులవేషము చక్క దిద్దుకొన నెడ లేమిం
గళగళ పడుచుఁ బ్రభావతి
యలుక నతర్క్యగతి వచ్చి రచటి కిరువురున్. 68

సీ. ఈతెఱంగున వచ్చి యాతరుణీమణి
చందంబునకుఁ గొంత సందియంబు
మదిలోనఁ గందళింపఁగఁ గ్రమంబున విమ
ర్శించి తదాకారచేష్టితముల

కతమునఁ బురుషసంగతికల్మిఁ బడిలంబు
గా నిశ్చయించి యక్కాంతమీఁద
భావసంసూచనపాండిత్యగంధివి
లోలకటాక్షావలోకనముల

ఆ. కలిమి మొలకనగవుతళుకుతోఁ బలుమఱు
నగుచు నొకరొకళ్ల మొగము చూచి
యంతఁ గసినయప్డు మాప లే కి ట్లని
పలికి రాసఖి విన జలజముఖులు. 69

ఉ. ఎంతయు మేన వింతపస లేర్పడుచున్నవి యప్ప గంటె య
త్యంతము నిద్ర చాలమియు పక్షులు తెల్పెడు రాత్రియొద్ద
యోఁ కొంతవిశేష మబ్బినది కోమలికి న్నముబోఁట్లకుంగడుః
సంతసమేకదా తనమజన్మన మెవ్వలన న్ఫలించినన్. 70

వ. అని మర్మంబు వాఁక నాడుచు నాప్రీడావతి మొగంబుఁ
జూచి. 71

క. ఏమైన నయ్యె నిఁక నే
లా మీఁటినపనికి నిట్టియంతిపురములో
నోముద్దరాల యేగతి
నీమహిమ గడించుకొంటి విది పెఱుఁగు కడున్. 72

సీ. అని యుల్లసము దోఁప నాడుమాటలకు వె
ల్వెలఁ బాఱుచును దైత్యవిభుతనూజ
కలఁగి రహస్యభంగభయంబుచేతఁ బ్ర
త్యుత్తరం మేమియుఁ దోఁప కునికి
నిట్టటు గ్రుక్కుచున్నట్టిలా గనసి యా
యతివకుఁ దనచెలియం డ్రగుట్టు

బయలు సేయక యున్నఁ బాయ దీవెడఁగుఁబా
టనియు వారికి నిది యభిమతార్థ
ఆ. సిద్ధిహేతు వనియుఁ జిత్తంబులోపల
నీతిసరణిఁ బరిగణించి చూచి
యాసునాభసుతల కంపపడంతి యి
ట్లనియె నుచితఫణితి యతిశయిల్ల. 73

క. ఇది యెంత పేర్చెదరు మీ
చదివినయాకుననె తానుఁ జనివినయది మా
సుదతియు మొదల ఫలించెఁ
బదభీష్టము పెద్దపిన్నతనములవరుసన్. 74

వ. అనుటయుఁ దెలి వొందినమొగంబుతోఁ బ్రభావతి యా
విహంగిం జూచి. 75

క. ఎట్టెట్టూ మును వీరల
గుట్టులు నీపోఁగునకుఁ దగుల్పడినది యే
యె ట్టుండె నట్టె చెప్పుము
గట్టిగ నావుడు మరాళ కామిని నగుచున్. 76

వ. తను నధికభయలజ్జాసమాకులచిత్త లగుచుం గనుసన్నల
వారించుచున్న చంద్రవతీగుణవతులవంకం గనుంగొని
చెప్పం గొంకించుటయు నక్తంచరరాజనందనయుం దన
మీఁద నాన లిడుచు నడిగినం బులుఁగుపడఁతి తదనుజల
విలోకించి. 77

ఆ. మీర లూర కుండ రీరు దువ్వఁగఁ జేను
వచ్చు ననుట వినరె వనితలార

యాన పెట్టి యడుగ మాన రా దిఁకఁ జెప్ప
వలసె మీరహస్యవర్తనములు. 78

వ. అని పలికి ప్రభావతితోడం బ్రద్యుమ్నలేఖాహరణం బొనర్చిన చిలుకసుద్దులు మొదలుకొని వారిప్రయత్నంబు సకలంబునుం జెప్పిన నవ్వుచు నాపుష్పవఁబోఁడి క్రీడావనతవదనలైన యమ్ముద్దియల నీక్షించి. 79

క. మునిముచ్చులార మీచే
సినపని యటు గట్టిపెట్టి చేకొని యేలా
ననుఁ దఱిమితి రిఁక నేమియు
ననకుఁడు నాతోడిదొంగ లైతిరి మీరున్. 80

వ. అనిన నాయింతికి శకుంతకాంత యి ట్లనియె. 81

తే. లలన యెంతటివారు గావలయు నెందు
నైన నీతోడివారు గా నంత కిపుడు
ప్రియునితోఁ జెప్పి నీవు రప్పించ కున్న
వీరలకు నెక్కడిది నిజవిభులరాక. 82

ఉ. ఎల్లియు నేఁడు నీకు హృదయేశ్వరు నెద్దియుఁ బల్కసిగ్గుచే
నుల్లము గొల్పదేని వికచోత్పలలోచన. యేన నేఁడు నీ
వల్లభుతోడఁ జెప్పెద నవశ్యము నీచెలియం డ్రకోర్కి సం
ధిల్లెడునట్లు గాఁగ భవదీయనియోగమహత్త్వశక్తిచేన్. 83

వ. అని తన్నయనచేష్టావిశేషంబున నంగీకారంబువడసినదియై సునాభతనయల నభివీక్షించి యీప్రభావతికిం బతి యైనవాఁ డతిలోకమహిమమహనీయుం డైనయొక్కదివ్యపురుషుండు గావునఁ దదనుగ్రహంబునం దక్కఁ దక్కినయుపాయంబుల నీయంతగపురంబు మీవరులకుం జొర నలవి

గా దని తలపోసి యిట్టినీతి నిశ్చయించి పలికితి నని పలి
యి ట్లనియె. ౮౪

క. మది తహతహ విడిచి యిఁకఁ
ముదమున సతులార కొంగు ముడి వేసికొనుం
డిదె నేఁ టిమాపటికిఁ గూ
ర్చెద వాలాయముగ నేను బ్రియులను మిమ్ముస్. 85

క. అని హాంసి మృదుస్మితశో
భనలజ్జావనతవదనపద్మంబులతోఁ
గనుపట్టువారి నిండ్లకు
ననిపించె నిశాచరేశ్వరాత్మజచేతస్. 86

వ. ఇవ్విధంబున నవ్వధూమణుల నమ్మించినదై యంచబోటి
నాఁటిరాత్రి యాదవులవిడిదికిఁ బోయి యేకాంతంబునఁ
బ్రద్యుమ్నగదసాంబుల ముువ్వురం గూర్చి. 87

క. సాకల్యంబున మీాప్ర
త్యేకపుఁబను లైనఁ గాని యొద్దియు నాకుఁ
బై కార్యము దెలియదు నా
కొకస్స్వామికిని జెప్పి యనుపుట కనుడుఁ. 88

ఉ. అందఱకుం దలాయొకటి స్వార్థముగల్గుట దోఁపఁబల్కె సం
క్రందనకార్యవర్తనము గాకయు నాకుచు బోలె నెవ్వియే
నిందు నిజార్థము ల్కడమయిద్దఱకుం గలవేమొయంచు నా
త్మందలపోఁత పూనిరిసమంబుగనప్పుడు వారు ముువ్వురుఁ.

వ. శుచిముఖియు వారిభావంబు భావించి. 90

క. మీామీాప్రత్యేకార్థము
లేమియు నొక రొక రెఱుంగ రేమొ వినుం డం

చామువురకు ముప్పుటకుఁ గల
ప్రేమవతుల తెఱఁగు వారిప్రేమలుఁ దెలిపెన్. 91

వ. తెలిపి ప్రద్యుమ్నుం జూచి. 92

క. నీ వొకఁడవు మాయావిపి
గావునఁ బ్రియపొందుఁ గంటి గాని యితరు ల
త్యావిలధృతి నున్నా రి
ష్టావాప్తికిఁ ద్రోవఁ గాన కాత్మలలోన్. 93

వ. కావున వీరలయభిమతసిద్ధియు భవదధీనంబ యిందులకుఁ దగినయుపాయం బూహింపు మనియె నప్పు డామువ్వురుం బరస్పరరహస్యకార్యప్రకటనంబునకు నవ్వుచు సుహృద్భావసుభగంబావుకనర్మసంవర్తితవచనంబులతో నొండొరు మొగంబులు గనుంగొనుచు. 94

క. నీవచ్చితివి గని యా
రా వాసవకార్యపరత యను చుంటిఁ గటా
నీ వీ తెఱఁగే యన మఱి
నీవో యన నీవొ యనఁగ నిగిడె న్నగవుల్. 95

వ. అంతఁ బ్రద్యుమ్నుండు శుచిముఖిం జూచి నీవు సునాభతనయలకడకుం జని తమహృదయేశ్వరు లిదె వచ్చెద రని యూఱడింపు మని పనిచి తానును గదసాంబుల కిష్టసిద్ధి యగునట్లుగ నాత్మకల్పితభూవివరద్వారంబున దానవేశ్వరకన్యాంతఃపురప్రవేశంబు గలిగించి నిజాంగనం గూడి రమియించుచుండె నప్పుడు. 96

సీ. ఆననాంభోజవ్యపావర్తనాముహు
ర్విఘ్నితాధరపానవిలసనంబుఁ

గా డని తలపోసి యిట్టినీతి నిశ్చయించి పలికితి నని పలికి
యి ట్లనియె. 84

క. మది తహతహ విడిచి యిరుకర్
ముదమున సతులార కొంగు ముడి వేసికొనుం
డిదె నేఁ టిమాపటికిఁ గూ
ర్చెద వాలాయముగ నేను బ్రియులను మిమ్మున్. 85

క. అని హసించి మృదుస్మితశో
భనలజ్జావనతవదనపద్మంబులతోఁ
గనుపట్టువారి నిండ్లకు
ననిపించె నిశాచరేశ్వరాత్మజ చేతన్. 86

వ. ఇవ్విధంబున నవ్వధూమణుల నమ్మించినది యై యంచబోటి
నాఁటిరాత్రి యాదవులవిడిదికిఁ బోయి యేకాంతంబునఁ
బ్రద్యుమ్నగదసాంబుల ముువ్వురం గూర్చి. 87

క. సాకల్యంబున మీ ప్ర
త్యేకపుఁబను లైనఁ గాని యెద్దియు నాకున్
బై కార్యము దెలియదు నా
కౌకస్స్వామికిని జెప్పి యనుపుట కనుదున్. 88

ఉ. అంచఱకుం దలాయొకటి స్వార్థముగల్గుట దోఁచుఁబల్కె సం
క్రందనకార్యవర్తనము గాకయు నాకును బోలె నెవ్వియే
నిందు నిజార్థము ల్కడమయిద్దఱకుం గలవేమొయంచు నా
త్మందలపోఁత వూనిరిసమంబుగనప్పుడు వారు ముువ్వురున్.

వ. శుచిముఖియు వారిభావంబు భావించి. 90

క. మీమీ ప్రత్యేకార్థము
లేమియు నొకరొక రెఱుంగ రేమొ వినుం డం

చాముపురకు ముప్పరకుఁ గల
ప్రేమవతుల తెఱఁగు వారిప్రేమలుఁ దెలిపెన్. 91

వ. తెలిపి ప్రద్యుమ్నుం జూచి. 92

క. నీ వొకఁడవు మాయావివి
గావునఁ బ్రియఁబొందఁ గంటి గాని యితరు ల
త్యావిలధృతి నున్నా రి
ష్టావాప్తికిఁ ద్రోవఁ గాన కాత్మలలోన్. 93

వ. కావున వీరలయభిమతసిద్ధియు భవదధీనంబ యిందులకుఁ దగినయుపాయం బూహింపు మనియె నప్పు డాముప్పురుం బరప్పరహాస్యకార్యప్రకటనంబునకు నవ్వుచు సుహృద్భావ సుభగంబౌ పుకనర్మసంవర్తితవచనంబులతో నొండొరు మొగం బులు గనుంగొనుచు. 94

క. నీవచ్చుతీవి గని యా
రా వాసవకార్యపరత యను చుంటిఁ గటా
నీ వీ తెఱఁగే యన మఱి
నీవో యన నీవొ యనఁగ నిగిడె న్నగవుల్. 95

వ. అంతఁ బ్రద్యుమ్నుండు శుచిముఖుం జూచి నీవు సునాభ తనయలకడకుం జని తమహృదయేశ్వరు లిదె వచ్చెద రని యూఱడింపు మని పనిచి తానును గదసాంబుల కిష్టసిద్ధి యగునట్లుగ నాత్మకల్పితభూవివరద్వారంబున దానవేశ్వర కన్యాంతగిపురప్రవేశంబు గలిగించి నిజాంగనం గూడి రమి యించుచుండె నప్పుడు. 96

సీ. ఆననాంభోజవ్యాపావర్తనాముహు
ర్వ్యాప్త్యాతాధరపానవిలసనంబుఁ

గరకృతాంతర్ధిభంగురితకపోలచుం
బనరణారణకసంభ్రమభరంబుఁ
బ్రసభాపహృతకుచప్రావరణాంశుక
స్థానాభిషిక్తదోస్స్వస్తికంబు
సముపోఢజఘునవస్త్రప్రయోజనసమా
డిష్టోరుయుగమిథోవేష్టనంబు
తే. నగుచుఁ దనసిగ్గు పెక్కువ యవిరతంబుఁ
గరకరి యొనర్ప రాయిడిఁ గరముఁ గెరలు
నతనురాగవేగంబున నతిశయిల్లు
రమణురతి నొప్పె నొకకొన్నిరాత్రు లబల. 97
వ. అంత. 98
ఉ. సిబ్బితి మాని నేఁటినిశఁ జిత్తములోపలికాంక్ష దీఱఁ జ
న్గుబ్బల నొత్తి యేనె మునుగ్రుచ్చికవుంగిటఁజేర్చెదన్విభుం
గొబ్బునఁ బట్టిదంతశిఖనొక్కఁగ మోవియునంచుఁగోరునా
గుబ్బెత రేపు లెల్లఁ దఱిఁ గొంకు నిరంకుశలజ్జపెంపునన్.
క. యాదవుఁ డంతట రతులవి
భేదములు గ్రమక్రమాభ్యుపేతములుగ నా
పైదలికిఁ గఱపి చిత్రా
పాదిసురతరాజ్యమునకుఁ బట్టము గట్టెన్. 100
వ. అందు. 101
క. ఏవిధిఁ బతి వేఁడిసఁ బుం
భావాదిని లజ్జఁ దొట్రుపడుఁ గాని తుదకా
యావనపుఁజిందఱ గొని
భావజుసివ మెత్తి యతివ ప్రౌఢిమ నెరపెన్. 102

ఉ. ఆచనుఁబ్రేఁగు నట్టిజఘనాతిభరంబు విరోధి గాక తో
డై చపలాక్షి కిం పొసఁగె నప్డు పముద్గమవేగనున్నమై
ఖేచరచక్రసామ్యధృతికిం దగనొక్కటి మీఁదికిం దివఁ
భూచరచక్రసామ్యమునుబొందెఁదదన్యము క్రిందికీడ్చుచున్. 103

వ. తదనంతరంబ. 104

సీ. గుబ్బపాలిండ్లు గన్గొను వేడుకను మించు
గాఢపరీరంభకౌతుకంబు
గాఢపరిరంభకౌతుకంబును మించు
జఘనలోలుపహస్తచాపలంబు
జఘనలోలుపహస్తచాపలంబును మించుఁ
దిలకమంటెనకురుల్దిద్దుతమియుఁ
దిలకమంటిన కురుల్దిద్దుతమిని మించు
వాతెఱచవు లానువలపుపెంపు

ఆ. వాతెఱచవు లానువలపుపెంపును మించు
రతులరహిఁయు రతులరహిని మించు
నధరరసము విఘటితానోన్యమ్యముగఁ దత్త
ఱేలుచుఁ బతి రమించెఁ జెలువఁ గూడి. 105

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశిని హృదయేశుచిత్తంబు రంజిల్ల
నుల్లసిల్లెఁ జంద్రవతీగుణవతులుం బతులచేత నతులానురాగ
పూర్వకనివర్తితగాంధర్వ వివాహలగుచుం గ్రమప్రవర్ధమాన
నానారతిప్రాగల్భ్యనిర్భరంబు లగువిహారంబుల నతిశయిల్లి
రివ్విధంబున. 106

సీ. అతియత్నరుద్ధలబ్ధాశేషచుంబన
కుచపీడనాద్యమై కొన్నినాళ్లు

మందమందక్రియమాణనానాప్రతి
కూలాభ్యభిరామ మైకొన్నినాళ్లు
కృతకప్రమాదానుమతసముల్లసదసం
కుచితక్రియాక మైకొన్నినాళ్లు
విరళత్రపాతిరస్కారిణీపరిస్ఫుర
త్కౌతుకసంరంభ మైకొన్నినాళ్లు
తే. ప్రకటముఖరిత మేఖలారణితగుణిత
మణితఘుంటారవాఘూర్ణ్యమానమసృణ
కుసుమసాయకౌద్ధత్య మైకొన్నినాళ్లు
రతి జరుగఁ జల్పె రతివలు పతులసేవ. 107

వ. అందు నొక్కనాఁడు. 108

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీరతివిహారప్రౌఢిసారస్యసం
పద్యుక్తిన్ గడుఁజొక్కి దక్కి తిరతీ మత్ప్రాణమా నీకు నం
చుద్యత్ప్రేమసమృద్ధిఁబల్కెనదియా యోపాలలామన్ శ్రవ
స్సద్యగ్రపాతనిశాతశూలసమ మై చాలంగ నొంచె న్వెసన్.

క. ధాత్రిఁ జిరార్జితతాదృ
క్చిత్రమిథస్ప్రేమ నుల్లసిలుచో బెరుకే
మాత్రము లే కెనసినప్రియు
గోత్రస్ఖాలిత్య మోర్వఁ గోమలివశమే. 110

ఉ. ఏ మని చెప్పు నప్పు డసురేంద్రసుత న్సకలాంగసంపదు
ద్దామరతోత్సవానుపమ తత్ప్రథమక్షణసంభవత్సుఖ
శ్రీమయ మూర్ఛఁ జేడ్పడఁగఁ జేసెను దుఃఖపుమూర్ఛ యై
కడున్, భామల కట్టిచో సవతినామము మారణమంత్ర మౌఁ
జుమీ. 111

తే. ఆప్రభావతి కొంతసే పవ్విధమున
మానదుఃఖనిశ్చేష్టిత యైనవెనుక
నుస్సు రనుచును వేఁడినిట్టూర్పుఁ నిగుడ
వగలఁ బొగులుచుఁ బొరలె మార్గాగముగాఁగ. 112

తే. అరిగె శయ్యాంతరమునకు నంత లేచి
యతివరో యిది యేమి నాయందుఁ దప్పు
గలిగెనో యంచుఁ దోన రాఁ గడఁగువిభుని
నట్లు రాకుండ ఘనమైన యానవెట్టి. 113

క. ప్రద్యుమ్నుఁడు తా నటు చను
నుద్యోగము దక్కి యుస్సురుస్సు రనుచు నా
హృద్యతరాంగినియోగము
సద్యఃపరితాప మెసఁగ సందేహమునన్. 114

వ. తనకుఁ గొంతసమీపంబున నొక్కపర్యంకంబున నవ్వలి
మొగంబుగా శయనించి యున్నయాప్రభావతికిఁ గర్ణగో
చరం బయ్యెడుపాటి పరిమితస్వరంబున ని ట్లనియె. 115

ఉ. తామరసాక్షి నావలనఁ దప్పొక టెయ్యదియైనఁ గంటివో
నామదిఁ దాల్మి చూడఁగ మనంబునఁ గోరియొ యల్గి కూడినం
బ్రేమలువింతయింపుసవరించునటంచునొ యల్కచొప్పుగా
కేమయిన న్నిమిత్త మొకయించుక గల్గెనొ లేచిపోవఁగన్.

క. అనుటయు ఘనదుఃఖవశం
బున నొకయుత్తరము నీక పొలఁతుక నిట్టూ
ర్పు నిగిడ్చి యూర కుండిన
దనుజారిసుతుండు ప్రచలితం బగుమదితోన్. 117

శా. నాయం జేయది తప్పుదోఁచినది యోనారీమణీ నీకు దుర్గ
ఖాయత్తత్త్వముచూడనిక్కమిది మత్ప్రాణింబవీవెందునుం
జేయన్నేర్తునె తప్పు నీకు నిది నీచిత్తంబు రాఁ దెల్పుకో
డాయన్వచ్చెద నాకు రాముదల పెట్టం గాఁ దగున్నత్కృపన్.

వ. అట్లుం గాదేని. 119

తే. వనిత యిటువచ్చి నీవు నీవలయుసోదె
గొనుము దప్పున్న మఱి నాకుఁ బెనఁగఁ జోటు
గలదె నీమొలనూలునఁ గట్టువడుదుఁ
బూనుదును నీవు మెడఁ బెట్టుపొగడదండ. 120

క. నావుడును గంఠగద్గది
కావికృతి యడంచుకొంచు ఘనయత్నత వ
ర్ణావలి యేర్పడఁ బలికెఁ బ్ర
భావతి చెవియొగ్గి తనదుపతి యాలింపన్. 121

చ. అనఘుఁడ నిన్ను నోదెగొను నంతటిదాననె యేను దప్పు లే
దును దలపోయ నీవలనదోసమె యాత్మను బాయకున్న వా
రినిబలు కొక్కమా అనుసరించుట మేనదివించునేఁ దొఱం
గని పెనుదప్పు నాయదియ కాక పరింబదిగాఁగ నెంచినన్.

ఉ. అట్టిమదీయ మైనవపురాశ్రయలోభమహాపరాధమే
గట్టిగ లేచి వచ్చుటకుఁ గారణ మైనది నాకు దోసముల్
గట్టెదునీమృషాచటువికారముఁ జూడఁగఁ జేసి యిప్పుడున్
దిట్టును రట్టు నర్మ మగుదీనికి నిన్ననఁ జెల్ల దేమియున్. 123

తే. దూఱఁదగు నిన్ను నొకటికిఁ దొంటియట్ల
కల్లకూరిమి నేరపువాక్యముల నన్ను

నిష్ఫలమను బయ లీడించె డిపియకాదె
కుటిల తడిపాటం గుత్తుకగోయు టనంగ. 124

ఉ. పట్టిప్రి యోక్తు లెంపుదగవా మిముబోంట్లరసజ్ఞ కాత్మ ను
న్నట్టిప కాక యిప్పు డివి యట్టిపనైచను నీకు మోహపుం
బట్టపుదేవి నైనరతిభ్రాంతిన పల్కెద వేమొ నాథ యే
గట్టిగ నారతిప్రమదం గాను బ్రభావతియంగ్రు నన్నిలన్.

క. అని మానదుఃఖ ముద్దీ
పన మొందంగ సద్వ్యథూటి ప్రక్క లెగయ నే
డ్చెను వెక్కి వెక్కి లోలో
ననె యకటా! యిడియు జీవనమె నా కనుచున్. 126

క. నాయకుడును దాను మును ర
తీ యని తద్రతులసంగతిన పల్కిన ప
ల్కాయింతికిం గోపము రాం
జేయుట తద్వచనరీతిచేం గని నగుచున్. 127

క. రమణీ యిందాంకను దెలి
యము నీయల్కకు నిమిత్త మదియే భవదు
త్తమరతి నేం గరంగుచు మె
చ్చుమరంగ నట్లంటిం గాని నది తప్పగునే. 128

క. అనుటయు భవదుత్తమ రతి
యనుపలు కొక్కటియె యాత్మ నంటె సతికి నా
థునిపలుకులలో రతి యీా
సున దృఢవాసిత మితరముం జొరనీదు మదిన్. 129

క. ఉవిదయు భవదుత్తమ రతి
భవదుత్తమరతి యటంచుం బనిపలు కీర్ష్యా

వివశతఁ బలుమఱుఁ దడవుచు
నవివేకంబునఁ దదర్థ మరయుచుఁ దనలోన్. 130

క. నాకంటె నకట యుత్తమ
యాకె యగుట చెప్ప వలయునా యాగతి నీ
వాకున నీ దగుప్రేమో
త్సేకమె చాటంగ ననుచుఁ జింతిలు చుండెన్. 131

వ. ఇట్లు తద్దయుం బ్రొద్దు చింతాక్రాంత యై యున్న ప్రభావతికిఁ బ్రద్యుమ్నుం డి ట్లనియె. 132

క. పలుక వొకింతయు నాతోఁ
జిలుకవు కరుణామృతంబుచినుకొకటియు లో
నులుకవు నాదగుదైన్యపుఁ
బలు కవగణనమున వినుచుఁ బద్మదళాక్షీ. 133

క. చేరక యుండఁగ నాకొక
ఘోరపుటాన యిడి నీవుఁ గూరిమి కెడ యై
కారుణ్య మెడలి నావెత
చేరువనే వినుచు నునికి చిత్రము తరుణీ. 134

క. దానవునకు నుదయించిన
దానవు గావున లతాంగి దయ చాలదు నీ
మానసమున నీవిలఁ బ్రథ
మానసమస్తోరుగుణసమంచిత వైనన్. 135

ఉ. నీవిపు డింతపేరలుక నెట్టుకొనన్ ధరియించి యున్కి నా
కోవనజాక్షి ఖండపవనౌషధినాయకముఖ్యు లుగ్రతా
పావహులౌటచిత్ర మెనిజాత్మ యనంగుఁడునొందుచున్న వాఁ
డేవిధిఁబ్రేమపాత్రుఁ గినియించినవారికి శత్రువాత్మయున్.1

తే. ఆన విడువు మచ్చటికి నే నరుగు దెంచి
యలుక తీర్చెదఁ గాదేని జలరుహాక్షి
యాన విడువు మిచ్చటికి నీ వరుగుదెంచి
నీదుమధురంపుమోవితేనియలు నాకు. 137

వ. అని యంతకంతకుఁ బెరిఁగెడు పరిరంభరాగతత్పరతావ
శంబున. 138

ఉ. రాఁగదె యోసుధాంశుముఖి రాఁగదె యోకఠినోన్నతస్తనీ
రాఁగదె యోవిలాసవతి రాఁగదె యోకలకంఠభాషిణీ
రాఁగదె యోకళావిదుషి రాఁగదె యోకలహంసగామినీ
రాఁగదె యోగుణైకనిధి రాఁగదె యోలలితాంగి డగ్గఱన్.

క. కలికీ రాఁగదె చిలుకల
కొలికీ రాఁగదె లతాంతకోదండునిపూ
ములికీ రాఁగదె యూరక
యలికీరాశ్చటుల నేల యలచెదు నన్నున్. 140

వ. అని వేఁడుకొనుచున్నంతం బట్టణంబులోనం దనవిడిదివా
కిటం బ్రాభోధికంబు లైన వాద్యస్వనంబులు వినంబడు
టయు వజ్రనాభుపడవాళ్లు పిలువ వచ్చువేళ యయ్యెఁ
గావలయు నింతటంబోక యున్నఁ గార్యంబు తప్పు ననుచు
లేచి యాత్మకల్పితభూవివరద్వారంబునకై చనియె నప్పుడు.

క. వెఱపింపఁ బోయి వెఱచిన
తెఱఁగునఁ దా వేఁడుకొనఁ బతి న్వెనుకొనియెం
దెఱవ తనయల్క కడుఁ గీ
డ్పఱచి విజృంభించువిరహపరితాపము చేన్. 142

క. తనరమణి యిట్లు తను వెను
కొనుట యెఱుంగఁడు మురారికొడుకపుడు ప్రయో
జనవశతఁ జనియె నతిశయ
మున నాత్మనివాసమునకు భూమివరమునన్. 143

క. అవనితయు వడివడిని బి
లావధిగా నరిగి యంత నవ్వల నరుగం
గా వెఱచి తిరిగి వచ్చెను
భావము గలఁగంగ విభునిపాసుపుకడకున్. 144

వ. అట్లు వచ్చి. 145

చ. తనవిభుపాదసంగతిని ధన్యము లైనసువర్ణపాదుకల్
చనుఁగవ నొత్తుకొంచు మఱి శయ్యనురాలినతద్విలిప్తచం
దనలవము ల్శరీరమునఁ దాల్చుచుఁ దత్పరిభుక్తముక్తమా
ల్యనికర మక్షియుగ్మమున నద్దుచు నించుకసేపు రంజిలెన్.

చ. తదనుభవోదితశ్రుతికతంబున నవ్విభురామణీసుకా, భ్యుదయము చర్చసేయు సురతోత్సవచాతురి యెంచుఁ బ్రేమసం
పద గణియించు లాలనలభంగులు భావనసల్పు మిక్కిలిన్
హృదయమునందు రాగిలుచునింద్రవిరోధితనూజమూటికిన్.

ఉ. అక్కట యిట్టివల్లభునియందును కోపము పుట్టనాకుఁ ద
ప్పొక్కటియేలతోఁచెనదియున్నఁ జెమద్రతిఁగూర్చియంటఁ
గా, దక్కఁగఁ దెల్పెవల్లభుఁడు దానికి నర్థము నిప్పుడేను వే
ఱొక్కటిగాఁ దలంచి విడ నొల్లన కోపము దైవవంచనన్.

ఉ. ఆయనఘుండు దాఁ దొలుత నంపినపత్రికలోన నున్న య
త్యాయతరాగభంగులరయంగ ననన్యసమానభాగ్యఁ గా

నాయెడఁజూడనాదయినచక్కయు మూలము గాకయున్న నా
నాయకుఁడట్లు ప్రార్థనమొనర్పఁగ నేపినకున్కయొప్పునే. 149

క. మగవాఁడు దూష్యమెయు సరి
జగతి నదియుఁ గాక నాఁటిచాటూక్తుల ప్రే
మ గురుత్వము నలపత్రిక
యు గణింపఁగ నతనియందె నొదవునె తప్పుల్. 150

వ. అని విరహవేదనం బొరలుచుండఁ బ్రభాతం బగుటయుఁ
బ్రభావతి తన గృహదేవతయుం బోలెఁ బూజ లందుచు
ననన్యవిదితగుప్తంబై యున్న యాపత్రికం బుచ్చుకొని
శృంగారవుందోఁటలోనికిఁ జని యొక్క వివిక్తస్థలంబునం
గూర్చుండి మున్ను రాగవల్లరి చదువఁగా మిగిలినపత్రికా
భాగంబు తనచేత నటమున్ను బహువారపఠితం బయ్యును
నవోత్కంఠఁ గలుగం జేయుచుండ నల్పస్వరంబునఁ దనలో
ని ట్లని చదువం దొడంగె. 151

ద్విరదగతిరగడ

ఓహంసి నీచేత నున్న యది నా ప్రదుకు
నాహృదయ మింతిడెంపము నేకముగ నదుకు
కరుణ నిది పదివేలుకమ్మలుగఁ గైకొనుము
పరఁగ నతితోడ నాపలుకుగా ని ట్లనుము
విద్యున్నిభాంగిరో వినుము నీకృప గన్నఁ
బ్రద్యుమ్నుఁ డనుపేరు ఫలిత మగు నా కెన్నఁ
దైత్రిలోక్యనిత్యసామ్రాజ్యవైభవ మైనఁ
బోల దొకలేశమును బొలఁతి నీకృపలోన
గరిమ నెల్లెడల నీకనుసన్నలోవత్తు

హరిమధ్య యేబాస గైన దీనికి నిత్తు
నేణాక్షి విను నీయుపేక్ష నా చెవిఁ బడినఁ
బ్రాణము హరించు విరులావార్త వెంబడిన
నీమోవిచిగురుతేనియలు గ్రోలెడియాస
నీమొలకనవ్వువెన్నెలచలువ గొనునాస
నీమృదుకపోలసన్నిధిని మో మిడునాస
నీమోహనశ్రోణి నిమురఁ గలిగెడునాస
నీదుపాలిండ్ల నానెడు వక్ష మనువాస
నీదుశృంగారకళ నెలవు లంటెడియాస
నీదుమణితామృతము నింతుఁ జెవి ననునాస
నీదులలితోరువు ల్నెమ్మి నొత్తెడియాస
నొడలిలోఁ బ్రాణవాయువులు నా కిందాఁక
వెడల కుండఁగ నిట్లు విన్నవించెదఁ గాక
యీకమ్మపూఁదోఁట యీ తేనియలజల్లు
నీకోమలపుగాడ్పు లీవెన్నెలబయళ్లు
తను వైదుపాళ్లు నింతక పంచి లోఁ గొనవె
యనయంబు నివి విరహి కపకారు లన వినవె
నిండుచందురుఁడు ని న్నెమ్మొగంబు సుహృత్తు
గండుఁగోయిలఫణితి కలభాషలకుఁ దొత్తు
మెఱుఁగుఁదీగెలు నీదుమృదుతనూలతయంట్లు
కఱకుఁబాయపు దేంట్లు కచభరశ్రీబంట్లు
కెంజిగురుచాయ నీకెమ్మోవికిని దాసి
కంజవైభవము కన్గవకు నంతేవాసి
యివి యెల్ల నాకింపు లిల నీవు చేపట్టి

నివియె పెనుమృత్యువు లొకింత నీ వెడ పెట్ట
నని తన్నుఁ గూర్చి నే నాడుట చెవిం జొనుపు
వనిత యే మనియె నది వ్రాసి వేగమె యనుపు
మోరాజహంసి నీయుల్ల మెందు సహేతు
కారుణ్య మని గట్టిగాఁగ నాకసి చూతు
నని చదువుకొన వినియె నటమున్న యేతెంచి
వెనుక నుండి తదీయవిభుఁ డాత్మ హత్తించి. 152

వ. ప్రభావతియు నిట్లు లేఖ చదువుకొని తదర్థంబు మఱియు మఱియు భావంబునం బరామర్శించుచు. 153

మ. ఇవి యాదిం గలప్రేమభంగు లిఁక నాయేతెంచుయత్నంబున
ట్టివిధి న్నన్నుఁ బరిగ్రహించుటనిరూఢి న్నేఁటిదాఁకఁ గారతో
త్సవసౌహార్దరతుల్ శతోత్తరత మించం జల్పుటాభవ్యప్రా
భవరూపాదిగుణవ్రజంబరయ నాభాగ్యంబె భాగ్యం బిలన్.

క. ఈరాత్రి యకారణపుం
బేరలుకఁ దదాత్మ కెడసి పిదపీఁ కగుచో
ప్పారయ భాగ్యవిహీనులు
లే రెవ్వరు నవనిమండలి న్ననుఁ బోలన్. 155

వ. అని చింతించు చుండ. 156

తే. రాగవల్లరి యంత నారమణికడకు
నరుగుదెంచి యాసఖివెన్క నచలవృత్తిఁ
బొంచి యున్నట్టిప్రద్యుమ్నుఁ గాంచి యతని
యక్షిసంజ్ఞచేఁ గాననియట్లు యుండె. 157

వ. తదనంతరంబ యాయంబుజాక్షిచందం బభివీక్షించి. 158

చ. పయిదలి నేఁ డిదేమి ముఖపాండిమ యున్నది మీఁటి ప్రత్యుషగ
క్రియలఁ బరాకు మాన్చినది కృష్ణచతుర్దశినాఁటిచంద్రరే
ఖయు బలె మేను చిక్కినది కాటుకకప్పదియొప్పెడుం గుచ
ద్వయిఁ బికరాజిమ్రోఁతఁగయి వ్రాలెదుసోలెదుచల్ల గాడ్పులన్.

ఉ. లోలతరాక్షి యాపయిఁటలోనిది యెక్కడిలేఖ యల్లనాఁ
డేలిక యంపినట్టిదియొ యెయ్యది యైనను సిగ్గు లేల నేఁ
డాలిఖితార్థ మేమయిన నట్టిటు గెంటినఁ జూచెదే మొయాఁ
బోలిక చూడ నట్ల యధిపుల్సతులందును సత్యసంధులే. 160

క. అని నడుమ నడుమఁ బ్రద్యు
మ్నునివదనముఁ జూచి నగుచు ముద్దియ తల్లో
చనసంజ్ఞాప్రేరణమున
దనుజేశ్వరసుతకు మఱియుఁ దా ని ట్లనియెన్. 161

క. ఈ రేయి రమణుఁ డెంతయు
గారించినవాఁడు నిన్ను గట్టిగఁ దెలిసెన్
నారీమణి మానునె మదిఁ
గూరిమి దాఁచుకొని యలుఁగ గూడదు నీకున్. 162

క. నీ వలిగెడుదాఁకను లే
దోవనితా యాట మాని యొడ్డించుకొనం
గా వలసె విభునియలుకల
చే విరహాకులిత వై కృశించితి విదిగో. 163

ఉ. తానటు లల్కఁదెచ్చుకొని ధైర్యబలంబున రాక తక్క నీ
దైనవియోగతాపమ్ముదితాకృతి చూడఁగ నప్పు డిష్ట మో

మానిని తాను నోఁచెఁ దలఁప పాత్రవియుక్తికి నిష్ఠ మాన్పునీ
కానెఱజాణయోగ్యకరుణామృతవృష్టిసయోగఖేదమున్.

వ. అనిన రాగవల్లరికిఁ బ్రభావతి యిట్లనియె. 165

సీ. అట్టియసత్యంపుటలుకలు కల్పించు
కొని వియోగవ్యథఁ గుందఁ జేసి
కాంతలయారూపు గనుఁగొను వేడ్కలు
రాగుండెతోడి నిర్దయులయందు
సంభవించునొ కాని సత్కృపారాశి మ
త్ప్రాణేశుఁ డేవినోదమున కైన
ననుఁ జిన్నపుచ్చి కన్గొనఁజాలఁ డొకనిమే
షార్ధమాత్రంబు నోయంబుజాక్షి

తే. నేఁటిరాత్రి తెఱంగు నానేరమున జ
నించె నది యొక్కమాట కే నెమ్మనమున
నలిగి తేఱన యే నెన్ని ప్రార్థనముల
దానిచే నెంత యెడసెనో ధవునిమనము. 166

చ. అనవిని రాగవల్లరి సమంకురితస్మితకోమలావలో
కనముల నాప్రభావతిని గన్గొనునట్లు తదీశ్వరుం గనుం
గొని బళి గోపపుత్రరసికుండవు నీదగుధూర్త్య మింతిపై
ఘనమనమానవీనసుధగాంచిచవుల్ గొనుకోర్కికోర్కియే.

క. నా విని యోసితుటారి ద
యావారిధి నధిపుఁగూర్చి యనకు మొకటియున్
నావెఱ్ఱికినుక యింతకుఁ
దావల మని చెప్ప వినవె తరుణీ యనియెన్. 168

వ. అని యోరాగవల్లరీ నీవు నాకు బహిఃప్రాణంబవు గాని సఖీమాత్రంబవు గావు నీకు దాఁపురంబు సేయనేల మా తెఱంగు వినిపించెద విను మని తనకోపనిమిత్తంబును బ్రియుండు తనతోడన రాకుండ నాన వెట్టి తాను శయ్యాంతరంబునకరుగుటయు మొదలుకొని ప్రియనిర్గమపర్యంతంబుగా దమవృత్తాంతంబు సకలంబునుం జెప్పఁదగిన ప్రకారంబును జెప్పి యిట్లనియె. 169

క. కాంతుం డాగతి నాయ
త్యంతకఠోరతకు నాత్మయందు విఱిగి యో
వింత యగువిరహదశ కుప
శాంతి యరసికొననో లేచి చనియెం బెలుచన్. 170

క. తఱి నంత వేఁడుకొన విన
నెఱుఁగనినానిష్ఠురతకు నేఁడువిరుగులన్
విఱిగ నొకొ ప్రియునిచిత్తము
విఱుగకయున్నం ద్యజించి పెస నేల చనున్. 171

ఉ. వ్రీడకు మానసంపదకు వెల్తిగదా యిదియంచు నెంచ కేఁ
గూడఁగఁ బాఱిపట్టుటకు గొబ్బున నప్పుడ సాహసించితిన్
జేడియ దాఁప నేర కిది చెప్పెదఁ బ్రాణము నీవు గావునన్
గూడఁగ లేకయంతఁగడుఁగుందితిఘోరవియోగవేదనన్. 172

ఉ. ఆపరిపాటికంతఁ గడు నల్గుచు నట్టివిభున్ దథావిథా
లాపవిచిత్రతం దురపిలంగ వియోగదవాసహత్వమున్
జూపుచుఁ జేర వేఁడువివశుం గయికోక కఠోరవృత్తిఁ బె
న్పాపముఁ గట్టుకొన్నగతభాగ్యకు నా కివి పాట్లు నెచ్చెలీ.

సీ. నెఱప కే లున్నవి నెత్తలిరె కెలు
తమవాఁడి యెల్ల నాతనువుమీఁదఁ
బఱప కే లున్నవి పరభృతశ్రేణులు
శ్రుతులలోఁ బమపల్కు సూదు లెల్ల
నుఱుప కే లున్నవి నెఱయుధైర్యంబును
గందంపుమలకోడెగాడ్పుగములు
విఱుప కే లున్నవి వెస నంటఁ బోసివి వ
పుస్స్మహాశిఁ బరాగముర్మురములు
తె. నన్ను నొకభూమిలోపలినాతి గాఁగఁ
దలఁచి వే చంప కి ట్లోర్పు దాల్చెనవియొ
తెగితెగనిచిఱుగ త్తికోఁతగ వధించు
టుచిత మని యోలి నిశ్లోఁచు చున్నయవియొ. 174

చ. అని విరహంబుఁ జేరలఁత నాశ్రితచంద్రశిలాతలంబు మీఁ
ద నొరగుచుఁ సఖిం దిగిచెఁ దన్వి శిరోజశికై తదంకముం
దనకుఁదలాడగాఁగొనఁగఁదజ్జ్ఞతబోటియుఁ దత్క్రియాప్రవ
ర్తనకుఁదదీశుఁడాకొలిపితాఁదనయింటికిఁబోయెనవ్వుచున్.175

తే. ప్రాణసఖి యిట్లు పన్నిన పన్నుగడలు
తెలియమిం జేసి యపుడు దైతేయకన్య
తనకు నంకోపధాన మ ట్లనువుపఱిచి
యాలతాంగియ యున్నది యనుతలఁపున. 176

ఉ. ప్రాణసఖీ నిను న్నెరయఁ బాసి చనన్ దఱి వచ్చె నాకుఁ గ
ల్యాణి తలంపుమీఁ సుసమయంబుల నన్నని ప్రేమ పెంపునన్
బాణి మెడం దగిల్చి తన పై కిఁ దదాస్యము వంపఁ బూని సు
శ్రోణిని జేశు మోముగుటసూచి త్రపాద్భుతమోదమగ్నతన్.

క. ఒక్కింతతడవు చేష్టలు
దక్కి కనంబడియెఁ జిత్రతనువ్రను బోలెన్
మిక్కిలిఁ గమనీయత సతి
దక్క కురుస్తంభసంగతత్వముకతనన్. 178

వ. అప్పుడు ప్రభావతికిఁ బ్రద్యుమ్నుం డి ట్లనియె. 179

చ. వెఱఁగుపడంగ నేల యలివేణి భవత్పతిఁ గానె యేను నీ
విరసతమాన్పలే కపుడు వీఁగుచునంతటిలోఁ బ్రయోజనాం
తరమతి నేఁగి నేఁటికిని దానిప్రసంగము లేమి వచ్చితిన్
దిరిగి వసించితి న్వెనుకదిక్కున నీవిధ మెల్లఁ జూచుచున్. 180

చ. అని యిరుకేలఁ గ్రిందటిగ నాసతి బాహులు వట్టి యెత్తి వె
న్వెనుకకు రా వెసం దిగిచి వేడుక నంకకృతోపవేశఁ జే
సె నెఱులుదువ్వెఁ జెక్కిటను జెక్కిలిఁ జేర్చెను మోవిచుంబనం
బొసరిచెఁ జన్నులం బెఁ గరయుగ్మము ప్రక్కలఁ బాఱఁజొన్పు
చున్. 181

మ. సుముఖి యెన్నఁడు నింక నల్గ నను మంచునొక్కొక్కత ల్పైన్న ఖా
గ్రములన్దంతశిఖన్గుచాధరములా కొంతుండుతఱింతయున్
సుముఖాంబెన్నఁడు నల్గఁ జేయనను మంచున్శోపితానట్లనొ
క్కి మనోనాథువరిష్ఠనిష్ఠురకుచక్లిష్టాంగుఁ జేసెం దుదన్. 182

చ. అలుక యొకింత కాలము మహాత్తరసేతువురీతి నాఁగి ఖే
దిలితొలఁగన్ సహస్రముఖతీవ్రతచూపెనుదొంటికంటెవా
రలయుసమానమానితపరస్పరకేళిరసప్రవాహ మ
గ్గలికఁ దదుత్తరంగరతికష్టవిచిత్రతఁ జెప్ప శక్యమే. 183

వ. ఇవ్విధంబునఁ బ్రద్యుమ్నుండు ప్రభావతింగూడి బహుకా
లంబు యథేష్టభోగంబు లనుభవించుచు నప్పటప్పటికి వజ్ర

నాభుని నపూర్వప్రవర్తనప్రవర్తనంబులవశవర్తిం జేసికొనుచుం
బ్రవర్తిల్లె గదసాంబులును జంద్రవతీగుణవతులతోఁ గూడి
రాత్రులెల్ల రమియించుచునాట్యరసమయంబులఁ బ్రద్యుమ్ను
నకు విదూషకపారిపార్శ్వకాదికృత్యంబుల సహాయత్వంబు
నడపుచు దైత్యవిభుని చిత్తంబు వడసి రంత. 184

చ. రమణ వలిస్ఫుటగా ఋతువు రాకలు పక్కనొడళ్లు చిక్క చి
ట్టుము లుదయించె వేవిళులమానతమించెఁ గపోలసీమఁ బాం
డిమ గనుపట్టెఁ జన్మొనల నీలిమ పుట్టె వలగ్నముం గురు
త్వము పొరసెఁ బ్రకుల్విరిసెదానవకన్యలకుం గ్రమంబునన్.

క. నవమాసానంతరమునఁ
బ్రవిమలశుభదినమునం బ్రభావతి గాంచెన్
శివ గుహునిఁ గాంచుకైవడి
నవనిఁ బ్రభావంతుఁ డనఁగ నమరెడుతనయున్. 186

క. ప్రణుతగుణ చంద్రవతి దిన
మణినిభుఁ జంద్రప్రభుం గుమారునిఁ గాంచెన్
గుణవతియుఁ గాంచె నిరుపుర
గుణవంతుం గీర్తిమంతుఁ గోర్కులు పొదలన్. 187

వ. ఇట్లు గాంచినకుమారు లుదయించుచుం దోడన పరిపూర్ణ
యౌవనులును సకల వేదవేదాంగపారగులును ధనుర్విద్యా
సంపన్నులు నగుచుం గన్యాంతగపురంబునఁ బ్రవర్తిల్లుచు
న్నంత నొక్కనాఁడు తద్రక్షణాధికారులవలన వారలయు
నికి నిశ్చితంబుగా విని వజ్రనాభుం డాగ్రహోదగ్రుం డగు
చుం దనసభాసదులఁ గలయం గనుంగొని. 188

ఉ. కంటిరె కాలవక్రతప్రకారము దానవముఖ్యులార నా, యిం

టికి ద్రోహముం దలఁచి యిష్టసుఖాప్తికి మ్రుచ్చు లిట్లు నూ
లొక్కంట దలంప శేషఫణికోఱల వ్రేలిడి గోఁకుకోఁగ ము
క్కంటివెలుంగుకంటఁ జణకంబులు వేఁచుకొనంగఁ బూనరే.

తే. వాండ్రు సురవంశభవులైన స్వర్గమునకుఁ
బ్రళయసమయ మిప్పుడు నాగకులజులైన
నాశకాలంబు తద్భువనమున కిదియ
నరు లయిన నంత్యదశ నేఁడ ధరణి కెల్ల. 190

తే. ప్రాణములతోడ నిట వాండ్రఁ బట్టి తెచ్చి
తెలిసి తల్లోకమును గడ తేర్పవలయు
నీవు చని పట్టి తెమ్మని నిజపురంబు
పెద్దతలవరిఁ దాఁ బంచె భీమబలుని. 191

తే. వాఁడు చని తిరుగక యున్న వరుస దండ
నాయకోత్తములను దళవాయిఁ బనిచె
వారుఁ దిరుగ కుండినఁ బటవస్థఁ దెలిపె
నరులు కోటకొమ్ములఁ గట్టినట్టితలలు. 192

వ. వజ్రనాభుండు తానత్యంతకోపాటోపదీపితముఖుం డగుచుఁ దనతమ్ముఁడు సునాభుండును సకలమిత్రామాత్యవర్గంబులును రథతురంగమాతంగపదాతివ్రాత పాదఘాతంబుల చేత భూతలంబు వడవడ వడంక నద్భుతోత్సాహంబునం జేర్చి కొలువ నలుపు మిగిలి కన్యకాభవనప్రాకారంబు చుట్టు ముట్టుకొనియె నప్పుడు తమవిడుదల నున్న ప్రద్యుమ్న గదసాంబులు మన మింతట నంతఃపురప్రవేశంబు సేయక తడసిన నీబెడిదంపు రక్కసునియక్కజంపు విక్రమంబు కుమారులకు నోర్వ శక్యంబు గా దని పూర్వవిహితమహీ

వివరద్వారంబున నాక్షణంబ ప్రవేశించి భీతివశంబున
నొక్కచోటనే చేరియున్న తమకళత్రంబుల యుత్తలపాటు
దీర్చి తత్పూర్వక్రూరదైత్యగాత్రంబుల నెత్తుటం జొత్తిల్లిన
యాయుధంబులు తనుచేతులన యుండ సంభ్రమంబునం
జనుదెంచి మ్రొక్కియున్న కుమారుల సంశ్లాఘావచనంబుల
నలరించి రట్టియెడఁ బ్రద్యుమ్నుండు ప్రభావతిం జూచి
యిట్లనియె. 193

ఆ. మగువ వినుము మిగులఁ దెగి విక్రమింప మా
తండ్రి కదలి వచ్చె దర్ప మెసఁగ
మనకు వచ్చుఁ గదుఁ బ్రమాద మే మింతట
యుద్ధమునకుఁ దెగక యూరకున్న. 194

క. కుడుముల ప్రేట్లాటలు గా
వుడు రాజానన రణంబు లూహించినవెం
బడి రా వే మటు తోడరినఁ
దోడిఁబడ నెవ్వాఁడు బిట్టు ద్రుంగునొ మాచేన్. 195

ఉ. చేడియ నీమనంబునకుఁ జింత యొకింత జనించెనేని నేఁ
జూడఁగ జాల నీజనకుచొప్పు దలంప హాతుండు గాక తాఁ
గీడుచలంబుమానఁ డనికిం జొరకొండొకత్రోవ ద్రొక్కఁగాఁ
గూడద యేమి సేయుదునుఘోగవిచారముపుట్టెనాత్మలోన్.

చ. అని తనుఁగూర్చి దానవకులాగ్రణిపైఁ దెగలేనిచింత సే
యునధిపుఁ గోటలగ్గలకు నుగ్రతడగ్గఱుభూరిసైన్యుఁ దం
డ్రినిఁబరికించి యింతి విభునిం దముఁగాఁచికొనంగ వేఁ త్రో
వ నెమకి కానకంతఁ బితృవత్సలభావము బాఱునూకుచున్.

క. తాన చని మూలనున్నయ
నూనతదీయాసిఁ దెచ్చి యొసఁగి గెలువుమీ
దానవపతిఁ దక్కినయను
మానము మాను మని పలికె మానవతి పతిన్. 198

చ. పలికిన సంతసిల్లి హరిపట్టి గదాదుల నాత్వరన్ వధూ
నిలయములోని కావలికి నిల్పి రయంబున నొక్కరుండుఁ దా
వెలువడి కోట కుగ్రబలవేష్టనము న్వడిపించుచున్ నిర
ర్గళగతిఁ జుట్టునుం దిరిగె ఖడ్గవిహారపటుత్వదీప్తుఁ డై. 199

ఉ. కాంచనదీప్తిచేఁ బసిఁడిగట్టు తెఱంగు నగళ్లకోట సూ
చించఁగఁ దాను భాస్కరుని చెన్ను వహించెను దానిఁజుట్టిరా
సంచరణం బొనర్చుచును శౌరితనూజుఁడు కోటచుట్టునున్
డించినదైత్యసైన్యము వడిందమమున్వలె విచ్చిపాఱఁగన్.

క. లగ్గలకు నట్లు కోటకు
దగ్గఱుతన మొనల నెల్లఁ దఱిమి తఱిమి పే
రగ్గలిక చూపుమదుపా
టగ్గించుచు వజ్రనాభుఁ డతని నెదిర్చెన్. 201

వ. ఎదిర్చి యి ట్లనియె. 202

ఉ. ఎవ్వఁడ వీవు నాముదల యించుకలేక చొరంగరాదు వీఁ
డెవ్వరికైన బ్రహ్మవర మిట్టిది యేగతిఁ జొచ్చి తీవు తా
నివ్విధి నాకుఁ గల్లవర మిచ్చినబ్రహ్మకు శిక్ష చేసెదన్
గ్రొవ్వడఁగించి ని న్నిపుడ కొట్టెద నీకుల మెల్ల రూపఱన్.

వ. అనుటయు నతండు. 204

క. నిను నేఁడు తిరిగి చన ని
చ్చినఁ గద బ్రహ్మకును శిక్ష సేయుదు వీదు

ర్జనతలె కావే నీముఁ జెఱి
చినవి యసత్యోక్తి బ్రహ్మజిహ్వకుఁ గలదే. 205

క. మొదలను బురిఁ జొచ్చితి నీ
ముదలన భద్రనటవేషమున హరిసుతుఁడన్
యదుకులజుఁడఁ బ్రద్యుమ్నుఁడ
మదిచ్ఛఁ గైకొంటి నీకొమారితపొందున్. 206

ఉ. కోరికఁ దాపకానుజునిసూఁతులకుం బతులైనవారు మా
వారలె నాకు వారికి నవార్యబలు ల్సహజాతయాదవో
దారులు గల్గి రాత్మజులు తల్లులరక్షకు నున్నవారు ప్రా
కారములోన నీవొర లగణ్యులఁబల్వురఁదిన్న మృత్యువుల్.

తే. హరికి దేవేంద్రునకు నీవు శరణు చొచ్చి
తేని నీప్రాణముల కెందు నేను దెగను
శరణు చొరవేని నావాలు కరుణ గిరుణ
యెఱిఁగినది కాదు నీ వది యెఱిఁగె దిపుడ. 208

తే. అనిన విని యోరి నీ నేమి యనినఁ జెల్లు
నేను నాదృష్టియెదుర ని న్నింతతడవు
పెట్టుకొని యుండుటకు నని బెట్టిదంపు
టంపవానలు గురిసె భయంకరముగ. 209

క. తనవాలునఁ దచ్ఛరములు
దునుముచుఁ బ్రద్యుమ్నుఁ డతనిఁ దునుముకడంకన్
ఘనరయమునఁ జనఁ దాఁకిరి
సునాభముఖ్యు లగురాక్షసులు బలములతోన్. 210

క. అది యంతయుఁ గని మనముల
గదసాంబులు గినిసి కోటగవకులు దెఱపిం

చి దురాధర్షాటోపత
నెదిర్చిరి సునాభముఖుల నింద్రాహితులన్. 211

శా. అంతం గేశవుఁ డంచవేగరులచే నాదైత్యసంగ్రామవృ
త్తాంతంబున్విని తార్క్ష్యవాహకుఁడుచక్రాద్యాయుధప్రోల్లస
త్కాంతిక్రాంతదిగంతరుం డయి వడిన్దావచ్చెనచ్చోటికిన్
సంతోషంబున వజ్రిసత్వరగతి న్సంధించి సేవింపఁగాన్. 212

వ. అప్పు డింద్రుండు ధనురాదిసకలహేతిసమేతంబును మా
తలిసారథికంబును నైన తనదివ్యరథంబు ప్రద్యుమ్నునకు
ననిపి గదసాంబులకు ననన్యదుర్జయంబు లైనదివ్యస్యంద
నంబులఁ బనిచె దాన నపూర్వోత్సాహంబునం బొదలియు
యదుకుమారులు ప్రతిభటుల మించంజాలక సత్వరంబునఁ
బోరుచుండి రయ్యవసరంబునఁ గృష్ణుండు. 213

క. సాహసము నాహతప్ర
త్యూహతనైపుణము నొక్కయంతగ సుతుతో
నాహవ మొనరించుమహో
త్సాహనిధి న్వజ్రనాభదైత్యునిఁ జూచెన్. 214

తే. చూచి యిట్లైన నెన్నండు సులభ మగును
విజయ మని మరుచేతికి విష్ణుఁ డనిపెఁ
దనదుచక్రము నతఁడును దత్ప్రయోగ
మునను ఖండించె వజ్రనాభునిశిరంబు. 215

క. గదసాంబులు తద్విజయా
భ్యుదయముఁ గని పొంగి బహువిధోగ్రాస్త్రములన్
జిదురుపలుగ నొనరించిరి
కడిసి సునాభాదిదనుజగణ దేహంబుల్. 216

వ. అప్పుడు. 171

శా. మందార ద్రుమపుష్పవృష్టితతులున్ మంద్రస్ఫురద్దేవతా
దుందుభ్యారవసంప్రవర్తనలు నస్తోకాప్సరోనర్తనా
మందోల్లాసము దివ్యగాయకుల సన్మాధుర్యగానంబు నా
నందోత్సేకము నిచ్చె లోకులకు మింటంజాల దీపించుచున్.

వ. అంత నచ్యుతుం డనాథత్వదైన్యదశాపన్ను లగుపౌరజనుల
ననేకవిధ లాలనాచాతుర్య శీతలవచనామృతంబున నపగ
తాశేషశోకపరితాపుల నపూర్వసంభృతానందవిశేషులఁ
గావించి వజ్రనాభుని రాజ్యంబు సర్వంబును జతుర్భాగంబు
లుగా విభజించి తదాధిపత్యంబునకుఁ బ్రభావంతునిఁ జంద్ర
ప్రభుని గుణవంతునిఁ గీర్తిమంతునిం బట్టాభిషిక్తులం
గావించి కొడుకులం గోడండ్రనుం దమ్ముని మఱఁదలిని
నత్యంతవిభవంబు మెఱయం దోడ్కొనుచు ద్వారకానగ
రంబున కరుగుదెంచి దేవేంద్రునిఁ దదీయస్థానంబున కనిచి
సకలసామ్రాజ్యవిభవంబు లనుభవించుచు నిరంతరకరు
ణావలోకనంబుల భక్తజనంబుల నవలోకించుచు మహానం
దంబునం బొలుపొందు చుండె నప్పుడు. 219

క. వావిరిఁ బ్రద్యుమ్నుండు ప్ర
భావతితో నిష్ట కేళిపరిపూర్ణత నిం
పావహిలఁగ వర్తిల్లెను
శ్రీవరుఁ దమతండ్రిఁ దగ భజించుచు ఘనుఁడై. 220

తే. అఘహరణహరివంశకథాశ్రయంబు
నాత్మపుత్త్రగుణస్తవనాంకితంబు

నైనయీకావ్యమునకు మహాప్రసిద్ధి
నిచ్చుఁ గావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు. 221

శా. శ్రీరాజేంద్రగురూత్తమాన్వయజనుర్విఖ్యాతసౌభాగ్య సో
మారాధ్యప్రభుసత్కృపాచతురమత్యాసీతఘాలాక్ష భ
క్త్యారబ్ధవ్యుపగూహనాతిసుఖితాత్మాప్తక్షమాశాంతిస
ద్వైరాగ్యోదయబోధముఖ్యబహుసంతానప్రసిద్ధుండిలన్.

క. వరచామరమిషవృతది
క్కరటిశ్రుతకీర్తిసామ్యకామ్యకృతగో
చరితాఖిలవిద్వత్కుం
జరకర్ణుఁడు కర్ణుఁ డీగి చాతుర్యమునన్. 223

వనమయూరము

భృత్యజనపోషణుఁడు పింగళిపురాంకా
మాత్యకులభూషణుఁడు మార్దవమహీయ
స్సత్యశుచిభాషణుఁడు సాధుజనతాసం
పత్యుదయపోషణుఁడు భవ్యకృపపేర్మిన్. 224

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయ నామధేయప్రణీతం బైనప్రభావతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందుఁ బరిపూర్ణభావభాసురంబైన పంచమాశ్వాసము.

ప్రభావతీప్రద్యుమ్నము

సంపూర్ణము.

---

# లఘుటీక

## పీఠిక

పద్యము

1 తారు = 'తాము' అనుటకు రూపాంతరము
,, తనరించు = తృప్తినొందించు
2 హార్దము=ప్రేమము-సౌహార్దము
3 గరుత్తు = ఱెక్క
,, సర్గము = సృష్టి
4 మిథునములు = దంపతులు
6 ఉదంచద్వైఖరిన్ = స్ఫుట పవాక్యములతో
,, రితుష్టి = తృప్తి
10 తిలకము=నొసటనుంచుకొను బొట్టు
12 పురవైరి = ఈశ్వరుఁడు
13 నిధి = నిలయము
14 పర్వము = పౌర్ణమ్యాది
15 జాయ = భార్య
,, ప్రోదిచేసికొను=వృద్ధినొందించు
15 మిన్ను = ఆకసము
19 జీవంతిక = ప్రాచీనవృక్షముల శాఖల చివర మొలచే ఓషధి, బదనిక
25 కైవసము = స్వాధీనము
26 దొరయు = సరిపోలు

పద్యము

27 కంఠీరవము = సింహము
28 ఔరసులు = పుత్త్రులు
32 వ్రీడావతులు = స్త్రీలు
33 గరితలు = స్త్రీలు
34 ఆత్మజులు = కొడుకులు
,, ధ్యేయము=ఎన్నఁదగినది
35 అంచితుఁడు=పూజింపఁబడువాడు
39 పెంపు=అతిశయము
41 జంపతులు=దంపతులు-భార్యాభర్తలు
43 అసదృక్షము = సాటిలేనిది
45 ప్రథ = ప్రసిద్ధి
47 కలశజలనిధి=క్షీరసముద్రము
52 ఆరూఢాదరత=అంకురించిన ప్రీతిచేతను
53 నాకము = స్వర్గము
54 మున్నీరు = సముద్రము
54 మొగపు = ముఖభాగము
,, తిలకము = బొట్టు
,, మొగడ = మొగ్గ
,, పుష్పగుచ్ఛము = పూగుత్తి
56 అబ్రము=అబ్బురము-ఆశ్చర్యం
57 ఆటవెలఁది = నర్తకి

పద్యము

58 ఠీవి = వైభవము

59 లంబమాన = వ్రేలాడుచున్న

60 భోగపుచుట్టు = సర్పశరీరము యొక్క వలయములు

61 అవచూడము = టెక్కెపుగుడ్డల క్రిందిభాగము

,, మొగుళ్ళు = మేఘములు

,, అభ్రము = మేఘము

62 హరిహయుఁడు = ఇంద్రుఁడు

,, ఆంగిరసుఁడు = బృహస్పతి

63 చాంపేయము = సంపంగి

,, పగటు = ప్రకటించే [కంచె

,, పగడంపుటలువ = పగడపుతీఁగెల

,, ఉడుపతి = చంద్రుఁడు

64 శైవాలము = నాచు

,, సంఘాతము = సమూహము

,, డిండీరమండలము = నురుగుల రాశి

,, శీకరములు = నీటితుంపరలు

65 పరిఖ = కందకము

,, జడనిధి = సముద్రము

66 అలజ్జత = సిగ్గులేకపోవుట

67 వనజోదరుఁడు = కృష్ణుడు

,, రంభాతరువు = అరఁటిచెట్టు

,, కక్ష్యాంతరంబులు = వేర్వేఱు ముంగిళ్ళు

68 అటమటము = వంచనము

69 అవధానము = మెలకువ

పద్యము

70 ఆతపము = ఎండ

72 పూరికిఁగైకొనక = లక్ష్యము సేయక

73 ఆలానము = కట్టుకఱ్ఱ

74 కలఁక = క్షోభ

77 తీరమికోలంది = చేయవలసినపని యొక్క మితి

78 ఉలుపా = కానుక

,, కిఱ్ఱాడి = నీచుఁడు

79 పురాకారక్ష = మునుపటిరూపము

81 మోఱియలవంటి = పోత్రములఁ బోలినవారు [నశించునట్టు

83 పెంపేదగ = అతిశయము

87 బిడౌజుఁడు = ఇంద్రుఁడు

88 యాతుధానుఁడు = రాక్షసుఁడు

90 యజనము = యజ్ఞము

91 ఇంబు = ఆనందము

94 పాడి = నీతి

95 నికటము = సమీపము

96 ప్రోల్లాసి (ప్ర + ఉల్లాసి) = మిగుల సంతసించినవాఁడు

97 వెరవు = ఉపాయము

104 కోరకము = మొగ్గ

107 అట్టాడు = తిరుగు

110 దేవశైవలిని = గంగానది

,, చక్రాంగము = హంస

113 ఎగ్గు = కీడు

## ప్రథమాశ్వాసము

పద్యము
114 జోకగ = యుక్తముగ
116 దీర్ఘిక=దిగుడుబావి [తక్కుఎ
117 కించిదూనము = కొంచెము
,, పులోమజ = శచీదేవి [నుండి
118 తడవులఁబట్టి = చాలకాలము
120 స్రవంతి = నది
,, శఠాత్ముఁడు = నీచుడు
,, కుందనము = బంగారు
121 కేళాకాళి=జలకేళికనువగు సరస్సు
,, అహరహము = ఎల్లప్పుడు
124 సౌహార్ద్రము = స్నేహము
126 సన్నిధానము = ప్రాప్తమైనది
,, మత్తకాశినులు = స్త్రీలు
,, నిబిడోత్సాహ=అధికమగు నుత్సాహము కలవానిని

పద్యము
132 ఈడు = సాటి
,, నేమము = నియమము
133 పలిమల = మంచుకొండ
134 మచ్చరీడు = మత్సరము కలవాఁడు
,, సుద్ది = వృత్తాంతము
135 సుబ్బెడు = బయలుపడును
,, సురూపతపస = చక్కఁదనము యొక్క బలముచేత
137 పొదరుటిల్లు=లతాదులచేనల్లిబిల్లిగానగు పొదరుటిండ్లు
138 తలంకెను = వెఱఁగందెను
139 త్రప = సిగ్గు
145 శీఘ్రానయనము = వేగము తోడి తెచ్చుట

## ద్వితీయాశ్వాసము

పద్యము
2 నిచ్చలములై = స్థిరమైనవియై
4 వరట = శ్రేష్ఠమగు నడకలు గలది, హంస
5 బుధుఁడు = పండితుఁడు, దివ్యుఁడు
8 ఆదృతి = సన్మానము

పద్యము
10 పక్షపాతులు=ఱెక్కలప్రసారముగల హంసలు, స్పష్టమగు ప్రేమగలవారు
13 ద్యుతి = కాంతి
14 రక్కసులగొంగ=రాక్షసవైరి, కృష్ణుఁడు

పద్యము

15 కాళంజి=తమ్ములము నమియెడు పాత్రము
,, కెలన = ప్రక్క
19 మొలకనగవు = చిఱునవ్వు
20 నాగవల్లికాదళములు = తమలపాకులు
26 వైపు = ఉపాయము
27 అవధ్యత = చంపఁదగమి
,, ముదల = ఆజ్ఞ
31 కాడిపాఱగ=గ్రుచ్చుకొనునట్లు
33 అగ్గలించు = అధికమగు
,, జీయ్య = ఓప్రభువా
36 వల్గితము = అశ్వగతివిశేషము
37 పురుషకము=గుఱ్ఱములువెనుకటి పాదములతో భూమియందుండి ముందటిపాదములను మీఁదికి చాపియుండుట
38 గ్రీవము = మెడ
,, ఖలీనము = కళ్లెము
,, సాహిణి = గుఱ్ఱపువాఁడు
,, సురాళించి = దిగదుడిచి
40 వితతి = సముదాయము
41 సితాబ్దంబులు = తెల్లనిమబ్బులు
,, అతకరించె = తిరస్కరించె
42 ఎఱకలు = ఱెక్కలు
43 కౌతుకము = వేడుక

పద్యము

43 ఉపరోధము = అడ్డగింత
44 దివస్పతి = ఇంద్రుఁడు
46 ఆపగ = నది
49 పదరక = కోపింపక
,, త్వర = వేగము
57 ఇరువుకొన = స్థిరపడునట్లు
58 భిదురము = వజ్రాయుధము
59 డయ్యక = శ్రమము జెందక
60 ప్రల్లదము = దౌర్జన్యము
,, కాంతతరాంగి=మిక్కిలిమనోహరమైన శరీరముకలది
64 శఫరులు = చేపలు
,, సింగిణులు = విండ్లు
66 కచము = తలవెండ్రుకలు
69 నవ్వుడాలు = నవ్వుకాంతి
70 అన్వయము = వంశము
,, రోలంబము = తుమ్మెద
,, పెనువళావళి = మిక్కిలివేడుక
71 బేడిస = ఒకవిధమయినచేప
73 చిప్పిలు = పైకివెడలు
74 వాతెఱ = పెదవి
75 బంధుజీవకము = మంకెనపువ్వు
78 ఇరుగడలు = రెండుప్రక్కలు
79 పురుడింపఁదగునె = సరిపోల్పవచ్చునె
80 కోకయుగళి = చక్రవాకముల జోడు

పద్యము
81 గంభీరసరసి=లోఁతుగలకొలఁకు
83 ప్రేఁగు = బరువు
86 శాలిగర్భములు = వరిపొట్టలు
87 కైతవము = కపటము
87 శృంగము = కొమ్ము
89 కరువు = పోతపోయుటకు కట్టిన మూఁస
90 భూతము = పవిత్రము
92 వాసి = అధికము
,, ఱెక్కనులి=ఱెక్కలచిక్కను

పద్యము
93 శబలితచిత్తయై=అనేకవిధము లైన అంతఃకరణవృత్తులు కలదియై [దేవునిమాట
101 అంభోజాతజాతోక్తి=బ్రహ్మ
103 అగజ = పార్వతి
105 ఉప్పరవీథి = ఆకాశమార్గము
,, అవిరళము = అధికము [చుచు
106 పసిగొంచు=వాసనపట్టి గ్రహిం
108 దర్పణము = అద్దము
109 నయించి = కూర్చి
110 అగమ్యములు=తెలియరానివి

## తృతీయాశ్వాసము

పద్యము
10 అభీష్టము = కోరిక
12 వావిరి = అధికము
13 పొంతకు = దగ్గరకు
14 అప్రతిషిద్ధము = నిరాకరింపఁ బడనిది
18 సోయగము = చక్కఁదనము
21 వేసలి = జడ
25 వినుకలి = వినుట
,, కనుకలి = చూచుట
28 నివ్వటిల్లు = పుట్టు
29 కీరము = చిలుక
32 దండకరిగి=దగ్గరకుచేరి
,, తఱి = సమయము

పద్యము
34 మందస్మితము = చిఱునగవు
,, ఛవి = కాంతి
,, ప్రోది = అభివృద్ధి
35 పువ్వుంధయము=తుమ్మెదలు
36 తంతన్యమానము = మిగులనధిక మగుచున్నది [తొలఁగియు
38 క్రేడించియు = ఒకప్రక్కకు
39 అక్కు = పక్షము
,, అజస్రము = ఎడతెగకుండ
40 చొక్కి = పరవశయై
41 కొంచిన = సంకోచించిన
42 రసభావములు = శృంగారరస మును, చేష్టలును

పద్యము

43 కాంతాళంబున=అధైర్యము చేతను

44 వైగుణ్యము = విరుద్ధగుణములుండుట

45 సుబ్బదె = ప్రకాశింపదా

46 యదృచ్ఛనపోలెఁ తలవనితలఁపు చేతనువలె

47 కఱదులపులుగు = నేర్పుగల పిట్ట

48 కైవడి = పోల్కి

,, కందళింప = అంకురింప

51 ఏకతమాడఁగ=ఆలోచించుకొనుచుండగా

52 కఱుదులు = జాణతనములు

,, పన్నిదము = పందెము

55 నాటితకవిధానము = అభినయప్రకారము

61 ప్రహారము = దెబ్బ

,, కంకణాంకములు = కడియములగురుతులు

63 గెలుపోటులు = జయాపజయములు

66 సంగతి = స్నేహము

67 ప్రణయము = ప్రేమ

68 మంతనము = ఆలోచన

70 ఉద్దాడింప = మనసునుకలతపెట్ట

పద్యము

75 అంజక = భయపడక

79 కతరాజవు = ఎల్లవృత్తాంతములకు ప్రభువవు

81 పట్టి = కొమరుఁడు

82 భుజసత్త్వము = బాహుబలము

84 పిక్కటిలు = అధికమగు

,, అవహిత్థ=సిగ్గుమొదలగువానిచే గోపనము చేయుట

85 కమనీయము = మనోహరము

89 సాప్తపదీనము = ఏడుమాటలు మాటాడుట

96 ధాయ్య = అగ్ని ప్రజ్వలింపఁ జేయునపుడు చదివెడు ఋక్కు

,, కింకరుఁడు = సేవకుఁడు

97 వేపంగ = పరితాపము కలిగింప

99 ప్రారబ్ధము = ఈజన్మమునకు కారణభూతమయిన పూర్వకర్మము

100 నిర్మథనుండు = నశింపఁజేయువాఁడు

102 మఱుపటిమేనన్=ఇంకొకజన్మమునందు

103 ప్రాగ్భవము=మునుపటిజన్మము

105 నిపిడనము = రాయిడి

108 ఎడరు = ఆపద

109 వెడమాటలు=వ్యర్థములగు పలుకులు

పద్యము
111 ప్రణయకలహాము=పొలయలుక
114 సౌరభము = గుణాతిశయము
118 మువ్వడి = మూడురెట్లు
,, విమర్శవంతులు = బాగుగాపరికించువారు
121 ప్రథితుఁడు = ప్రసిద్ధుఁడు
122 తమకించు = వేగిరించు
124 పలవని = కోరరాని
125 మోవిసరసత = పెదవియొక్కసారస్యము అనగా నెఱ్ఱదనము
130 పక్షములు = ఱెక్కలు
131 దవ్వ = దూరము

పద్యము
131 పఱచె = పరుగెత్తె
135 అడకించెదో = పరిహాసము సేయుదో
140 సుధ = అమృతము
141 పచ్చగాగ = దాఁపఱికము లేనిది యగునట్లు
142 నీయోజ = నీవిధము
147 చలము = పట్టుదల
,, పపంచు = ప్రకటించిన
148 విపిక్తస్థలము=ఎవ్వరులేని చోటు
152 అపరకావ్యుఁడు = రెండవ శుక్రాచార్యుఁడు

## చతుర్థాశ్వాసము

పద్యము
1 గోష్ఠి = సంభాషణము
,, సురగురుఁడు=బృహస్పతి
,, ఆరామవర్తి=పూఁదోటలోఁ చరించువాఁడు
10 నవనిధానములు = కుబేరుని తొమ్మిది సొమ్ములరాసులు
13 సౌవిదప్రతతులు=అంతిపురము లోనిసేవకులసముదాయములు
16 పగవీడు = శత్రుపురము
19 అర్తిమలి=ప్రేమ [లచేనైన బాధ
20 భావజశరపీడ=మన్మథబాణము

పద్యము
26 కేళవులు = ప్రక్కతావులం
35 ధృతి = స్థైర్యము
,, హననము = చంపుట
41 కందవిత్తు=కందవిత్తనము-కంద విత్తనమువృద్ధిపొందునట్లు
48 కులిశము = వజ్రాయుధము
50 ప్రత్యయము = నమ్మకము
52 అల్లుఁడనము = అల్లుఁడగుట
57 చణత = ప్రసిద్ధి
60 సోనలు = ప్రవాహములు

పద్యము

61 సిద్ధాంతము=ప్రమాణములచే నిర్ణయింపఁబడిన యర్థము

,, కాణాదము = కణాదునిచేఁ జెప్పఁబడిన వైశేషికమతము

,, గౌతమీయము = గౌతముని న్యాయశాస్త్రము

,, సాంఖ్యము = కపిలుని తత్త్వశాస్త్రము

,, భుజంగాగ్రణీ వాణీమార్గము = పతంజలి యోగశాస్త్రము

,, జైమినీయము = వ్యాస శిష్యుఁడగు జైమినిచే రచింపఁబడిన పూర్వమీమాంస

,, వ్యాసోక్తశాస్త్రంబు=వ్యాసుని యుత్తర మీమాంస

70 గూఢవృత్తి=రహస్యవ్యాపారము

76 పరిరంభణము = కౌఁగిలి

,, కుట్టమితము=ఒకశృంగారచేష్ట

77 అమర్షము = కోపము

79 అదర్శనీయము = చూడరానిది

81 దశాంతరము = వేఱొకయవస్థ (మరణప్రయత్నము)

84 అవిలంబము = శీఘ్రకాలము

87 ఇయ్యకోలు = అంగీకారము

89 దళితములు = చీల్పఁబడినవి

92 వారసీమంతినులు = భోగము వాండ్రు

పద్యము

92 శాఖానగరములు = పేటలు

96 ఒడ్డోలగము = నిండుకొలువు

98 అపూర్ణతన్=నిండుఁదనముతో

99 దురాపములు=పొందశక్యము గానివి

102 ఊచముట్టుగా = మిగులకుండునట్లు

100 నాంది = మంగళశ్లోకము

107 ఊడిగము = పరిచర్య

,, నేటితమిన్ = ఈరాత్రియందు (శ్లే) నేటి వేడుకను

116 ముప్పిరిగొన్న = దృఢపడిన

,, హేళి = సూర్యుఁడు

122 తిఁరి = ప్రయత్నించి

,, గవిసెనన్ = కప్పుకొండి

,, త్రియామ = రాత్రి

124 జక్కిగము = చల్లుయంత్రము

126 పువ్వులావికలు = పూవులమ్ము స్త్రీలు

127 తేటిగమి=తుమ్మెదసమూహము

139 తోయము = విధము

140 మంజిడి = ఎఱ్ఱనిరంగుతోఁ గూడిన పసపువన్నెగలకోక- (ఇది మాంజిష్ఠశబ్దభవము)

141 గరగరిక = సౌందర్యము

151 ఘృతకోశాతకి=నేతిబీరకాయ

154 ఉపాయనము = కానుక

## పంచమాశ్వాసము

పద్యము

6 మీనాంకుఁడు = చేఁపటెక్కెము గలవాఁడు - మన్మథుఁడు

10 చొక్కు = పరవశమగు

14 అసహిష్ణుత = ఓర్వఁజాలకపోవుట

19 వెరవు = ఉపాయము

23 సరవిని = రీతిని

27 గబ్బివి = లోఁతుమనసుగలదానవు

28 వల్లాడి = మిక్కిలి పెనగులాడి

34 అస్తు = అగుగాక

,, గాంధర్వము = అష్టవిధ వివాహములలో నొకటి

44 గనయుంబు = పోకముడి

46 తరితీపు = ప్రీతిపుట్టునట్లు

57 కరువలి = గాలి

,, గంధూషితదిక్కుంబులు = పుక్కిలించిన దిక్కులుగలవి

58 విలూనము = నఱకఁబడినది

,, పాదపము = చెట్టు

,, ధ్వాంతజాలము = చీఁకట్లసముదాయము

60 ప్రాగ్దిశ = తూర్పుదిక్కు

62 బాహుపురులు = భుజకీర్తులు

,, కుమ్మెలువోయిన = గాయములు పడిన

64 వసివాళ్ళువాడు = మిక్కిలివాడు

69 అవలోకనములు = చూపులు

పద్యము

70 అక్షులు = కన్నులు

78 ఊరు = పేనుగ్రుడ్డు-బ-కాలు

83 ఎల్లి = రేపు

85 వాలాయము = అవశ్యము

88 నాకౌకస్స్వామి = దేవేంద్రుఁడు

97 అవిరతము = ఎడతెగకుండుట

102 సివము = ఆవేశము

110 గోత్రస్ఖాలిత్యము = నామవ్యత్యయము

114 ఉద్యోగము = ప్రయత్నము

118 ముదల = ఆజ్ఞ

126 మానదుఃఖము = కోపముచేఁ గల్గిన దుఃఖము

139 ఉత్సేకము = అతిశయము

131 కళావిదుషి = సంగీతాది విద్యలంబండితురాలు

143 రయము = వేగము

147 లాలనలు = బుజ్జగింపులు

,, రాగిలుచు = అభిలాషకలదియగుచు

149 రాగభంగులు = వలపుయొక్క విధములు

150 సరి = సమానము

151 నవోత్కంఠ = క్రొత్తవేఁకర పాటు

పద్యము

152 మణితము = సంభోగసమయమునఁ బడఁతుల గొంతునుండి పుట్టు ధ్వని
,, ఫణితి = పల్కులు
,, తొత్తు = దాసి
,, అంతేవాసి = శిష్యుఁడు
153 పరామర్శించు=తలంచుచు
155 పిరువీకగు = బాధకుఁడు
157 పొంచి = డాఁగి
159 కయివ్రాలెదు=భూమిమీఁదఁ బడియెదవు
163 ఒడ్డించుకొన = పందెము వేయించుకొన
166 ఎడసెనో = మరలెనో
167 స్మితము = చిఱునగవు
,, తుటారి=దిట్టతనముగలయింతి
,, కినుక = కోపము
171 వెస = త్వర
174 నెత్తలిరిటెలు = చివురులను బల్లెములు
174 పరాగముద్గరములు = పరాగము ను కుమ్మునిప్పులు
176 అంకోపధానము=తొడయను తలగడ

పద్యము

177 మగ్నత = మునుఁగుట
181 చుంబనము=ముద్దుగొనుట
182 క్లిష్టాంగు=శ్రమనొందినశరీరము గలవానిని
184 విదూషకుఁడు=నాయకసహాయులలో నొకఁడు. హాస్యసంభాషణ మొనర్చినవ్వించుట ఇతని ముఖ్యలక్షణము
185 వలగ్నము = నడుము
192 దళవాయి=సేనానాయకుఁడు
193 ఉత్తలపాటు = పరితాపము
195 తొడిబడ = చెదరునట్లు
197 పాఱనాకుచు=త్రోసివేయుచు
198 అసి = కత్తి
200 తమము = చీఁకటి
201 అగ్గించు = స్తుతించు
208 వాలు = కత్తి
211 గవకులు = వాకిళ్లు
216 చిదురుపలు = చిన్నచిన్న ముక్కలు
221 అఘహారణము = పాపమును వారించునట్టిది

## ప్రభావతీప్రద్యుమ్నము

# అకారాది పద్యానుక్రమణిక



*

# పద్యకావ్యములు



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అడవిమల్లెలు | ... | అచ్చు | |
| అధ్యాత్మరామాయణము | ... | అచ్చు | |
| అనిరుద్ధచరిత్రము | ... | 1 | 8 |
| కవిత్వతత్వవిచారవిమర్శనము | ... | అచ్చు | |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 8 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక | ... | 8 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు గలసంపుటము | ... | 4 | 0 |
| అరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము, మూలము | ... | 0 | 4 |
| ,, టీకతో | ... | 0 | 10 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కాలికో | ... | 2 | 0 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | ... | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 18 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 2 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 3 | 0 |
| కవిరాజమనోరంజనము | ... | 2 | 8 |
| కృష్ణదండకము | ... | 0 | 3 |
| కృష్ణరాయవిజయము | ... | 1 | 0 |
| కాశీఖండము, శ్రీనాథకవిది | ... | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 12 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| ,, పెద్దచ్చు | ... | 0 | 4 |
| గౌరోపాఖ్యానము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | | 0 | 12 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారి | ... | 1 | 0 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 4 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 8 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 2 | 8 |
| చిన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |

| | ప్రతి 1-కి | రూ. | అ |
|---|---|---|---|
| రుక్మిణీ కల్యాణము (భాగవతము) పెద్దచ్చు | ... | 0 | 4 |
| ,, సటీక | ... | 0 | 10 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 2 | 0 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 4 |
| దశావతారచరిత్ర | ... | 5 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు | ... | 2 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 12 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 12 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 2 | 8 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 2 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 2 | 0 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| ,, టీకాతాత్పర్యసహితము | ... | 5 | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు | ... | 3 | 8 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద ముద్రితము | ... | 5 | 0 |
| మార్కండేయపురాణము | ... | 4 | 0 |
| మొల్లరామాయణము | ... | 1 | 8 |
| యయాతిచరిత్ర, పొన్నికంటి తెలగనార్య | ... | 2 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|---|
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 6 | 0 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 4 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాధికాసాంత్వనము, ముద్దుపళనికృతము | ... | 1 | 8 |
| రుక్మిణీపరిణయము | ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 2 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వసుచరిత్ర, సటీక | ... | 8 | 8 |
| వసిష్ఠజనకసంవాదము | ... | 0 | 12 |
| వామనపురాణము | ... | 5 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| విష్ణుపురాణము | ... | 5 | 0 |
| విష్ణుమాయానాటకము, చింతలపూడి యల్లనార్యుడు | ... | 4 | 0 |
| వివేకసింధువు, కొండనార్యప్రణీతము | ... | 1 | 8 |
| విజయవిలాసము | ... | 1 | 8 |
| డిటో బులుసు వేంకటరమణయ్యగారిది | ... | 3 | 8 |
| వీరభద్రవిజయము, పోతనది | ... | 2 | 8 |
| వేమనపద్యములు | ... | 1 | 0 |
| ,, బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 8 |
| ,, (2723) చిన్నసైజు | ... | 3 | 8 |
| ,, (2728) ఆంధ్రతాత్పర్యముతో | ... | 7 | 8 |
| వేమనశతకము ,, | ... | 0 | 4 |
| వైజయంతీవిలాసము | ... | 1 | 0 |
| శతకంఠరామాయణము | ... | 2 | 0 |
| శశాంకవిజయము (తారాశశాంకవిజయము) | ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోష్టుబాక్సు 1372, 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.